


## శ్రీమతి వంగల వాణీబాయమ్మ గారు

ఆంధ్రదేశమున సుప్రసిద్ధ కుటుంబములని యెన్నిక గాంచిన వానిలో శ్రీదాసువారి కుటుంబ మొకటి. కీ॥ శే॥ శ్రీదాసు శ్రీరాములు పంతులుగారి నెరుంగని వారుంటరుదు. వారి పాండిత్యము సర్వతోముఖము. స్త్రీ పురుష భేదము లేశమైనా లేక విద్యయను దివ్యధనమును మానవులైన వారందరు సాధ్యమైనంతవర కార్జించి తీరవలయునను వారిలో వీరుత్తమ స్థానమందుండెడి వారనుట పరమ సత్యము. శ్రీయుత కేశవరాయాది పుత్రరత్నములనే కాక పుత్రికా పౌత్రీ వర్గమును గూడ సంగీత సాహిత్య విద్యావిశిష్టముగా నొనరించుట యందేమాత్రము నుపేక్ష వహించియుండిన వారుకారు. దీని కుదాహరణముగ నిందు వారియొక్క మనుమరాలగు శ్రీమతి వంగల వాణీబాయమ్మ గారింగూర్చి యించుక దెలియఁ జేయుట కెంతయు సంతసించుచున్నాము.

ఈ చిరంజీవిని, కీ॥ శే॥ శ్రీరాములు పంతులవారి తృతీయపుత్రుడును హైకోర్టు న్యాయవాదియునగు మ॥ రా॥ శ్రీదాసు మాధవరావు పంతులుగారి వరప్రసాదిని. ఈమె జననము తే 17-8-14 ది. తాత తండ్రుల విద్యాప్రియత్వ మహిమచే నీయమ యొకవంక నాంగ్లేయ పాఠశాల కేగుచు మరియొకవంక నింటియొద్ద నేటి గాయక సార్వభౌమ బిరుదాంకితులగు మ॥ రా॥ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారియొద్ద సంగీతమును నేర్చుకొనుచుండెను. మనలో సాధారణముగా బాలికకు తొమ్మిది పది యేఁడుల యీడురాగానే బడి మానిపించి

పాట చాలించివేయుట యొక్క యనాచారము కదా! ఇట్టి యనాచారములకు దాసువారు దాసులుగాక మొట్టమొదటి నుండియు నే విషయ మందైన నొకపట్టు పట్టి కొనసాగించుట కలవాటు పడియున్నారు. కాబట్టి యిప్పట్టున గూడ మన వాణీబాయమ్మగారి విద్యాభ్యాసమున కెట్టి యాటంకమును వాటిల్లలేదు. పదునారు పదునేడేండ్ల ప్రాయము వచ్చువరకును పితృగృహమున నుభయ విద్యలయందును మంచి పరిజ్ఞానమును సంపాదించు కొనగలిగినది. అంతలో అత్తిలి గ్రామ వాస్తవ్యులును, లోక విఖ్యాతులును ప్రస్తుతము లక్నో విశ్వవిద్యాలయమున నంతర్జాతీయ శాస్త్ర శాఖకు ప్రధమోద్యోగులునైన మ॥ రా॥ శ్రీ వంగల శ్రీరాం, యం. ఏ. పిహెచ్. డి., యఫ్. ఆర్. హెచ్. యస్., గారు ఈ కన్యకామణిని పెండ్లియాడిరి. వివాహమైన యనతికాలముననే యీ శ్రీమతి భర్తతోగూడ బయలుదేరి యూరపుఖండ మందంతటను సంచారము చేసి మరలివచ్చెను. లక్నో నగర నివాస లాభమున హిందీభాషను హిందూస్థానీయ సంగీతమును గూడ సక్రమముగా నభ్యసించి వాటియం దుత్తమ పరీక్షలలో కృతార్థత బొందెను. ఆల్ ఇండియా విమెన్స్ కాన్ఫరెన్సు నందొక సువర్ణ పతకమును, మేరీస్ కాలేజీ ఆఫ్ మ్యూజిక్ అను గానకళాశాల యందొక రజత పతకమును ఈ విదుషీమణి యొక్క గానకళా కౌశలమునకుగా నొసంగబడినవి.

పరమేశ్వరు డిట్టి బుద్ధిమంతుల నాంధ్ర లోకమున నింక నభివృద్ధి సేయుగాక యని మా సోదర సోదరీమణులు నిరంతరము గోరుచుందురుగాక. స॥ కృ॥ మూర్తి.

---

## గీతికా మౌక్తిక హారము:

ముగ్ధమోహన కళ్యాణమూర్తి! నీదు
గళమునన్ గట్ట ప్రేమతో గూర్చియుంటి
వేడి కన్నీటి బొట్టుముత్యాలసరులు—
నామనోహర స్వప్నసూత్రముల చేత
నల్లినట్టి మృదుల చేలాంచలమ్ము
నీదు మృదుగాత్రమును గప్పనొసగుచుంటి—
భావమణులచే వెలుగొందు రత్నమాల
సొగసుగుల్కు నీకబరికాబంధమందు
నేర్పుమై ప్రేమతో గూర్చ నెంచుచుంటి—
ఇచ్చవచ్చినరీతి మ్రోయించుకొరకు
కడకు నాహృదయంపు తంత్రులనుగూడ
రాధికా! నీకె యొసగుచుంటి—

# కరుణ పరిదేవనము

శ్రీమతి కోమలమ్మగారు

నాదనామక్రియ

పల్లవి

జనని భారతదేవి, జయవిలసి, జనని భారతదేవి.

పారతంత్ర్య నిగల బద్ధ
పరమ పూజ్య మృదుల మూర్తే
వీర తనయ వినుత కీర్తే
క్రూర వైరి సంగతార్తే. జనని.

దీనలోక కరుణ రుదిత
మ్లాన వదన సరసిజాతే
హీన జీవనార్త జాతే
సూన (శూన్య) మధుర భావ రీతే. జనని.

మలిన జీర్ణ వసన ఖండ
కలిత శుష్క సుభగ దేహే
గలిత మంద హాస నివహే
లోల శూల శూన్య బాహే. జనని.

# బాల్యవివాహములు

శ్రీమతి యమ్. వేదవల్లి తాయారమ్మగారు

[ఈ వ్యాసము "నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్" వారు జరిపిన వ్యాసరచనపోటీపరీక్షలో ప్రథమ బహుమానమును బడసినది. వ్యాసరచయిత్రియగు శ్రీమతి యమ్ వేదవల్లి తాయారమ్మగారు రాజమహేంద్రవరము ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలలో ఉభయభాషాప్రవీణ 3వ సంవత్సరపు విద్యార్థినిగా యున్నారు. బహు విషయములను, సులభమైన శైలిలో నిమిడ్చి బాల్యవివాహముల యనర్థములనుగూర్చి స్పష్టముగ తెలియబరచుచుండుటచేత ఈ వ్యాసము ప్రథమ బహుమానమునకుఁ దగియున్నదనుట కాటంకము లేదు. ఆంగ్ల పాఠశాలలలోను సంస్కృత విద్యాలయములలోను ఉన్నత తరగతులను పఠించు విద్యార్థినులు, జనబాహుళ్యమునకు తెలియవలసిన విషయములనుగూర్చి ఆంధ్రమున వ్యాసములు వ్రాయునప్పుడు గ్రంథస్థ కఠినపదములకొరకును ప్రయోగములకొరకును శ్రమపడక యిట్టి నైసర్గిక సులభ శైలిలో వ్రాయుటవలన విశేషము ప్రయోజనము కలుగగలదు. ప్రథమ బహుమానము బడసినందుకు శ్రీమతి తాయారమ్మగారికి మా అభినందనములు తెలుపుచున్నాము.

గృ॥ సం॥]

వివాహమన స్త్రీపురుషుల యన్యోన్య ప్రేమమును వృద్ధిపరచునొక పవిత్రమగు బంధము. విహితముగా వహింపఁబడునదగుటచే దీనికి వివాహమను పేరుగలిగెను. పురుషుఁడు భరించువాఁడగాన భర్తయనియు స్త్రీ భరింపఁదగినదికావున భార్యయనియుఁ జెప్పుదురు. అట్టివివాహము లెనిమిది విధములు. (1) బ్రాహ్మము (2) దైవము (3) ఆర్షము (4) ప్రాజాపత్యము (5) ఆసురము (6) గాంధర్వము (7) రాక్షసము (8) పైశాచము. వీనిలోఁ బూర్వకాలమున క్షత్రియులకు గాంధర్వముకూడ నుచితమైయుండెడిది. బ్రాహ్మము మొదలైనవి తక్కిన జాతులవా రాచరించెడివారు. పైశాచమెవరికిని యుక్తముకాదు. ప్రకృతమున మనదేశమం దాచరణయందున్నవి బ్రాహ్మము, ఆసురము, ననిచెప్పవచ్చును. బ్రాహ్మమనఁగా విద్యయు నాచారము కులముగల వరుని బూజించి, వస్త్రాదులనలంకరించిన కన్నెనిచ్చి వివాహమొనర్చుట. ఆసురమన ధనమిచ్చి కన్నెనుగొని తెచ్చుకొని వివాహము గావించుకొనుట. ఈపద్ధతి యిప్పుడు వరునకొసఁగు కట్నము రూపముగాఁ బరిణమించి కన్యాప్రదాతల గృహారామక్షేత్రాదుల నమ్మించి వారల నిర్ధనులం జేయుచున్నది. పాశ్చాత్యులయం దీవివాహ నియమము వధూవరులఁ బాధింపదు. వారివైవాహికములు కంట్రాక్టుసిస్టము (Contract System) ననుసరించియుండి యిద్దరిలో నెవరి కిష్టముగాకున్నను రద్దగును. ఆస్త్రీ వేరొకనిఁ జేపట్టవచ్చును. అట్టియాచారము పతివ్రతామతల్లులగు సీత, సావిత్రి మొదలైన సాధ్వీమణులచేఁ బవిత్రవంతమగు మన యార్యావర్తమున లేమించేసి భారతదేశము చరిత్రలయందును వర్తమానకాలముననుగూడ వన్నెకెక్కి మిగుల ప్రఖ్యాతి నొందుచున్నది.

వివాహము మానవుని జీవితమునకు ముఖ్యవిషయములలో నొకటి. అప్పటి నుండి వాని జీవితములో నొకనూతనశకమారంభమగును. పురుషుఁడు గృహస్థాశ్రమమునుండికాని పైయాశ్రమ స్వీకారము నొంది కృతార్థుడు గాజాలడు. కావుననే నాలుగాశ్రమములందును గృహస్థాశ్రమము మేటియని పెద్దనాదికవీంద్రులు వర్ణించియుండిరి. దానిని నిర్వహించుటకు స్త్రీపురుషు లిరువురు వారివారి కుచితమగు విషయములయందు సమాన శక్తియుతులై యున్నగాని తగియుండరు. భార్యాభర్త లనుకూలదాంపత్యము గలవారైనయెడల నాగృహము భూలోకస్వర్గమని వేరజెప్పవలెనా? అట్లు కానిచో నొకబండికిఁ గట్టిన రెండెద్దులలో నొకటి కుంటియు వేఱొకటి మంచిదియునైన నాశకటమెట్లు గమ్యస్థానముఁ జేరఁజాలదో యట్లే స్త్రీపురుషుల కనుకూలదాంపత్యము లేనియెడల నాభవనము వనతుల్యమై జీవనము దుర్భరమై నరకమువలెఁ జూపట్టును. కాన నార్యులు

శ్లో॥ కార్యేషుదాసీ కరణేషుమంత్రీ।
రూపేచలక్ష్మీ క్షమయాధరిత్రీ।
భుక్తాచమాతా శయనేచరంభా।
షడ్ధర్మయుక్తా కులధర్మపత్నీ॥

అనున్యాయమున గృహిణి యిట్టి ధర్మముల ననుష్ఠింపవలెనని విధించిరి. పురుషులు కూడ తదనుకూలురైన మఱియుశోభిల్లును. పై ధర్మాచరణమునకు విద్య ముఖ్యమైనవానిలో నొకటి. అట్టి సద్విద్యనొంది గృహకార్యనిర్వహణమునేరని బాలిక యత్తింటి కేగిన నామె తనధర్మమునెట్లు నెరవేర్పఁగలుగునో యనుభవజ్ఞు లూహింపఁగలరు.

పై వానిలో ప్రకృతమున మనదేశమున జరుగుచున్న వివాహములు మూఁడు విధములై యున్నవి. (1)అతిబాల్యవివాహములు (వీనిని శిశువివాహములనిగూడ జెప్పనగును) (2)బాల్యవివాహములు(3)యువతీవివాహములు. అతిబాల్యవివాహములు కేవల మజ్ఞానదశయందున్న పసిపాపలకుఁ దలిదండ్రుల సౌకర్యమునుబట్టి జరుగును. బాల్యవివాహములుగూడ నించుమించుగా నట్టివే. యువతీవివాహములు మాత్రము వధూవరులొండొరులు ప్రేమింపనిదే జరుగవు. ఈపద్ధతి నవలంబించిన స్త్రీపురుషులు తలిదండ్రుల యానతి నతిక్రమింతురనియు యుక్తవయస్కులైన వారు కామాంధులై యుక్తాయుక్త పరిజ్ఞాన శూన్యులై యెట్టికులహీనునైనఁ బరిణయమాడు స్థితియందుందురనియుఁ గొందఱి యభిప్రాయము. కాని పరిశీలించినచో మన బాలబాలికలకు సరియగు వివాహోర్హ వయసు వచ్చునంతవరకు వారిని సుజ్ఞానములవను విద్యాభ్యాసమందుంచినఁ బై యనర్థములకు వీలులేకుండుటయేగాక, స్త్రీగృహకార్య నిర్వహణమందునుఁ బురుషుఁడు జ్ఞాన ధనార్జనాదులందునుఁ దగియుందురు. వారికిఁగలుగుసంతానము సహితము సజీవమై యభివృద్ధిగాంచును. వారిదాంపత్యము వర్ణనాతీతమై గృహము సొబగుమీఱి చూపఱకత్యానంద మొనఁగూర్చుననుట యతిశయోక్తి కాజాలదు.

బాల్యవివాహములు చేసినవారిలోఁ బెక్కుమంది పదేండ్లు మించనివారే. స్వల్పసంఖ్యాకులు పండ్రెండేండ్లవఱకు నుందురు. ఇప్పటిబాలిక కెనిమిదేండ్లకు వివాహమైనదనుకొనుఁడు. వరునకొక పదిరెండేండ్లు. వారికి భార్యాభర్తలన నేమో తెలియదు. వివాహవిధులన్నియుఁ బురోహితులునుఁ జేరంటాండ్రునే యొనర్తురు. మిక్కిలిపసిబాలుడైన మాంగల్యముఁ గట్టుటయుఁ బురోహితుఁడే గావించును. బాలిక ముద్దుముచ్చటలఁజూడ వేడుకపడు వృద్ధులకు నేత్రపర్వముగ నాబాలిక శ్రావణమంగళవారములాదిగ నోములుచేయుట, యప్పుడప్పుడత్తవారింటికేగుట మొదలైనవానితో బాల్యము గడచి యౌవనారంభమగును. ఈలోపున నామె గృహిణీధర్మమున కుపకరించు విద్యాభ్యాసమెట్లు చేయగలదు? మనదేశ ముష్ణప్రదేశమగుటవలన బాలికలు 11, 12, వత్సరములకే ఋతుమతులగుచున్నారు. పిదప కొలదికాలమున కత్తవారిండ్ల కేగుదురు. అట్టిబాలిక గర్భవతియై సంతానమునొందిన నామెప్రాణమునకే హాని రావచ్చును. లేదా బిడ్డకైనను బ్రాణాపాయము కలుగును. దైవవశమున నాబిడ్డజీవించియుండినదుర్బలుడగనో యల్పాయుష్కుడగనో యుండి నిరంతరదీర్ఘవ్యాధిచే బీడింపఁబడుచుండును. స్త్రీల కిరువది వత్సరములకుఁగాని గర్భధారణ కనువగు నవయవదార్ఢ్యము కలుగదని వైద్యశాస్త్రజ్ఞుల మతమైయుండ మనబాలిక సరియగు నవయవపుష్టియే లేని కాలమందు బిడ్డతల్లియగుట కడుంగడుశోచనీయముగదా! పైకారణముచే మనదేశమున 100కి 75 శిశుమరణములు కలుగుచున్నవని తెలియుచున్నది. ఇప్పటివారందఱు నిట్లే యుండిరాయన సత్యధికులగు వైద్యులు, వైద్యశాలలే నిదర్శనములు.

పూర్వకాలమున బాల్యవివాహములు చేసిన నేమికీడుమూడినదని కొందఱువాదింపవచ్చును. ఆకాలమున భూమిసారవంతమై సారతరమగుఫలము నిచ్చుచుండెడిది. మనుజులు సత్యభాషులై జితేంద్రియులై త్యాగపరులై పరోపకారపారీణులై యుండెడివారు! ఇప్పటిభూమి నిస్సారము. మనుజుల కసత్యమే ధనము. దుర్బలులు. ఇంద్రియాధీనులు. కాన మనము పూర్వులతో సామ్యమునొందుట 'హస్తిమశకాంతర' మగును. పూర్వాచారములందు విశేషగౌరవముగలవారు పూర్వులుఁనడచిన మార్గముననే నడువవలెనన్న వారియాచార వ్యవహారములన్నియు గాకున్నను గొన్నియేని యాచరింపవలెను. లేనియెడల బాల్యవివాహములు పరిహాసాస్పదము లగును. పాశ్చాత్యనాగరకత ప్రబలియున్న యిక్కాలమునఁ బ్రాచీనసాంప్రదాయములవలనఁ బ్రయోజనము లేకున్నది. పైనిఁ జెప్పినవానికంటె విషాదకరమగు సంగతి బాల్యవివాహములవలనఁ బాలవితంతులసంఖ్య ప్రబలుట.

మనలో భర్త మరణించినస్త్రీని విధవ యందురు. భర్తయననేమియో యెఱుఁగని యజ్ఞానావస్థలో వివాహబంధమునకుఁ గట్టువడిన బాలికకూడ యావజ్జీవము దుఃఖసముద్రమున నీదులాడవలెను. మానవజీవితము

నకు మిగుల నుత్సాహజనకములగు బాల్య యౌవన దశల నా బాలిక కౌమార వార్ధక దశలవలె వెళ్ళింపవలెనన్న యెంతదుర్భరమో యనుభవజ్ఞులకే విదితము.

ఇట్టి నిర్బంధ వైధవ్యదుఃఖాగ్ని కాహుతులుగా జేయబడినవా రెంద ఱపమృత్యువు పాలగుచున్నారు? ఎందఱు స్త్రీలు అమూల్యాలంకారమగు పాతివ్రత్యము నుగోల్పోయి మర్యాద విహీనలగుచున్నారు! మఱియును మనదేశమున వితంతుబాలిక లొందు కష్టపరంపరలు వర్ణింప నశక్యములు. తలిదండ్రులు సోదరులు మున్నగు వారలకుఁ గూడ నామె గడు హేయముగఁ జూపట్టును. తుదకామె జీవితపరమావధి దాస్యమే! ఇఁక నామె భర్తనుగుఱించి యామరణాంతము వైధవ్యబాధ యనుభవించుటకు హక్కుగలదుగాని భర్తసమిష్టి కుటుంబమువాఁడైన నాతని సొత్తు ననుభవించుటకును హక్కులేదు. ముప్పుత్రిప్పులు పెట్టి వారసులిచ్చు భరణమేగతి. అదియైన నసంపూర్ణమే.

ఇంతకంటె విచారతరమైనవి, వృద్ధవివాహములు. పైవి దైవికములుగాని యివి స్వయంకృతాపరాధములు. కనుపారగనిన తలిదండ్రులే తమ ముద్దుబిడ్డలను ధనమున కాశించి వృద్ధపిశాచములకు బలియొసఁగుచున్నారు. ఈవివాహమువలన నుభయకుటుంబముః వారికి తీరని కష్టనష్టములు గలుగుటయేగాక ఆ బాలికజీవితమంతయు నిష్ప్రయోజనమగును. మిక్కిలి వయోభేదముగల యాదంపతుల మనస్సు లొకటియగుట యసంభవము. వారి దాంపత్యము శిలతండుల న్యాయమువలె నుండును. గృహకల్లోలముల కేమియుఁ గొదువయుండదు. ఇట్టి నష్టములకుఁగూడ బాల్య వివాహములే మూలమని చెప్పనొప్పును. జ్ఞానమెఱిఁగిన యేబాలికయు వృద్ధుని వరింపదుగదా! బాల్యవివాహము లంతరించిన వృద్ధవివాహముల కవకాశములేదు.

బాల్యవివాహములుగానివారలుమాత్రము వైధవ్యము నొందుటలేదాయనిన, వారు కొంతకాలము సంసారసంబంధమైన సుఖదుఃఖముల ననుభవించి భర్తయందుఁ బ్రేమవిశ్వాసములుగలవారై యుండి పతి గతించినవెనుక గాఢ వైరాగ్యము నొందుదురు. వీరికిఁగలుగు వైరాగ్యము శ్మశాన పురాణ వైరాగ్యములవంటిదై యుండదు. అది వారి పూర్వపుణ్యముకొలఁది స్థిరమగును. వారికి స్వసౌఖ్యములపై గోరిక నశించి తమ బిడ్డల క్షేమమునకై పాటుపడుదురు. ఐహిక విషయములయందు వాంఛలుడిగిన వారి కాముష్మికము కొలదిగనైన లభించుననుటకు సందియములేదు. బాల వితంతువుల కీలాభము లేమింజేసి వారి మనములయందు వైరాగ్యబీజములైన మొలకలెత్తుటకు వీలులేదు. రాగమన నేమియో విరాగమన నేమియో తెలియనిస్థితియందున్న వారు జీవితము నెట్లు సార్థకపరచుకొనఁగలరు? తుదకు వారుభయభ్రష్టలగుచున్నారు.

పైని వివరించిన బాల వితంతులసంఖ్య మొదలైనవి తగ్గుటకును దేశమున బాలబాలికలవిద్య నభివృద్ధిగావించుటకునుఁ దగి

యుండునని పలుశ్రమలకోర్చి "శారదా చట్టము"ను శాసనసభలయందుఁ బ్రవేశపెట్టి యమలులోనికి రప్పించిన శ్రీ హారబిలాస శారదాగారును, డా॥ ముత్తులక్ష్మి రెడ్డిగారు మొదలైన ప్రముఖులెంతయు వందనీయులు. ఈ చట్టమువలన నల్పసంఖ్యాకులగు బ్రాహ్మణ వైశ్యులకుఁ దప్పతదితరులకేమియుఁ గీడురానేరదు. బ్రాహ్మణేతరులీవిషయమై తగు శ్రద్ధవహించినయెడల బాలబాలికలు విద్యావంతులై యనుకూల దాంపత్యముగలవారై దేశోపకారమున కర్హులగుదురు. సీత సావిత్రి దమయంతి మున్నగు సతీతిలకములవలెఁ బ్రాజ్ఞలైన బాలిక లత్తవారింట్ల కేగినయెడల నత్తమామలకును భర్తకు బాంధవులకు నానందమొనగూర్చి పుట్టినింటికి మెట్టినింటికిని గీర్తినాపాదింతురనిన నతిశయోక్తికాఁజాలదు. రజస్వలానంతర వివాహములు కూడనను పూర్వాచార ప్రియులగు బ్రాహ్మణులు మొదలైనవారును, అతిబాల్య వివాహములను విడిచి (అనఁగా వివాహవయస్సు, 11, 12, సం॥లకు పెంచి) పునస్సంధాననయస్సునైన చట్టమున కనుకూలముగ వృద్ధిజేసిన, దేశమునకుఁ దమ సంతానములకు మహోపకారము గావించిన వారగుదురు. బాలికలకు గృహకృత్యమున కనునగు విద్య వచ్చుటకుఁగూడ దగియుండును. వారికి సహజముగ విద్యాభిలాషయున్నచో విదుషీమణులగుదురనుట సత్యదూరము గానేరదు. కుసుమకోమలములగు బాలికాహృదయములు గృహిణీభారమును వహింపలేవుగాన బాల్యము గడచువఱకు వారి మనములను నిర్మలముగ నుత్సాహవంతములుగఁజేసి వ్యాసంగమున నుంచుట సమంజసము.

---

## శ్యామ సుందరుఁడు

పి. సి. శేఖరన్ గారు

సరసాగ్రగణ్యుడా! శ్యామసుందరుఁడ!
అఖిలార్థవిదుఁడ! ఓ ఐంద్రజాలికుఁడ!
మోహనంబగునీదు మురళినాదమును
వీనులవిందుగా విన్నమాత్రమున
నిలువెల్లఁ బైడిమొగ్గలఁ దొడిగెవల్లి
చంచలత్వమునొందె సలలితాభ్రంబు
సంతోషమునఁ బొంగెఁ జక్రవాకములు
కనకశంఖమునుండి కూసెఁగోయిలలు
శీతాంశుబింబంబు సుధను వర్షించె
నల్లకలువలజంట నవ్విముకుళించె
ముత్యాలకోవపై ముద్దులొలుకంగఁ
జరుబింబఫలమొకటి చిందులన్ ద్రొక్కె
గంధవతుమ్మెదగుంపు గొబ్బునను రేగె
దీర్ఘమూకాలాహి తెయితక్కలాడె
గానమాధుర్యమో? గారడీమహిమో?
తులలేని నీదు ప్రాక్తనజన్మఫలమొ?

# దాంపత్యము

శ్రీమతి చే. కామేశ్వరమ్మగారు

నారాయణమూర్తిగారొక న్యాయవాది. ఆంధ్రభాషయందు కవిత్వ ధోరణిగల మంచి విద్వాంసుడు. ఆయన సమయమంతయు భాషాపాండిత్యమునకై వ్యయపరచుటచే ప్లీడరువృత్తియందు తగినంత రాబడి లేకుండెను. దానికి తోడుగా కుటుంబము వృద్ధియగుచున్నది. ఇంటిలో అయిదుగురు బిడ్డలను, భార్యను పోషింపవలయును.

ఆయనకు నెలకువచ్చు 60 లేక 70 రూపాయీల ఆదాయములోను దినమున కొకరూపాయి చొప్పున కాఫీహోటలునకు ఖర్చుచేయక తప్పదు. ఇంకను, అనేక పుస్తకములు కొనుట కాయన ధనము వెచ్చించుచుండును. ఇంతమందికిని యింటిఖర్చు 20 రూపాయీలుకంటె నెక్కువ పెట్టజాలకుండెను. కాఫీహోటలు ఫలహారములును, నస్యమును గలిసి యాయన సహజ కోపస్వభావమును వృద్ధిపరచెను. ఎన్నిసార్లు కోపమువచ్చిన అన్నిసార్లు కాఫీహోటలున కెక్కువ వెళ్లుచు, తనకోపాగ్నిని కాఫీనీళ్ళతో చల్లార్చుచుండును. ఇంటిలోని కేవస్తువు కావలెనని చెప్పినను ఆయన మండిపడెడు వాడుక.

పంకజమ్మ నారాయణమూర్తిగారి భార్య. భార్యా బిడ్డల యెడల గృహయజమానుని కుండవలసిన యాదరణ, యాకుటుంబమున వెదకినను గాన్పింపకుండెను. పంకజమ్మ సహజ సత్వగుణ సంపన్నురాలు. గృహమునందు భర్తప్రేమయు, బిడ్డలవిధేయతయు లేకుండుటచే నామె మిక్కిలి కృశించుచుండెను. దానికి తోడామె ఉబ్బసపుదగ్గుచేత తీవ్రముగ పీడింపబడుచుండెను. మరియు నామె ప్రతియేట కాన్పులచే, మిగుల నీరసించిపోయెను.

ఇట్టి పరిస్థితులలోగూడ నామె భర్తను కొంచెమైనను దూషింపుట యెరుగదు. సహజ సద్గుణములకు తోడుగా, నామె చిన్నతనము నుండియు, పతివ్రతామణుల దివ్యచరిత్రములం జదువుచు, చదివిన మంచి విషయముల నాచరణయం దుంచుచుండెను. ఆమె వ్యాధి యంతకంతకు ప్రబలమగుచుండెను. భర్త తన యారోగ్యమునుగూర్చి యేమియు శ్రద్ధవహింపడు. ఆయనకు గావలసిన పరిచర్య లెంతక్రమముగా జరుపుచున్నను, యేదోయొక వంక బెట్టుకొని చిరాకుపడుచు, భార్యను కొట్టుచు తిట్టుచు హింసించుచుండును. ఇంటిలో నాయనచర్య లీవిధముగ నుండెను. పైవారల కందరకును నారాయణమూర్తిగారికంటె యోగ్యు లీపృథ్విలో లేరని వసంతి.

ఒకనాటి మధ్యాహ్నము వాడుకప్రకారము, నారాయణమూర్తిగారు భోజనముచేసి సావడిలో గూర్చుండిరి. పంకజమ్మ భయపడుచు, తలుపు చాటుననుండి, పతిని పలుకరించెను.

పం:—దాసీదానికి 4 అణాలు యివ్వాలి, చాలా సార్లు అడుగుతోంది.

నా:—ఏమిటే! నీబ్రతుక్కి నీకు నౌకర్లుగూడా కావలసొచ్చారూ? దయ్యమువలె నింటబడి తింటున్నదిచాలక నీకు దాసీలా? నావద్ద పైసాగూడ లేదు, పో, అవతలకి.

పం.—15 రోజులనుంచిదగ్గు, ఆయాసంచేత ఎక్కువ బాధగానుండి, అంట్లుమాత్రం తోమించాను. దయచేసి, యీ యొక్కసారీ యివ్వండి, ఇంకెప్పుడూ యేపని చేయించను.

నా:—నీకు జన్మమున్నంతకాలం రోగాలే, నీమూలాన్ని నీ పిల్లలమూలాన్ని నా సొమ్ముంతా నాశనమై పోతోంది. నాతో చెప్పకుండా నీకింత స్వతంత్రమా! ఎక్కడనుంచి తెచ్చిస్తావో తెచ్చియ్యి. నన్నుమాత్రం డబ్బడిగావంటే జాగ్రత్త. నా యెదుటనుంచి తక్షణం లేచిపో.

ఆసమయములో అయిల్లాలి మనస్సెంత విచారపడెనో, చెప్పవలనుగాదు. ఆమె మిగుల ఆయాస

ముతో దగ్గుచు, నడువలేక, నడువలేక, అప్పలమ్మ దగ్గరకు పోయెను.

పం:—అప్పలమ్మా! నీడబ్బులు, రెండురోజులు తరువాత యిస్తాను. ఆయన చేతులో యిప్పుడు సిద్ధంగా లేదట.

అప్ప:—అంత గతిలేనిదాన నెందుకు చాకిరీ చేయించుకున్నావమ్మా! పోనీ నా పావలాడబ్బులు దాచుకో, నువ్వెంత, బాగుపడుతావో చూస్తాను. ఈమా టేదేనా, పనిచెప్పతావుగాదూ, ఎప్పుడేనా చేస్తానా? పోనీ డబ్బులేకపోతే బియ్యమేనా యియ్యవమ్మా!

పం:—బియ్యముగూడ యింట్లోలేవు, సాయంత్రానికి చాలడమే చాలకష్టం.

"ఎంత దరిద్రురాలవు బయల్దేరావు, పోనీ నా ఋణాన్ని పడుంటావులే" అంటూ పీడంతా యెగిరిపోయేటట్లు తిట్లు తిడుతూ దాసీది వెళ్లుచుండగా చూసి, పంకజమ్మ నిలువున నీరైపోయింది. అయ్యో! పాపము!! పంకజమ్మ స్థితికి చుట్టుపట్ల వారందరును జాలిపడుచుండిరి. దారుణమైన జబ్బుస్థితి, పైగా భర్త చేత నిరంతరమూ, తిట్లూ, దెబ్బలూ. ఇంట్లో చాలా మంది పిల్లలు అనేకవిధములుగా నామెను తొందర జేయుట, సహాయపడువా రెవ్వరును లేరు. రోగభూయిష్టురాలగు నామె, యింతమందికి గావలసిన పనులు చేయలేక బాధపడుచుండెను. పైగా పథ్యపానములకు గావలసిన పదార్థములేవియు యింటికి తీసుకొని రాడు. భోజనపువేళ 'ఇదిలే దదిలే'దని యా దీన గృహిణిని బాధించుచుండును. ఇన్నికష్టములను ఆమె మిగుల ఓర్పుతో సహించుకొనుచు "క్షమయా ధరిత్రీ" యను లోకోక్తి సార్థక పరచుచుండెను.

అది వేసవికాలము. పంకజమ్మ వ్యాధి దినదినము హెచ్చుచుండెను. రాత్రులందు కొంచెమైనను నిద్ర లేదు. దగ్గుబాధవలన ఆమెకేగాక చుట్టుపట్లవారికి కూడ నిద్రాభంగ మగుచుండెను. 3 సంవత్సరముల యీడుగల యామె బిడ్డయొకడు తల్లిని పాలిమ్మని యామెముఖము రక్కుచు ఏడ్చుచుండెను. తల్లిదగ్గు, కొడుకుయేడ్పు కలసి యా వీధివారందరిని, ఆ యర్ధరాత్రమున మేల్కొలుపుటచే ఆవాడు దొంగల భయమేమియు లేకుండెను. ఆరాత్రి వేడిమి బహుతీవ్రముగ నుండెను. గాలి కొంచెమైనను వీచుటలేదు. మరియు నామె పరున్న గదిలోనికి గాలివచ్చుటకు మార్గము లేదు. ఇంటి జాగ్రతకొరకు ఆభార్యను బిడ్డలను ఆ చీకటి కొట్టులో పరుండబెట్టి నారాయణమూర్తి గారు ఆరుబయట గాలిలో శయనించుట వాడుక. చల్లగాలియంతయు తనకుమాత్రమే హక్కుభుక్తము లన్నట్లు. లోపల జరుగుచున్న గడబిడలవలన ఆయన నిద్రాసుఖమునకు భంగము వచ్చుటచే, నాయన క్రోధపరవశు డయ్యెను.

నారా:—ఏమిటాగోల? ఎవ్వరిని, నిద్రపోనివ్వదలచుకోలేదూ?

పం—నాకు విపరీతమగు బాధగానున్నది. పిల్లవాడు పాలిమ్మని హింసబెట్టుచున్నాడు. ఒక్కసారి వీనిని దగ్గరకుపిలచి, యొక పిప్పరమెంటుబిళ్ళ నిచ్చిన యూరుకొనునేమో!

నా:—ఛీ ఛీ నోరుముయ్యి! నీవు బ్రతికినన్నాళ్ళు నాకు సుఖములేదు. ప్రతిరోజూ నీరోగమువలన నా నిద్ర నశిస్తోంది. ప్రాణంపోదు. మరేమి భయంలేదు లే! వాడికి పిప్పరమెంటుబిళ్ళలు, నీకు జిలేబీలు కొనిపెట్టినయెడల తినుటకు సిద్ధమే, డబ్బెక్కడనుంచి తీసుకురాగలను?

పం:—నిజమే! నామూలాన్ని మీకు చాలాశ్రమ గలుగుతోంది. ఏమిచెయ్యను మరి. మంచివైద్యునెవ్వరిచేనా పిలిపించి, మందిప్పిస్తే తగ్గుతుందేమోనని ఆశగావుంది.

నా:—మరేమియు నక్కరలేదు. పిశాచములాగ నన్ను బాధపెడుతూ పయ్యేళ్ళు బ్రతికేటట్లున్నావు. పూర్వజన్మన్ని యేదోమహాపాతకం జేశావు, ఇప్పుడనుభవించాలి. నేను వైద్యులకి వందలు పొయ్యలేను.

పం:- పోనీండి, నెలరోజులు మా వాళ్ళింటికి పంపితే మందుమ్చుకు వస్తాను.

నా:—అధికప్రసంగ మెక్కువౌతోంది! నిన్ను మీ వాళ్ళింటికి పంపాలిగూడానా! వాళ్ళు నువ్వు గూడా గలిసి నన్ను తిట్టడానికి. వెళ్ళేదానవు నీపిల్లల్ని తీసుకొని శాశ్వతంగా లేచిపో! మళ్ళీ నాగుమ్మ మెక్కొద్దు. నీ వాళ్ళెవరేనా నిన్ను తీసుకు తయారయ్యారంటే కాళ్ళు విరగగొడు తాను.

పం:—అయ్యో! వాళ్ళని నిష్కారణంగా తిట్టడ మెందుకు?

నారా:—ఓరీ! పెద్దాడ! చోప్పొకటి తీసుకురా. ఈ రాకాశిని చావగొట్టి వీధిలోకి గెంటుతాను.

పంకజమ్మకును, ఆమెబిడ్డలకును కట్టుకొనుటకు బట్టలైనా లేవు. ఆమెకున్న బట్టలన్నిగలసి, సగము చిరిగిన రెండు పాతచీరలు మాత్రమేగలవు. అవి మాసి పోయి పీలికలు వేలాడుచుండును. ఉతుకుకొనుటకు శక్తిలేదు. చాకలికి వేసినయెడల, కట్టుకొనుటకు మరియొక బట్టలేదు. ఆమె పిల్లలందరివి పాతపీలికలే. ఇన్ని కష్టపరిస్థితు లొక్కసారి పీడించుచున్నను, ఆ సాధ్వీమణి జంకక, పరమశాంతముతో గృహకార్య ములను జక్కబెట్టుకొనుచు, పతిని, పిల్లలను సంతృప్తి పరచుటకై నిరంతరము పాటుబడుచుండును.

తనకుమాత్రము గావలసిన పదార్థముల నాయన కాఫీహోటలులో తినుచు, గృహమునకు గావలసిన వస్తువులను తెప్పించుట పోత్తిగ మానెను. ఎదురుగా నున్న కోమటికొట్టులో పప్పు బియ్యము మొదలగు వస్తువులను పిల్లలరువు తెచ్చుటచే, ఇంతకంతకు పద్దు వ్రాసి వర్తకుడు కొట్టింపు లాభముతీయుట మొదలుపెట్టెను. ఇంట తగిన భోజనసామగ్రి లేక పోవుటయేగాక, భోజనపు వేళకు మాత్రము తమకు కావలసినవి చేసిపెట్టలేదని యందరును ఆడినురాలిని బాధించుచుండిరి.

ఒకనాటి సాయంకాలము చీకటిపడుచున్నది. ఇల్లంతయు కటికచీకటి, దీపము వెలిగించుటకు కిరస నాయిలు లేదు. ఏమిచేయవలయునాయని యామె చింతించుచున్న సమయమున, నారాయణమూర్తి గారు వచ్చిరి.

నా:—ఇంట్లోదీపం పెట్టడానికిగూడా శక్తిలేదా?

పం:—కిరసనాయిలైపోయింది, అందుచేత...

నా:—నా సంసారమంతా యిల్లాగే నాశనం చేస్తు న్నావు. నిన్నగాక మొన్న తెప్పించిన కిరసనా యిలంతా యేంచేశావు. వేరే అమ్ముకుంటున్నట్లు కనబడుతుంటే. ఓరే, అబ్బాయీ, ఒకకాని సెట్టి కిరసనాయిలు తీసుకురా. చాలాకొంటే, యీ దరిద్రగొట్టు అంతా వొక్కసారే ఖర్చుపెడు తుంది.

ఉదయం 7 గంటలయింది. నారాయణమూర్తి గారు కాలకృత్యాలు దీర్చుకుని, కాఫీహోటలునకు పోవుచుండిరి. అప్పుడాయన పెద్దకుమార్తె <u>లలిత</u> భయముతో దగ్గరకువచ్చి యేదో మాటాడ నుద్దేశిం చుచున్నట్లు తండ్రివంక జూచుచుండెను.

నా:—లలితా! వీధిలోకెందుకువచ్చావు? లోపలికి పో!

నాన్నగారూ! నన్ను బళ్ళోకి పంపించరూ, పిల్లలందరూ, హాయిగా పలకాపుస్తకాలూ తీసుకొని యెంతో ముచ్చటగా బడిలోకి వెడుతుంటే; నేను, చెల్లెలూ, యేడుస్తూ పాత గుడ్డపీలికలు గట్టుకుని లోపల మొద్దులవలె కూచుంటున్నాము. చెల్లెలికి నాకు చెరియొక పరికిణీ కుట్టించరూ, బడిలోకి వెడ తాము.

నా.—లోపలకి వెళ్లు వెళ్లు; మీయమ్మ చదువుకుని పాడైపోయింది. ఆడపిల్లలు చదువుకుంటే యేమీ లాభం లేకపోవడమే గాకుండా నెడ్డసహవా సాలవల్ల పాడైపోతారు. ఇంట్లోకివెళ్లి వంట, పని, నేర్చుకో, నడు, నడు.

తండ్రిచెప్పిన, యీ నిరాశ మందలింపులకు లలితమొగము చిన్నబోయెను. ఆమె యేడ్చుచు తల్లియొద్దకుపోయెను.

కాఫీహోటలు గుమ్మములో నారాయణమూర్తిగారు కాలుపెట్టగానే, హోటలుయజమాని కోపముతో నాయనవంక దిరిగి మాట్లాడ మొదలిడెను.

హో.య:—అయ్యా! ప్లీడరుగారూ! మాకు సొమ్మివ్వదలచుకోలేదూ! ఏప్రిల్, మే, జూన్, మూడు నెలలకైన సొమ్ము యివ్వవలెను గదా! మొత్తమెంత తేలిందో చెప్పి మరీ, కాఫీపుచ్చుకోండి.

నా:—మొత్తంచేస్తా, పుస్తకమిలాగియ్యి(లెక్కించి) మూడునెలల తాలూకు 86-14-0 అయింది.

హో.య:—ఇంతంత బాకీలు పెడితే, బీదవాళ్లం వ్యవహార మెట్లా చేసుకుంటాము చెప్పండి మరి. ఇదిగో మీరు వెంటనే యిస్తేనేగాని వల్లగాదు.

నా:—ఈమధ్య కోర్టుమూయడంవల్ల డబ్బు కిబ్బందిగావుంది. ఏదో ఒక బాపతుచూసి త్వరగానే యిస్తాలే. ముందు కాఫీపంపించు, నీరసంగావుంది. నారాయణమూర్తిగారు ఫలహారంజేసి వచ్చి యింటిగుమ్మ మెక్కుచుండిరి. లోపలినుండి పిల్లలందరు, బిక్కమొగములతో యేడ్చుచు, పరిగెత్తుకొని వచ్చిరి.

పిల్లలు:—నాన్నగారూ! అమ్మ నూతిదగ్గరికి నీళ్ళకోసంవెళ్లి, అక్కడ మెట్లమీద పడిపోయింది. పిలిస్తే మాట్లాడదు. ఇందాకా మాతో కోమటింటికివెళ్ళి కరక్కాయలు తెమ్మన్నది, డబ్బులేక తీసుకురాలేదు. డబ్బివ్వకపోతే కోమటి యివ్వనన్నాడు.

నా:—మరేమీ ఫరవాలేదులే. దొంగవేషాలు నే నెరుగనూ!

ప్లీడరుగారు కాలిజోడు విడిచి నెమ్మదిగా నూతిదగ్గరకుపోయిరి. అప్పుడే ఆమె యూర్ధ్వశ్వాసము విడుచుచుండెను. ముఖమునల్లబడిపోయి, నాడి నీరసించిపోవుచుండెను.

నారాయణమూర్తిగారికి సాధ్వీమణియగు తన పత్నియొక్క అంత్యదశను చూడగానే, యిట్టిదని వర్ణింప నలవిగాని, పశ్చాత్తాపము, దుఃఖముగల్గెను. ప్రేమరసశూన్యుడగు నాయన పాషాణహృదయము గూడ కరగినదయ్యెను. వెంటనే, యాయన తన యిల్లాలిని చేతులమీద నెత్తుకొనివచ్చి, మంచముమీద పరుండబెట్టి విసరుచు, నాడి చూచుచు, నాతురత పడుచుండెను. పిల్లలందరును చుట్టుజేరి "అమ్మా!" యని గుండె పగులునట్లేడ్చుచు నాతురతపడుచుండిరి. పంకజమ్మ యెట్లో కన్నులువిప్పి, దీనదృష్టులతో భర్తవంక చూచుచూ, నేమోచెప్పుటకు పెదవులు కదల్పబోయెను.

నా:—పంకజం! మమ్మందరిని విడిచి వెళ్లిపోతున్నావా! అయ్యో బ్రతికినన్నాళ్లూ నిన్నెన్ని బాధలేనా పెట్టాను. దుర్మార్గుణ్ణి నన్ను క్షమించవూ! నీ కివ్వ డేంగావాలి?

రోగి ఆనందముతో భర్తకంఠమును మెల్లగా కౌగలించుకొనెను.

పం:—నాథా, ధన్యురాలను. ఇప్పుడైనా, మీ చల్లని మాటలు చెవులబడినవి. స్త్రీజన్మ మెత్తినందులకు సార్థకము, తన పతియొక్క ప్రేమపూరితమగు నాదరణ పొందుటయే గాదా! ఇన్నాళ్లు కాపురముజేసి యిట్టి యానంద మెన్నడును నే ననుభవించలేదు. చాలు యింకేమీవద్దు. మీ కనేక నమస్కారాలు. మీరు నన్నెంత హింసించినను మీరే నా దైవమనుభావమే చివర విన్నపము వరకు, మిమ్ము నిందింపకుండాజేసింది. ఓ...క్క...మాట...ఆ...ను...వ...త్రి...వందు.....బ్ర...తు...కు...తా...నే...మో...పిల్ల...లు జా...గ్ర...త...

ఇలా మాట్లాడుచునే, ఆమె కన్నుల మూసుకొనెను. ఆమె కీభౌతిక ప్రపంచమందలి కష్టసుఖములతో పని లేదు. నారాయణమూర్తిగారు తెల్లబోయిరి.



స్నానపు సరదా



'ఆఁ ఆఁ ఫోటో పడింది'

## మహైకదైవసంప్రార్థనము

కవికొండల వెంకటరావుగారు

మ॥ కనులెవ్వానివి చూడఁజేయుమనలన్ గర్వాంధులన్, దివ్యమా
పనులెవ్వానివి లేవనెత్తుమనలన్ భస్మప్రదగ్ధాంగులన్,
గొనబెవ్వానిది కాంతి గొల్పుమనలన్ గోచారకూటస్థులన్
జనులారా! యలసర్వసిద్ధుని భజింపన్ రండు నాతోరహిన్.

చ॥ ఎవనిగృహాంగణంబున వచింతురొ మూగలు, పంగులైనవాం
డ్రెవని సమక్షమందెఱిగి యెన్మిదియంగములన్ భజింత్రొ, గ్రు
డ్డెవని నిదానమున్ బడసి దృష్టిరహింతురొ, యట్టిచిన్మయున్,
గవినుతు, లోకవంద్యు, మమకారనికారుని, భక్తిగొల్చెదన్.

శా॥ దారిద్ర్యంబున గుందువానికిని, డెందంబందుసందేహమై
యారాటంబును బొందువానికిని, విద్యాబుద్ధులుంగల్గి యెం
దూరుంబేరును లేనివానికిని, ముందో వెన్కనో చూతునిన్;
నారుంబోసినవాఁడు నీరిడఁగ నండన్ నిండు కుండన్ బలెన్.

చ॥ కలిమి యశాశ్వతంబు, దొరగర్వమునిల్వదు, వేరమెచ్చుకే
చెలిమి, బలంబుసన్నగిలు, సృష్టిలయించును, నిత్యమైన ది
య్యులనొకఁడేనిఁగానఁబడ; డెందుకు? నందడిమమ్ముద్రోయకో
ఫలరహితా! స్వకర్మపరిపాకవిజేత! పితామహఃపితా!

చ॥ ఎవనిది యీశరీరమననెప్పుడొ తల్లిగతించు దండ్రియున్
దవిలెడుమిత్తి; తాతలును తాతలతాతలు జ్ఞప్తికేఁగనఁ
మివులరు; నీవొకండవనుమీ యల యందఱకాదివన్న చొ
ప్పవుచు రహించువాఁడవెద; నంజలి నీకు మహానుభావుఁడా!

చ॥ రగులగనీకు కర్మఫలరాశిని, రాగములెత్త నీకు, మీ
శుగొనమె నీగుణంబుప్రియసోదర! చూడుము చెట్లుగాయుటన్,
పగలగుటన్, ప్రశాంతిగను వాహినినీరము జాలువాఱుటల్,
మొగిళులు వానలన్ గురిసి భూమిని బచ్చనఁబుచ్చు టర్మిలిన్.

మ॥ మఱువన్ రానిది, మాటిమాటికిని సంభావించినన్ బూర్తిగా
నెఱుఁగన్ రానిది, లేని, దున్నది, బహిఃప్రేమంబుకున్ మానసాం
తరరాగంబుకు మూలమైనయది, సత్యాధారమైనట్టి, దు
త్తరపూర్వాంశమునెల్లనేర్చినది, వార్తన్ చెప్పుచున్నట్టి, ద
య్యరుదౌదానిని, నాత్మశక్తిని, తటస్థంబైనదానిం, భజే.

చ॥ సకలమువాఁడు నేనె యిదిసత్యము! నమ్ముడి నమ్మకుండుడీ
యొకరుఁడనేను వాఁడొకరుఁడొప్పఁగఁగూడిన నొక్కరుల్లమే!
వికలత లేదు మాకెపుడు, విశ్వముకంతకు నుండుఁగాక; వాఁ
డకుటిలుఁ డాదిసంభవు డనాదిమహాపురుషుం; డెవండ నేన్?

శా॥ భావజ్యోతికినూనె, వత్తి, ప్రమి, దావాసంబునా నేమహా
భావంబూనిక ప్రజ్వరిల్లునదొ; లో ప్రజ్ఞాప్రసూనంబునున్,
దీప్తై, చేవయు, తేవయున్, సొబగునై తేలించునో సౌరభ
శ్రీవిస్తారత; నామహావిబుధమున్ ప్రేమింతుఁ గామింతునే.

---

## దేవదూత

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి. ఏ. బి. యల్.,

నిన్నను జానకీ! పున్నమిరయాట
వెన్నెలజూచుచు గన్నులమూయ
గాఢాంధకారంబు గప్పినట్లయ్యె,
కప్పిన తమసంబు కరగినట్లయ్యె;
కరగినంతనె గాలిఁ దిరుగుచువచ్చు
దివ్యకాంతులశోభ తెలిమబ్బువోలె!
ఆ కాంతిజలదంబు నరయగాలేక
కనుమూతపడియె నావనదంబు విడియె!
వనదంబులోనుండి ప్రభలగ్రక్కుచును
మోమున శాంతంబు పుష్పించుచుండ
పట్టురెక్కలు రెండు ప్రక్కలవ్రేల
దేహమంతట దివ్యతేజంబునిండ
మంగళ కారుణ్య శృంగారమూర్తి
దరహాసమొప్ప నాదరిజేరి యనియె:—
"దేవదూతను నేను, దేవకార్యంబు
తలదాల్చి నెరవేర్ప ధరణి వ్రాలితిని;
విమలాత్మ బరమేశు ప్రేమించువారి
పుణ్యనామములతో బోవలెవేగ!"
అనగ బ్రశ్నించితి నాత్రమ్మతోడ
"నేనుగల్గుదునె యామానవులలోన?"

దేవదూత వచించె "నీవుగనరావు,
సద్భక్తులేగడి జూడనే బోవు!"
అనిన ఖిన్నత తోచె, నైనదీయుక్తి
వేలుపుతో నిట్లువిన్నవించితిని;
"సతుల నలచే పుణ్యజనులతోనైన
జేర్కొనుమా నన్ను విశ్వేశుప్రోల!"
పలుకులాడినయంత వదనంబుకూడె,
మంగళాకారంబు మాయమైపోయె;
వెన్నవలెనున్న యావెల్లనౌమబ్బు
వెన్నెలజాడల వినువీథి కెగసె!
నేడట్లు శయనించి నిదురించినంత
చనుదెంచి నాప్రోల వనదంబు విడియె
కళ్యాణదేహుండు కాన్పించెమరల!
చిరునవ్వు మోమున జెలువారుచుండ
కమనీయ హేమాక్షరముల పొత్తంబు
తీసి "నెయ్యుడ! దీనితిలకింపు" మనియె;
తిలకించినాడ నే పులకింపనొడలు!
పరికించినాడ జీవనఫలంబెల్ల!
పరమాత్మ ప్రేమించు నరసమూహమున
నాపేరె జానకీ! యమరె ప్రథమమున!

# ప్రశ్నోత్తర రత్నమాలిక

ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతిగారు (అనువాదకులు)

"స్వామీ కృష్ణానందజీ"

ప్ర॥ నీతియన నేమి?

ఉ॥ గతి లేక ప్రాప్తికి నీతియని యందురు. అనగా నేర్పరితనముచే ఎట్టి కార్యముయొక్క ఫలము నియమము తప్పక ప్రాప్తమగునో దాని పేరు నీతి.

ప్ర॥ దృష్టాంతరూపముగా తెలియజేయవలెను?

ఉ॥ ఏ ఉపాయముచే రాజు రాజకార్యమును నియమబద్ధముగా నిర్వహించుచున్నాడో దానికి రాజనీతి యనియు, దేనిచే సంఘము నియమానుసారముగా నడచుచున్నదో దానికి సాంఘికనీతి యనియు, దేనిచే యుద్ధకార్యము బాగుగా సంపన్నమగుచుండునో దానికి సమరనీతియనియు, ఏ ప్రణాళికచే నీతికార్యము నియమము తప్పక నెఱవేరుచుండునో దానికి గృహస్థనీతి యనియు, దేనివలన మానవులు తమతమ కర్తవ్యములను సాధన ద్వారా జీవితమును పవిత్ర మొనరించుకొని భగవచ్చరణకమలమును లభింపజేసికొందురో దానికి ధర్మనీతి యనియు పేళ్లు.

ప్ర॥ నీతికి సునీతికి భేదమేమి?

ఉ॥ ఎయ్యది ప్రాప్తమగునో దానిని నీతి యందురు. అన్ని కార్యముల యందును నీతికలదు. దొంగతనము, అసత్య మాడుట మొదలగు దుష్కార్యములందు సైతము నీతికలదు. కాని దానిని దుర్నీతి యందురు. ఎట్టి మార్గమును అవలంబించినచో మనుష్యుడు సన్మార్గగామియై మంచి ఫలమును బొందునో దానికి సునీతి యని నామధేయము. మంచి శిక్షణమే సునీతికి మూలకందము.

ప్ర॥ సునీతిని అభ్యసించుటవలన ప్రయోజన మేమి?

ఉ॥ దాని నభ్యసించినచో మన మెట్టి కార్యమందు ప్రవేశించినను అనాయాసముగా నియమానుగుణ్యముగా సుఖమును బొంది దానిమూలమున శుభ ఫలము చేపట్టగలము. దానిని మిగుల నభ్యసించి నప్పుడు, సంభవించుచున్న వృథాకలహము, వివాదము, అసభ్యత, మార్ఖ్యము, దార్ష్ట్యము, ధౌర్త్యము, కాపట్యము, ప్రవంచనము మొదలగు నన్నియు నశించును. న్యాయస్థానములయందు మిథ్యాభియోగములు, అందువలన వ్యర్థముగా నర్థవ్యయము సంభవింపవు. దుష్టులనిమిత్త నత్యాచారము, వేశ్యాలయగమనము, మద్యాదిసేవనము మొదలగు మహాపాపములు, సంఘమందలి దారిద్ర్యదుఃఖములు మఱి వృద్ధిజెందవు. సాధారణమైన ప్రభుత్వమునకై మానవశోణితము యుద్ధభూమియందు మఱి ప్రవహింపదు. ఇంతయేల? సంఘము మిగుల ఉపద్రవరహితమై యలరారును. ఇందువలన శారీరక మానసికాధ్యాత్మికోన్నతి చేకూఱును. పరివారమందును, సంఘమందును, ఇహలోకమందును, పరలోకమందును సుఖములన్నియు స్వేచ్ఛగా సునీతి శిక్షణముపై నాధారపడియున్నవి.

ప్ర॥ సునీతి మార్గమును విడచుటచే నష్టమేమి?

ఉ॥ మంచి ప్రవాహవేగముగల నదిమీద వారధి యుండినట్లు, భయంకరమైనదియు తరింప నలవి కానిదియు నగు సంసార నది మీద నుండు సునీతి మార్గమనే ఈ సేతువునుండి భ్రష్టుడైన వానికి దుఃఖము, క్లేశము, వినాశము తప్పవు.

ప్ర॥ నీతి కధీనుడై కార్యమును నిర్వహించుట మానవకల్పితోపదేశమా లేక పరమేశ్వర నిర్దిష్టమా?

ఉ॥ ఇది మానవకల్పితము కాదు. భగవద్వ్యవస్థయే ఇట్లు సృజింపబడినది. ఇది యొక రేఖాప్రాయముగా అవలంబించి మానవుని జీవితోద్దేశమును సార్థక మొనరించును.

ప్ర॥ దృష్టాంతరూపముగా నెఱుంగజేయవలెను.

ఉ॥ చంద్రసూర్యుల పూర్వోదయము, పశ్చిమాస్తమయము, గ్రహనక్షత్రాదుల పరస్పరాకృష్ణనియమము, మేఘమునుండి జలదానము, అగ్నినుండి ఉష్ణప్రకాశము, వాయువునుండి నిశ్వాస స్పందనము, వృక్షములనుండి పుష్పఫలపత్రచ్ఛాయాదానము— ఇది యెంతయు ప్రకృతి నియమ బద్ధముగదా! ఈ నియమమునుండి దాటిపోవుశక్తి దేనికిని లేదు. ఈశ్వరుని ఈ నియమము ఉల్లంఘింపబడినపుడు జగత్తు ప్రళయము కావలసినదే! కావున ప్రకృతి నియమబద్ధమైనట్లు మన జీవితమునందలి ప్రత్యేక కార్యము నియమమునకు, నీతికి నధీనమై యాచరింపబడినచో లేశమాత్రమైనను క్లేశమునకు తావుండదు. సునీతి శిక్షణమే యీశ్వరుని యభిప్రాయము.

ప్ర॥ ఆరోగ్యవంతుడెవడు?

ఉ॥ ఎవనికి దౌష్ట్యము, కాపట్యము, కామక్రోధాది వికారములు లేవో వాడే ఆరోగ్యవంతుడు.

ప్ర॥ వీరుడెవ్వడు?

ఉ॥ జితేంద్రియుడు.

ప్ర॥ సుఖియెవ్వడు?

ఉ॥ భగవద్భక్తిసంపన్నుడు.

ప్ర॥ బుద్ధిమంతుడెవడు?

ఉ॥ కార్యము ప్రారంభింపక మునుపు పరిణామ ఫలమును ఎవడెఱుంగునో వాడే మేధావి.

ప్ర॥ ధన్యుడెవ్వడు?

ఉ॥ సాధుచరిత్రుడు.

ప్ర॥ ధనవంతుడెవడు?

ఉ॥ సంతోషయుక్తుడు.

ప్ర॥ పరాధీనుడెవ్వడు?

ఉ॥ దుష్టవాసనలకు దాసుడై యింద్రియలోలుడైన వాడే పరాధీనుడు.

ప్ర గ్రుడ్డివాడెవడు?

ఉ॥ వివేకము, సత్సాంగత్యము, అను నేత్రములు లేనివాడు.

ప్ర॥ చెవిటివాడెవడు?

ఉ॥ సదుపదేశమును, నీతిపద్ధతిని వినజాలనివాడు.

ప్ర॥ మూగయెవడు?

ఉ॥ మృదుమధురములగు సత్యవాక్యములను పలుకజాలనివాడు.

ప్ర॥ మృత్యువెయ్యది?

ఉ॥ జీవితమునందు పవిత్రత, పరోపకారపరాయణత పరమార్థచింత లేకుండుటే మృత్యువు. అనఁగా అట్టివాడే జీవన్మృతుడు.

ప్ర॥ స్వర్గమన నెయ్యది?

ఉ॥ సజ్జనులతోడి గోష్ఠికిని భక్తితో నీశ్వరమననము నొనర్చుటకును స్వర్గమని పేరు.

ప్ర॥ నరకమన నెయ్యది?

ఉ॥ భగవానునియెడ నవిశ్వాసము, శరీరాభిమానము, అహంకారములని యున్మత్తతయు నరకమనుభవించి నట్లెఱుంగనగు.

ప్ర॥ పద్మముకంటె కోమల మెయ్యది?

ఉ॥ దయావంతుని హృదయము.

ప్ర॥ పాషాణముకంటె కఠిన మెయ్యది?

ఉ॥ కులటాహృదయము.

ప్ర॥ గ్రహింపదగిన దెయ్యది?

ఉ॥ సజ్జనుని పరామర్శ.

ప్ర॥ విడువదగిన దెయ్యది?

ఉ॥ కపటము, కుచ్ఛితము, విశ్వాసఘాతుకత్వము.

ప్ర నిజముగు బంధువెవ్వడు?

ఉ॥ ఒరుని దుఃఖమును జూచిన యెవని నేత్రములశ్రుధారాసిక్తములో, లోకముఖమున మిత్రుని నిందను, కుత్సను ఆలకించి ఎవడు యొన్నటను దానిని ప్రచురింపక రహస్యముగా నుపదేశించునో, నీమర్యాదను చెడగొట్టుటకు నితరుడెవ్వడో ప్రయత్నించుచుండగా మిన్నకుండక వీరునివలె నిన్ను సమర్థించునో, గౌరవమర్యాద సంఘమును సమీపించినపుడు నీకంటె అధికుడయ్యును ఎవడు అహంకారము వహింపక మిత్రోచిత సత్కారమును జేయ నెనుదీయడో, దౌర్భాగ్యవశమున దరిద్రుడవైనపుడు ఎప్పటివలెనే

నీయెడ సద్భావమును ప్రదర్శించునో, నిన్ను గాంచిన యపుడు తన్ను సుఖవంతునిగా దలంచుకొనునో, అట్టి సమయమున నిన్ను విడువక నీహితమును గోరుచుండునో, కష్టకాలమునందు (రుగ్ణశయ్యయందున్నప్పుడు) నిన్ను సదా సేవించుచుండునో అట్టివాడే బంధువు. సర్వకాల సర్వావస్థలయందు నీతో గలసి నీమనస్సును రంజింపజేసి ఆమోదప్రమోదములయందు సహకారియైనవాడు బంధువుకాడు. సద్గురువు నీకు హృదయబంధువు. భక్తవత్సలుడగు భగవంతుడు పరమబంధువు.

ప్ర॥ తల్లిదండ్రుల లక్షణము లెయ్యవి?

ఉ॥ రక్తము, మాంసము, మేధస్సు, మజ్జ, అస్థి, రసము గలిగించి నంత మాత్రమున గాక విద్య, నీతి, ధర్మము, జ్ఞానము మొదలగు శిక్షణముల వలన పుత్రీపుత్రుల శరీరమును, మనస్సును, ఆత్మను ఎవరు కల్యాణమొందింప జాలుదురో వారే నిజముగ తలిదండ్రులు.

ప్ర॥ బలవంతు డెవ్వడు?

ఉ॥ శరీరముకంటె ధనబలము శ్రేష్ఠము. ధనముకంటె విద్యాబలము, విద్యాబలముకంటె బుద్ధిబలము. బుద్ధిబలముకంటె ధర్మబలము ప్రశస్తములు. తపోబల ధర్మబలముల మూలమున ఆత్మసాక్షాత్కారమును బొంద జాలినవాడు మిగుల బలశాలి.

ప్ర॥ అందరికంటె ఉచ్చపదస్థు డెవ్వడు?

ఉ॥ భగవానుని పదకమలములను సేవించువాడు.

ప్ర॥ ప్రాప్తవ్య మెయ్యది?

ఉ॥ భగవానుని కృప.

ప్ర॥ అది యెట్లు లభించును?

ఉ॥ మంచి నీతిమార్గమును అవలంబించి ధర్మానుష్ఠానపరుడైనచో లభించును.



# భావచిత్రీకరణము

బులుసు రామజోగరావుగారు

తొలిపలుకుతోఁటకు నీళులకాల్వపై తెప్ప
చలిచాపపై పూల
వలపింపులనఁజాలు
కులుకారు తొలకరు
ల్పులకాంకురము లీవ!
కలకలల్జిత్రించి కాంచనాంబరలక్ష్మి
తిలకించి దీవించునో? పీయూష
మొలికించి యేలించునో?
సరిజూచి విరులకాపరిఁజూచి నవ్వ చూ
పరిఁజూచి వయసు మే
ల్పరిఁజూచి సొగసుదా
పర మన్నె దొరసాని
కురువేరు పిల్లక
వ్వారవుఁదావుల పూల పుప్పొడులతో మేల
మరగాడ్పులోనుంచి యూసఁ గొల్పుచునుండ తరవతానటే ? నిల్వ.

# పాచికలాడుట

శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు

దక్షిణహిందూదేశములోఁగొన్ని భాగములందుఁ గార్తికమాసములోని శుద్ధపాడ్యమి నాఁడును గొన్ని భాగములలో మకరసంక్రాంతి దినములలోను బాచికలో పేకయో యాడుచుందురు. పాచికలాడు నాచారములోని విశేషము "ధర్మాబ్ధిసార" మను గ్రంథమున వివరింపఁబడినది. అనాఁడీక్రింది ధర్మములు నెఱవేర్ప వలయునఁట:—

(1) బలిపూజ (2) దీపారాధనము (3) గోక్రీడనము (4) గోవర్ధన పర్వతపూజ (5) మార్గపాళిబంధనము (రోడ్లమీఁదఁ దోరణాదులం గట్టుట) (6) యష్టికకర్షణము (వెదురు గడలను బెరుకుట) (7) నూత్నవస్త్రధారణము (8) పాచికాలాడుట (9) స్త్రీలారతి నిచ్చుట (10) పుష్పమాల్యధారణాది కృత్యములు.

పైవానిలోఁ బాచికలాడుట యొకటి గదా! ఆనాటి యుదయమున నెల్లవారును బాచికలాడ వలయునఁట. గెలుపొందినవారు సంవత్సరమంతయు జయము గాంతుమని నమ్ముచుందురట. అందుఁగూర్చి నిర్ణయసింధువులో నిట్లు చెప్పబడియున్నది:—

"ఈ దిన ప్రాతఃకాలమున నందఱును బాచికలాడ వలయును. ఎవరు గెలుతురో వారికి వత్సరమంతయు గెలుపే. ఎవరోడుదురో వారికి వత్సరమంతయు నపజయమే. పురుషులందరు నాటిరాత్రి తమ భార్యలతో వినోదలీలఁ బుచ్చవలయును." -

మఱియు కాశీఖండముయొక్క 88-వ అధ్యాయములో నగస్త్యుఁ డిట్లు చెప్పినట్లున్నది:—

అగస్త్యుఁడు:— షణ్ముఖా! నారదుడు కైలాసమును జేరినపిమ్మట నేమి జరిగెనో చెప్పుము. ఆకథ చాలనింపుగానున్నది.

స్కందుడు:— కుంభజా! వినుము. నారదుడు కైలాసగిరి కేగిన తర్వాత నేమి చేసెనో చెప్పెద వినుము. ఆకాశయానముచే శివునియిల్లు చేరి శివాశివుల సందర్శించి వారిచే నుచిత సత్కారములంది సుఖాసీనుఁడయ్యెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు ప్రీతితోఁ బాచికలాడుచున్నారు. ఆయాట తత్త్వముంగూర్చి కుతూహలము గలవాడై నారదుఁడు వారికిట్లనియె:— "దేవదేవ! యీసృష్టియే నీయాటకుఁ దగినస్థలము. (క్రీడాగారము) ఆట నెత్తముమీఁది 12 కచ్చులును సంవత్సరములోని 12 నెలలు. పలకమీఁద గీయబడిన నలుపు తెలుపు గీతలు $15 \times 2 = 30$యును, నెలలోని 30 దినములు. రెండుపాచికలును రెండయనములు. రెండు పుడకలును జయాపజయములు, లేక, సృష్టివినాశములు. దేవియొక్క జయమే సృష్టి. దేవర జయమే లయము. మీక్రీడాకాలమే స్థితి. ఇట్లు ప్రపంచమంతయు నొకయాట. ఆయాట నిర్మలమై స్వల్పమైనదై మీ దైవదంపతులకు నడుమ జరగునది. ఇందు నీవుగాని దేవిగాని గెల్వొందరు. జననీ! నేను

మనవిచేయునది వినుము. శివుడు సర్వజ్ఞుఁడై నను, ఇందేమియు నతనికిఁ దెలియదు. అతనికి గౌరవాగౌరవములు లేవు. అతనిస్వభావ మాఁకటయే. అతనికితరగుణములులేవు (నిర్గుణుఁడు). అతఁడు జాగ్రదవస్థలో నున్నను, వికృతి లేకుండును. అతఁడు సర్వమునకును మధ్యస్థుఁడై యున్నను, అన్నిటికి నాధారుఁడై యున్నాఁడు." ఇత్యాది.

మహాభారతములోని సభాపర్వము యొక్క ౯౫-వ అధ్యాయమందు దుర్యోధనునితో శకుని యిట్లనెను:—

"నీవు లక్ష్మినిబోలు నందముగల యతివను జూచితివిగదా? ఆమెను సంపాదించెడు మార్గమునుజెప్పెద వినుము. నే నక్షవిద్యయందుని పుణుఁడను. నే నందలి మర్మమును బాగుగా నెఱింగినవాఁడ నౌటచే గెలుపొందు విద్దెయొద్దియో లెస్సఁగా నెఱుఁగుదును. క్రొంతేయుఁడెంత యక్షఖేలనా పరుఁడైనను దానినెఱుంగడు. ఆటకు రమ్మనిపిలచిన నతడెన్నడు మాఱుపల్కఁడు."

మహారాజవిజయములో నిట్లుచెప్పబడి యున్నది:—పాచిక లాడుట కేవి కావలయును. (1)పాచికలు (2) కచ్చులునప్పొట కొఱకు బల్లగాని, గుడ్డగాని, తగినగురుతులు గలదియొకటి(3)కచ్చులు. పాచికలకు నాల్గు పలకలుండి ప్రతివైపున 16 చుక్కలుండవలెను. ఈ రంగుగుర్తులు ఆకాశముతప్పఁ దక్కిన భూతముల సూచించును. వానిరంగు లెవ్వియన-ఆకాశము తెలుపు, వాయువు నలుపు, అగ్ని యెఱుపు,నీరు తెలుపు, భూమి పసుపు.—ఇత్యాది.

ఇట్టి మహత్తరవిషయములు గ్రంథపరిశోధనమువలన నింకను దెలియుగలవు.

---

# కోయిల

పి. చలపతిరావుగారు

ప్రాతపాటలె పాడుచుందువు
ప్రాతరుచులే గోరుచుందువు
ప్రాతకొత్తలు లేవు నీకూ
పిచ్చి కోకిలమా!

'జగతిలోపలనెంచి చూడగ
నాకుసరియెవ్వారు లే'రని
విర్రవీగుచునుందు వెప్పుడు
నీవు కోకిలమా!

గున్నమామిడి చెట్టుపై నే
యూకుసందునో మణగిమణగీ
చిగురుటాకులచేరి తినుచును
కుహూకుహూమని కూయుచుందువు
కూర్మి కోకిలమా!

చూడవేమే చూలుపననను
గోరవేమే గొనబుటరటెని
తలపవేమే దాడిమీఫల
మొందు కోకిలమా!

స్వంతవృత్తుల పొంతబోవక
మందులై మను మానవాళికి
హితముగఱపెడి నీదునేత
లవెందు గోకిలమా!

# యశోద

రాయసం వేంకటశివుడుగారు

లోకములో నెవరిగోడు వారిది. పరుల కష్టసుఖములు కనిపెట్టువారును, దీనులకు సాయము చేయ సమకట్టువారును, ఎక్కడను మిక్కిలి తక్కువ. తమ రోగుబాగులు గుర్తెఱిఁగి జీవయాత్ర గడుపుకొనుటతోనే సామాన్యులకు దినములు గడచిపోవుచున్నవి. ఇంక నితరుల సేమ మారయుటకు వారికి తీఱిక యెక్కడ, తోడుపడుటకు సాధనకలాప మెక్కడ?

## గోప బాలికలు

ఒకనాఁటి ప్రాతఃకాలమున అక్కచెల్లెండ్రగు నిరువురు బాలికలు గొల్లపల్లినుండి చేరువనుండు గోపాలపురము వైపునకు నడచిపోవుచుండిరి. అక్కకు పండ్రెండు పదమూఁడేండ్లును, చెల్లెలికి పదియేండ్లును వయస్సుండును. దారిప్రక్కలనుండు చెట్ల క్రిందికొమ్మ లెచటనైన పూచియుండినచో, తన చేతనుండు గిన్నె చెల్లెలి చేతికిచ్చి, అక్క పూవులు కోసి, తన జెడలోఁ గొన్నియును చెల్లెలికిఁ గొన్నియును ముడుచుచుండును. ఎట్టి పూవులును బాలికలకుఁ బ్రియమె. పసరిక మొగ్గలను, నిర్గంధకుసుమములనునైన వారు నిరసింపరు! ఇట్లు సింగారించుకొని యా బాలికలు, తమకు జ్ఞప్తికివచ్చిన పాటయొక పదమె పాడుకొనుచు, మెల్ల మెల్లగ నడుగులు పెట్టుచుండిరి.

ఆదారిని నడచిపోవు నొక యువకుఁడు "పిల్లలారా! ఎక్కడకు పోవుచున్నారు? గిన్నెలో నేమున్నది?" అని యడిగెను.

"మేము పట్నం పోవుచున్నాము. పంతులుకు పాలు కొనిపోయి యిచ్చిరండని అమ్మ పంపినది" అని బాలికల యుత్తరము.

అంత నా పథికుఁడు మఱికొన్ని ప్రశ్నలువేసి, వారు గొల్లపిల్లలనియు, రెండు పూఁటలును తల్లి వారిచే పట్టణమందలి విద్యార్థి కొకనికి ఆవుపాలు పంపుచుండుననియుఁ దెలిసికొనెను.

"బాలికలారా! మీ రిట్లు పోయి వచ్చుచుండడముతోనే ప్రొద్దుపోతుందే. మీరింక చదువుకొనడ మెప్పుడు?" అని మార్గస్థుని ప్రశ్నము.

"ఈమధ్యనే మావూళ్లో పంతులు వచ్చి బడి పెట్టినప్పుడు, అందరుపిల్లలతోపాటు మేమును పలకా బలపమును చేతబట్టి బళ్లోకి వెళ్లినాము. ఇంతట్లో పట్నంలో చదివే పంతులొకరు మా అమ్మకు కనబడి, వేళకు మంచిపాలు తనకు పంపిస్తే, అణా యెక్కువ యిస్తానన్నాడు. అందుచేత మా పొస్తకాలు మూలబడ్డవి. చదువుకేమి, ఈ పంతులుకు వేళకు పాలందిస్తేనేకాని, అమ్మ మొట్టికాయలు మాకు తప్పవు! రావే చెల్లీ, ప్రొద్దెక్కిపోయింది!" అని అక్క కేకవేసి, వేవేగముగ కాలు సాగించెను.

"ఆహా! ధనికుల సౌఖ్యమునకై పేదవా రెట్లు కష్టముల పాలగుచున్నారు! ఆ విద్యార్థి యిచ్చెడి యొక అణా లాభమునకై యిద్దఱు పేదపిల్లల చదువు నమసిపోయినది! స్వలాభాపేక్షతప్ప వేఱు చింత లోకమం దెచటను లేనేలేదు! ఎద్దుపుండు కాకికేమి నొప్పి? చదువునేర్చి హాయిగానుండవలసిన యీ బాల్యమున పాప మీ పల్లెబాలికలు పనులకు బానిసలయిపోవుచున్నారు!" అని బాటసారి మనమునఁ దలపోయుచు, తన యుద్యోగపుఁ బనులమీఁదఁ వెడలిపోయెను.

## చదువు

ఇది జరిగిన రెండు మూఁడు నెలలకు, ఆ బాలిక లిరువురును గోపాలపురమునుండి స్వగ్రామమునకు బయలుదేరి యొక సాయంకాలమున మెల్లగ నడచి పోవుచుండఁగా, వెనుకటి పథికుఁడు వారి కగఁబడెను. ముఖపరిచయముగల యా చిన్నవానిని జూచి యా పిల్లలు చిఱునవ్వు నవ్విరి.

"పిల్లలారా! ఇపుడు మీ సమాచారమేమి? మీరు కొనిపోవుచుండు పాలు పంతులుకు వంట

బట్టుచున్నవా? మీ కష్టము గుర్తెఱిగి ఆయనగారు సరిగా డబ్బిచ్చుచున్నాడా? లేక, యేమైనా చిక్కులు పెట్టుచున్నాడా? పాలచెంబుతోపాటు పలకాపుస్తకాలు చేత బట్టినారే? పట్నంలో ఆడపిల్లల బళ్లో చేరి మీరిప్పుడు చదువుచున్నారా యేమి? ఏదోవిధంగా మీరు చదువుకోవలెను సుమీ!" అని బాటసారి కుశలప్రశ్నము.

"అయ్యా! మా పంతులు మిక్కిలి మంచివాడు. మేము రోజూ వేళకు మంచిపాలు తెచ్చిపెట్టుచున్నందుకు ఆయన సంతోషించి, చెల్లాయికీ నాకూ పెప్పరమింట్లు పెట్టుచున్నాడు. చెల్లీ నేనూ ఆయనకు పాలు కాచిపెట్టుచున్నాము. ఆయనతో మాకెంతో చనువు. ఆయన చదువుకొంటున్నప్పుడు, దగ్గిర పత్రికలు, పుస్తకాలు మేము విప్పి, వాటిలో బొమ్మలు చూచుకొంటున్నాము. అవి చూచి మాకు ప్రాణాలు లేచివస్తవి!" అని యశోద ప్రత్యుత్తరము.

"అక్కయ్యా! బొమ్మలు చూచుకోవడమేగాని మన చదువుమాట చెప్పవేమే?" అని చెల్లెలి వ్యాఖ్య.

"ఆ కఠినుఁడు మీకు చదువుకూడా చెప్పుచున్నాడా యేమి?" అని బాటసారి.

"పంతులేమీ కఠినుడు కాదండీ. ఆయన పెద్ద పొస్తకాం, తళతళలాడే ఆయన కళ్లజోడూ చూచి మొదట మేమూరికే భయపడ్డాము కాని, ఆయన మంచివాడే—గూట్లో టిక్కు టిక్కుమనే గడియారం చూదామని చెల్లాయి బెదరుచు వెళ్లుచుండగా, దానిని వెనకకు లాగేదానిని. పంతులుదగ్గిర కాకితాలలో బొమ్మలు చూదామని మనసుగా వుండేదిగాని, అవి నా కెట్లు వస్తాయి?" అని యశోద.

మార్గస్థుఁడు:— "చదువురాని నీ కా కాకితాలెందుకు?"

యశోద:—"బొమ్మలు చూచుకోడానికే లెండి— పంతులు మంచివాడు. ఆయన వినుకోక, ఇప్పుడు మా చెల్లాయికి గడియారం చూపిస్తున్నాడు. బొమ్మలు చూచుకోడానికి నాకు కాకితాలిస్తున్నాడు. నాదృష్టి యెప్పుడూ బొమ్మలమీదనే వున్నదని ఆయన కనిపెట్టి, 'నీవేలచదువుకోవమ్మా?' అని యొకరోజున నన్నాయన అడిగినాడు."

బాటసారి:—"నీ పాలమోతవల్లనే మా చదువు మూలపడ్డదని అతణ్ని నాలుగుజెప్పలూ పెట్టలేకపోతివా?"

యశోద:—"ఆయనను పాపమెవ్వరూ అటువంటి మాట లనలేరండీ! 'అయ్యో, నీ గ్రామంలోని కొత్తబళ్లో మీ చదువు నా మూలాన పాడైపోయిందే!' అని ఆయనే చాలా నొచ్చుకొన్నాడు. ఒకరోజున ఆయన మాతో, అమ్మాయిల్లారా! మీరు నిత్యమూ నాకు పాలు తెచ్చి కాచిపెట్టి యిస్తూ శ్రమపడుతున్నారు. మీకు నేనుకూడా యేమైనా సాయంచేయవద్దా? మీరు పుస్తకాలు తెచ్చుకోండి-చదువు చెపుతాను' అని పంతులు చెప్పగా, ఎగిరి గంతేశాము."

బాటసారి:—"వట్టి పుస్తకాలమోతేనా, ఆపంతులు నిజంగా మీకేమైనా చదువుచెపుతున్నాడా? చెప్పండి"

యశోద:—"అయ్యో, ఆయన మూలాన్న మాకిప్పుడే అక్షరాలన్నీ వచ్చాయి. మా వూరిబళ్లో వాళ్ళింకా 'కా ఖాలు' దాటనేలేదు! పంతులెంతో మంచివాడండి—మాకాయన ఓపికతో చదువుచెప్పుతూ, బొమ్మలుచూపిస్తూ, తినుగొండువస్తువులు పెట్టుతుంటాడు-అంత మంచివారెవ్వరూలేరు!"

## నేస్తము

విద్యార్థి ఆనందరావునకు యశోదయు చెల్లెలును అనుదినమును వేళకు మంచిపాలు తెచ్చి కాచి యిచ్చుచు, చిన్నచిన్న యుపచారము లెన్నియో చేయుచువచ్చిరి. అతఁడు వారికి క్రమముగ పాఠ

ములు చెప్పుచు, వారికి బహుమతులిచ్చి పంపుచుండును. ఇట్టి యుభయులకును స్నేహము కలిసెను. ఒంటరిగ పట్టణనివాసము చేయవలసి వచ్చిన యానందరావునకు యశోదయు దానిచెల్లెలును సావాసురాండ్రయిరి. ఆబాలికలాతనిని 'అన్నా' యని పిలువఁజొచ్చిరి. అతఁడును వారియెడల సోదరప్రేమను గాంచియుండెను. ఇట్లు పాలనెపమున బాలికలకు చదువును, చదువునెపమున నుభయులకుఁ జెలిమియును, సమకూరెను.

ధనము తేఁజాలని సుఖసౌకర్యములు, సఖ్యసంబంధమున సులభసాధ్యములగుచున్నవి. ఎండ వానలను మిష పెట్టి పాలు రాకుండుటయు, తోడుబాలను నెపమున నీళ్లపాలు తెచ్చుటయు, గొడ్డుబెడ్డల పాలుగలిపి గోవుపాలని పోయుటయు,—ఆగొల్లపిల్లలెఱుఁగనే యెఱుఁగరు. ఎప్పుడయిన తల్లి యేమఱినను, ఆబాలికలు క్రమముతప్పక, నిర్మలమానసర్యమునఁ దమ ప్రేమమునుబోలిన మంచియావుపాలు తెచ్చి యానందరావున కిచ్చుచుందురు. ఆ బాలికలకుఁ జదువను వ్రాయను నేర్పవలెనని యావిద్యార్థి గట్టిపట్టుపట్టి, వారిచేఁ బుస్తకములను పత్రికలను జదివించుచుండువాఁడు. ఆయువకుని సాయమున తమవిద్య దినదినప్రవర్ధమాన మగుచున్నదని గ్రహించి యా బాలిక లానందరావుని దన సోదరప్రేమను బూని, చిన్న యుపచారములు చేయుచు, అతనిని సంతోషపెట్టుచుందురు.

ఇటులొక సంవత్సరము గడచిపోయెను. అనుదినము నాబాలికలు ప్రేమపూర్వకముగఁ గొనివచ్చి యిప్పించెడి స్వచ్ఛగోక్షీరములు సేవించు నానందరావునకు దేహమున మంచి యారోగ్యబలములు చేకూరెను. మేధాశక్తి దీప్తివంతమయ్యెను. విద్యయందు చక్కని యభివృద్ధిగలిగెను. పరుల విద్యాభివృద్ధికి దానొకింత తోడుపడితిని గదాయని యాతఁడు సంతుష్టాంతరంగుఁడయ్యెను. స్వస్థలమువీడి, పరదేశమున నివసించుట కాతని మనస్సున నావంతయు వంతలేదు. చెలిమి మూలమున నేర్పడిన యీయిరువుర చెల్లెండ్రును ఆనందరావున కెన్నిపనులో చేసిపెట్టుచు, అతనియం దమితానురాగము గలిగియున్నారు. ఇంతకంటె చిన్నవారల కేమిసౌఖ్యము కావలెను?

## చనవు

వేసవికాలపు సెలవులు పరిసమాప్తినొందెను. తమ యనుంగు సోదరుఁడు ఆనందరావును విడిచియుండిన యీరెండుమూఁడు నెలలును, ఆ గోపబాలికలకు రెండుమూఁడు యుగములయ్యెను! ఋతుప్రారంభమున చెట్లమీఁది తమ ప్రాఁతనెలవులుసొచ్చు పక్షిజాలమువలె, కళాశాలా విద్యార్థు లొక్కరొక్కరె పట్టణమునచ్చి, తమ ప్రాఁతబసలలోఁ ప్రవేశించుచున్నారు. కాని యెన్నటికిని ఆనందరావు పురమునకు రాకుండుటవలన యశోదకుఁ జెల్లెలికిని ఆలజడి కలిగెను. అనుదినమును వారాతని మునుకటిబసకుఁ బోయి, తమ మిత్రునిగూర్చి యడుగుచువచ్చిరి. ఈ మాటాతఁడు పట్టణము రాకపోవచ్చునని యొక్కొకమాఱును, కుటుంబముతో వచ్చి వేఱుబస చూచుకొనవచ్చునని యొక్కొకమాఱును వారికి వినవచ్చుచుండెను. కొన్ని దినములనంతరను ఆనందరావుకొఱకై ఖాళీగా నుంచఁబడినగదిలో, మఱొక వేఱొక విద్యార్థి ప్రవేశించెను. తమ యన్న యానందరావు కుర్చీవేసికొని కూర్చుండుతావున క్రొత్తమనుజాని బిచాణా పరచియుండుటయు, పత్రికలు బొమ్మల పుస్తకములు నుండుచోట నన్యుని కాలిజోడు కానఁబడుటయు, టిక్కుటిక్కుమను గడియారముండు గూటిలో సిరాబుడ్డియు, కలములు దాచఁబడుటయు, సతత మందహాసమున వెలుఁగు వదనపద్మముగల తమ యన్న యానందుని స్థానమును పుస్తకములు ముందు వేసికొని మొగము ముడుచుకొని కూర్చుండు నన్య విద్యార్థి యాక్రమించుటయును,—పాప మా కోమల హృదయులగు గోపబాలికలకు దుర్భరదృశ్యములయ్యెను! తమ పాపిష్ఠినయనములకేక నానందుని

యానందమూర్తి గోచరింపదని యాబాలికలు దిగులు పడఁజొచ్చిరి.

ఒకనాఁడు తల్లి యేదో పనిమీఁద నంపఁగా, యశోద గోపాలపురమువచ్చి, పని చక్కఁబెట్టుకొని, స్వగ్రామము వెడలిపోవుచుండెను. ఇంతలో చిన్న బజారునొద్ద నొకయింట నానందరావు దిగియుండె ననువార్త యామెకు వినవచ్చెను. తోడనె యత్యాతురమున యశోద యాప్రాంతములకేగి, అన్నకొఱ కింటింట నడిగెను. తమ కాతని సమాచారము తెలి యదని కొందఱు పలికిరి. దూరపు టిండ్లలో నెచట నైన నుండవచ్చునని కొందఱనిరి. ఎట్టకేల కానందుని బస యామెకొక్కరు చూపించిరి. అన్నను వీక్షింప నిందుకొఱకగల యామె హృదయమున ప్రేమరస ముప్పొంగఁగా, యశోద యాగృహముసొచ్చి, ఓరగ వేసిన పెద్దగదితలుపు చివాలునఁదెఱచి, భావోద్రేక మున, "అన్నా!"యని యొక్క పెట్టున నఱచెను.

గదిలోనుండి యపుడు బయటికి వచ్చినవారు ఆనందరావు కాకుండుటవలన, పాపమాబాల కమితా శాభంగము కలిగెను! "ఎవరు వారు?"అని యపుడు యశోద నడిగిన వారు పదునాఱుసంవత్సరముల ప్రాయముగల యొకసుందరి. "మా అన్నయ్య బస యిదేనా?"అని గోపబాల యామెనుఁబ్రశ్నించి, లోనివస్తువుల యానవాళ్లనుబట్టి యదియేయని నిర్ధారణ చేసికొని, "ఇదిగో నాటకపు టిక్కెల గడియారము! ఎన్నాళ్ళకు గనఁబడ్డావే మాయమ్మా!" అని పలుకుచు గదిలోఁజొచ్చెను. "పంతులుగారిప్పటికో వెళ్ళినారు" అని గృహిణి చెప్పుమాటలు యశోద వినక, "అన్నయ్య కొత్తబొమ్మల కాకితా లేమితెచ్చాడో చూదాము!" అని గోపబాల తనలోఁ దాను మాటాడుకొనుచు, బల్లయొద్ద కట్టె పోయి, పుస్తకములు తిరుగవేయఁజొచ్చెను.

### భావోద్రేకము

భావోద్రేకము ఒక విధమగు పిచ్చితనము, హృదయముప్పొంగి యుండునపుడు, బుద్ధి యుక్తాయుక్తము లరయ నేరదు! అట్టివారల మనస్సీమనుండి యుచితజ్ఞత యెగురకలెత్తి పారిపోవుచుండును. గొల్లపిల్ల యొకతె తమగదిలోఁజొచ్చి, తన పతిపుస్తకములు కెలఁకుచుండుటయు, పరపురుషులతో లేనిపోని వరసలుపెట్టుకొని తగనిచనువు గాంచియుండుట యును,—రుక్మిణి కెంతమాత్రమును రుచింపకుండెను! యశోద యంత వెనుకకుమరలి, గుమ్మమునొద్ద చతి కిలఁబడి, "వదినయ్యగారూ! మీరెప్పుడు వచ్చా రండీ? వెనుకటిబస మానేశారేమండీ?" అని యడి గెను. మొగ మెఱుకలేని హీనజాతి పడుచు తమ గదిఁజొచ్చి, గౌరవమేమియుఁ జూపక తన్నిట్లు సంబోధించుటవలన రుక్మిణి యధికాగ్రహోద్రేక యయ్యెను. అంత వారిరువురు కోమలులకును, సంభాషణమను పేర నీసంవాదము జరిగెను.

రుక్మిణి:—"ముక్కూ మొగమూ ఎఱుగనిదానవు నీతో చుట్టరికముకలిపి, నన్నేమి మాట్లాడుమన్నావు? నీ వెవరవు? ఎందుకు వచ్చావేమిటి?"

యశోద:—"అలాగు కోప్పడతారేమండీ, వదినయ్య గారూ? గొల్లవాళ్లమైనా మర్యాద గలవాళ్ళమే నండీ! అన్నయ్యగారెరుగుదురు మాసంగతి— మీరు పాలెక్కడ పోయించుకుంటున్నారు?"

రుక్మిణి:—మీ మర్యాదలతోను, వావివరసలతోను మాకేమీపనిలేదు—మీపాలు మాకక్కరలేదు కావలిస్తే కబురంపుతాములే—వెళ్ళిపోవచ్చును."

యశోద:—"అలా పొమ్మంటారేమండీ వదినయ్య గారూ? మిమ్మల్ని చూదామని యిన్నాళ్ళ నుండీ కలవరిస్తున్నామండీ! అన్నయ్యకై చెల్లి, నేను బెంగపెట్టుకొనే యున్నాను. పాలు కాక పోతే నెయ్యా పెరుగైనా అక్కరలేదా? మం చివే తెచ్చిపెట్టుతాము లెండి!"

శ్రుతిమించుచుండెడి యీప్రాతబంధములు పగులఁ గొట్టుట పరమధర్మమని భావించిన యిల్లాలు రుక్మిణి, "ఓసీ పిల్లా! మాకు నీ నేయి పెరుగులూవద్దు నేస్తాలూ వద్దు! వచ్చిన దారినె వెళ్ళిపో! కావలెనంటే .

మా మగవారు కబురంపుతారులే!" అని పలికి, ముఖము ముణుచుకొని, తమ గృహమునుండి యెన్నడీ బాలపిశాచమున కుద్వాసనమగునా యని వేచియుండెను. తనతో వికటప్రసంగములకులాడెడి యా గృహిణితో నిక ప్రసంగింపనోల్లక, అన్నయె యింట నుండినఁ దనకీ పరాభవము ప్రాప్తించియుండదు గదాయని కంట నీరు తెచ్చుకొని, కోపమున నా గోప బాలిక చివాలున లేచి, యట్టె వెడలిపోయెను!

ఈసు

ఈర్ష్యవంటి చెడుగీలోకమున మఱియొకటిలేదు. ఎంతటి కఠినదురాత్ముఁడును స్వసౌఖ్యమును విసర్జించి మెలఁగు మూర్ఖుఁడుగ నుండఁడు. ఈర్ష్యాళువుమాత్రము పరశ్రేయసుతోపాటు నిజాభ్యుదయమును నీటఁ గలిపి, తానును దుఃఖకూపమునఁ జెరలాడుటకు సంసిద్ధుఁడగుచుండును! ఈ సుగుణము స్త్రీ నావహించినచో, మఱింత వికారరూపమును దాల్చును. ఒకానొక కవివర్యుఁడు, "ఓ యీర్ష్యా! నీ పేరే స్త్రీ సుమీ!" యని యంగలార్చెను.

ఆనందరావు నాఁడింటికిఁ జేరినతోడనే, గోపబాలిక దుండగపు సమాచారమును రుక్మిణి నాథునికి నివేదించెను. ఇది విని నవ్వి యాతఁడు "అయ్యో, యశోదా! ఎంత వెఱ్ఱిగొల్లపిల్లవే నీవు! పాపము దానిది పిచ్చిప్రేమలే! —దాని చెల్లెలుకూడా రాలేదా? పుస్తకాలు తెచ్చుకొనివచ్చారా? మఱచిపోయినాను నీతో చెప్పడము. మన యింటికి కావలసిన నేయి పెరుగులు వాళ్ళు జాగ్రతగా తెచ్చి పెట్టుచుంటారులే—మిక్కిలి నమ్మకమైనవాళ్ళు. ఒంటరిగానున్న నీకు మంచి సావాసులుగా నుంటారు కూడాను!

చిట్లించిన మోముదమ్మితో రుక్మిణి, నాకీ కొత్త నేస్తు లెవరూ వద్దు. నేయి పెరుగులు కావళ్ళు కట్టి మనకు తేనక్కఱలేదు." అని సమాధానమిచ్చెను.

యశోదను గుఱించి తనభార్య హృదయమునఁ బడిన యనుమానాంకురముల జాడ తెలియని యానందరావు, "కావలసిన వస్తువులే వాళ్లు తెచ్చిపెట్టుతుంటారులే—గొల్లవాళ్లయినా స్నేహపాత్రులు— నీతో గలసి చదువుకుంటూ, ఇంట్లో సందడిగా నుంటారులే!" అని పలికెను.

"ఈ పట్నవాసములో వస్తువులన్నీ యింటివద్దకే అమ్మవచ్చుచున్నవి. ఇంక వరసలు పెట్టుకొనే పొరుగూరి అమ్మలక్కల వాడుకలు మనకెందుకు? ఎవరికితగ్గ సావాసులు వారికి ఇరుగుపొరుగులనే కుదురుతారు గాని, పల్లెటూరి గొల్లవాళ్ళ చెలిమి నాకెందుకు? ఆ పడుచుపిల్ల వెకిలివేషం నాకేమీ బాగాలేదు. అటువంటి వాళ్ళను మనయింట్లో జేనిస్తే, మీ తలమీద తప్పక అక్షింతలగింజలు పడతవి సుమండీ!" అని రుక్మిణి పలికెను.

ఈ కడపటి పలుకులు ములుకులవలె చెవికి తగులునప్పటికిఁ గాని, గొల్లపిల్లయెడల తనభార్యకుఁ గలిగిన యనుమానముల సంగతి యానందరావునకు స్ఫురింపనేలేదు! అప్పుడైన నతఁడు సతివారింపు వచనములు లెక్కసేయక, యశోద సామాన్య బాలల వంటిది కాదనియు, దానికిని దాని చెల్లెలికిని చదువునందమిత వాంఛగలదనియు, ఎటులైన నా బాలికలకు విద్యావిషయమునఁ దమకు సాయము చేసి, వారివలనఁ దామును గొంత సాయమునొందుటవలని తప్పేమియు లేదనియును, ఆనందరావు సమాధానము చెప్పి, అంతటితో సతిసందియములు నివారితమయ్యెనని యనుకొనెను. ఐన నుదంతము లింతతో నంతమొందలేదు.

మఱునాఁడు కూరలబజారులో యశోదయు దాని చెల్లెలును ఆనందరావునకుఁ గానఁబడిరి. అతని భార్యతో ప్రథమ సంభాషణలోనే తమకుఁ గలిగిన యాశాభంగమునకై పాప మా గోపబాలికలు కంటఁ దడిపెట్టుకొనిరి. ఆనందరావు వారల నూరడించి, తన సతిని సమాధానపఱచితిననియు, మఱునాఁటి నుండియు వారు తమకు పాలు పెరుగులు తెచ్చి యిచ్చుచు, వెనుకటివలెనే తమయింటఁ జదువు సాగించుకొనవచ్చుననియును, ఆయన వారల కభయ హస్తమిచ్చెను.

మఱునాఁటి నుండియు యశోదయు చెల్లెలును పాలు పెరుగులు గొనివచ్చుచు, ఆనందరావుగారి యింటఁ జదువుకొనుచు వచ్చిరి. రుక్మిణికిఁ గావలసిన చిన్నచిన్న పనులు చేసిపెట్టవలెనని యామె వెనువెంట నెంత వినయవిధేయలతో వారు తిరుగుచుండినను, అభాగ్యశాలిని వారిని గన్నెత్తియైనఁ జూడకుండెను! ఇంక వారికి నామెయందు మనసు గలియుటెట్లు? ఆనందరావు సాహాయ్యమున నాబాలికలను దినమును గొంతసేపు చదువుకొని, అతఁడు కళాశాల కేగు సమయమున స్వగ్రామమునకు వెడలిపోవుచుండిరి. ఇట్లు గృహయజమానుని యాజ్ఞ ననుసరించియే, హృదయ సమ్మేళనములేని నిర్బంధసహవాసభాగ్యమును, ఆ మువ్వురు కాంతలు ననుభవింపుచుండిరి!

## సమాధానము

కాలమెపుడు నొకరీతిని గడువదు. ఒకసమయమున జరుగని కార్యము, వేఱొకసమయమునఁ గొనసాగుచున్నది. క్రొత్త ప్రదేశమునకు వచ్చిన కొంతకాలమునకు రుక్మిణికి శరీరస్వాస్థ్యము తప్పెను. దగ్గు పడిసెములతో నామె దేహమున నంకురితమైన వ్యాధి విశేషము విషజ్వరముగఁ బరిణమించి ఘన వైద్యులకును లొంగకుండెను. ఐనను, అనుభవశాలియగు వైద్యుఁడు సంజీవరావునాయుని యోర్పు నేర్పుయత్నములఫలితముగ, ఎట్టకేలకు రుక్మిణి యారోగ్యవతి యయ్యెను. ఆ యిల్లాలు మంచమెక్కినవాలుగువారములును, పరదేశమున వారి కాపుర మెట్లుసాగెనో, మూలపడి మూలుగుచుండెడి యామెకుగద నెవరు పరిచర్యలు చేసిరో తెలియునా? వెనుక రుక్మిణి తనయింటనుండి వెడలిపొమ్మని గెంటివైచిన గోపబాలికలె యీదినములం దాగృహిణికి దిక్కయ్యెను! ప్రేమార్ద్రహృదయగు సోదరివలెనే యశోద రుక్మిణి కన్ని యుపచారములును జేయుచు, ఆనందరావునకు ధైర్యము చెప్పుచు వచ్చెను. ఆమె చెల్లెలును వారికిఁ గావలసిన బజారు వెచ్చములు తెచ్చియిచ్చుచు, లెక్కలేని చిన్నపను లింటఁ జేయుచుండెను. ఆ యక్కచెల్లెండ్ర నిజస్వభావ మిప్పటికి బాగుగ గ్రహించిన రుక్మిణికి వారిపుడు ప్రాణమిత్రులయిరి! వారియెడల రుక్మిణి కిపుడ వ్యాజప్రేమము కుదిరెను. ఆ గోపబాలికలతోఁ గలసి చదువుకొనుటకుఁగాని, ప్రేమ ముట్టిపడు నట్లు వారిని వరుసలుపెట్టి పిలుచుటకుఁగాని, ఇపుడు రుక్మిణి కించుకయు సందియము లేదు! ఆబాలలకును తన పతికిని గలచెలిమి స్వచ్ఛపవిత్ర ప్రేమబంధమె యని యిపుడు స్పష్టపడి, అట్టి నిరపరాధులయెడ నిన్నాళ్లును దాను వహించిన నిర్దయత్వమునకు రుక్మిణి మిగుల లజ్జనొందెను. సుస్వభావలగు నాగోపికలకుఁ దానిపుడెట్టిమేలు చేసినను, వారికిఁ దాను వెనుక గావించిన యపరాధమునకుఁ దగిన ప్రతీకారము కానేరదని యాసుదతికి స్పష్టమయ్యెను!

వైద్యుఁడు సంజీవరావునాయుఁడు తమకుఁజేసిన యుపచారమునకై యానందరావు అతనిని తగిన రీతిని గౌరవింపఁగోరి, ఆయన కొకనాఁడు తమ యింట విందుచేసెను. సంగీత సభానంతరమున ఆనందరావు తాను సమర్పింపఁబూనిన రూపాయిల పొత్తి తాంబూలమున నుంచి, వైద్యుని హస్తమున నుంచఁబోఁగా, ఆయన యది స్వీకరింపక, వారీయఁగల బహుమతి వేఱొకటి గలదని పలికినపుడు, అచట నుండు నందఱు నాశ్చర్యమందిరి. అంత వైద్యుఁడిట్లు పలుకుచున్నాఁడు:—"ఈ యిల్లాలు వ్యాధితో వెత నొందుచుండు దినములలో, యశోద యను నీ గోప బాలిక యిలువేలుపువలె వీరిని గాచుచవచ్చెను. ఈబాల సహాయమువలనె రుక్మిణమ్మ దేహస్వస్థత నొందెను. సుశిక్షనొంది చిరకాల వైద్యాలయానుభవము సంపాదించిన దాదివలె యశోద రోగి కా దినములందు పరిచర్యలు సలిపెను. కుశాగ్ర బుద్ధిగల యీ సుగుణవతిని నేను బరిణయము కాఁగోరుచున్నాను. ఆనందరావు పంతులనీమె యన్నవలె పెంచి, వారి యింట తలలో నాలుకవలె మెలుగుచున్నది. యశోదకును చెల్లెలికిని యీపంతులె గురువు, దైవమును! వెనుకటి దినములలోఁగూడ ఈబాలికలు

తమ గ్రామమునుండి యీపురమందలి యానందరావు పంతులుకు పాలు తెచ్చి పెట్టుచుండు సమయములందు వారికనుల కగఁబడుచుండిరి. మొదటి నుండియును యశోదయందు మిగుల మక్కువ గలిగి యున్నాను. ఆనందరావు పంతులును వారి పత్నియును నాకీ వివాహము చేయించి, నన్ను బహుమానింపఁ గోరుచున్నారు."

సత్పురుషుఁడగు వైద్యుఁడు సంజీవరావునాయని కోరిక సహేతుక మైనదని యందఱు ననిరి. అన్న వదినల యాలోచన ననుసరించుట శ్రేయమని యశోదకును దోఁచెను. ఆమె తల్లియు బంధువులును దీనికి సమ్మతించిరి. అంత నతివైభవమున యశోద సంజీవరాయల పరిణయోత్సవము జరిగెను.

ఇపుడు సంజీవరావునాయఁడు గోపాలపురమున పేరువడసిన వైద్యులలో నొకఁడు. కులములు వేఱైనను మనములు పెనఁగలసిన ఆనంద సంజీవరాయల కుటుంబములలోనివారు, సంపత్సౌహార్దములతో విలసిల్లి, సౌఖ్యాబ్ధి నోలలాడుచున్నారు.

---

## కష్టజీవి

శ్రీమతి చిలకపూడి సీతాంబగారు

ఉ॥ పుట్టిననాటనుండియును పూజ్యులకున్ నిరుపేదవారికిన్
పట్టెడుసన్నమిచ్చి కడుభక్తిని వస్త్రమొసంగి పున్నెమున్
గట్టుకొనంగలేక వృథగా కలకాలముబుచ్చుచుండు నీ
కట్టిడి కష్టజీవి ధర గల్గఁజేసితివేల యీశ్వరా॥

ఉ॥ కట్ట దుకూలముల్, సుఖముగా వసియింపను మంచిమేడలున్,
బెట్ట సువర్ణభూషలను, పేర్మివహింపగలేదు, దోయిలిన్
బట్టినవారి ద్రోయుచును పాపములన్ గడియించుచున్న యీ
కట్టిడి కష్టజీవి ధర గల్గనేల సృజించి తీశ్వరా॥

ఉ॥ కాయమశాశ్వతంబె యెపుడో కాలగతిన్ బడిపోవు దానికై
జేయగరానిపాపములుజేయుచు ఘోరదరిద్రతాహతికిన్
దోయిలియొగ్గుచున్ కరము దుఃఖములన్ వెతలొందుచుండు న
న్నీయెడ కష్టజీవి ధర నిట్టుల యేలసృజించి తీశ్వరా॥

ఉ॥ తీర్థములందు గ్రుంకవలె దివ్యపదంబుల గాంచగావలెన్
అర్థులకన్నవస్త్రముల నచ్చపుభక్తి నొసంగగావలెన్
సార్థములివ్వియే మనుజజన్మముగల్గినయందు; కీగతిన్
వ్యర్థపుకష్టజీవి ధర నక్కట! యేలసృజించి తీశ్వరా॥

ఉ॥ వదలని మోహపాశము లవారితరీతిగలంప మంగళా
స్పదమగు నీపదంబులను భావనసేయక దేహగేహముల్
పదిలమటంచునెంచి బహుభంగుల పాపములన్ గడించు న
న్నదయత కష్టజీవి ధర నక్కట! యేలసృజించి తీశ్వరా॥

# రాజా పెళ్లి

శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబగారు

రాజా తల్లిదండ్రులకు అల్లారుముద్దుగా పెరిగిన ఆరవబిడ్డ. అసలుపేరు రాజరాజేశ్వరి అయినప్పటికీ ముద్దుపేరు రాజా. రాజాఅని పిలవడం అందరికీ సులభం. అందుకని పిల్లలూ, పెద్దలూ, వృద్ధులూ, అంతాకూడా రాజా అని పిలవడమే వాడుక. ఇప్పుడూ నాళ్ల ఆయనకూడా రాజా అనే పిలుస్తున్నారు లెండి.

రాజాకి 14 ఏళ్ళునిండకుండా అత్తవారింటికి వెళ్లకుండానే భర్తృహీన అయింది. తల్లిదండ్రులకు మితిలేని సంతాపం గలిగించిందీవిషయమే. తండ్రిమాత్రం కొద్దిరోజులకు ధైర్యము తెచ్చుకొని భార్యకు ధైర్యము చెపుతూ వుండేవాడు. తలంపులుండికూడా ఆచరించడానికి ఝుకుస్తారు, సంఘానికి వెరుస్తారు, వెలికి పెద్దపులిలా భయపడుతారు. అందుకనే యీ ప్రపంచకంలో సుఖానికి తావు తక్కువైపోయింది. చుక్కల్లోచంద్రుడులా రాజా దినదినాభివృద్ధినొందుతూ సౌందర్యంతో ఒప్పుతోంది. చక్కగా కోవెలలాటి కంఠంతో కోమలంగా పాడుతుంది. రాజా పెద్దదయినకొద్దీ తల్లిదండ్రులకు భారం యెక్కువైంది. ఆభారం యింతాఅంతా కాదు. మొయ్యలేనిభారం. రాత్రింపవళ్లు యిదే ఆలోచన. ఏమైనాసరే పెళ్లిచేసి తీరుతాను అన్నారామెతండ్రి. తల్లికి కాస్తధైర్యం గల్గింది. తగిలినచోటే తగులుతుంది. భగవంతుడు అనేకవిధాల ఆడిస్తూ వుంటాడు, నవ్విస్తూ వుంటాడు. రాజావని ఆటలోనే వుంది. రాజాతండ్రి అకస్మాత్తుగా జ్వరంతగిలి మరణించారు. పాపం రాజా శోకసముద్రంలో ములిగిపోయింది.

ముందు తారురోడ్డున తీసికెళ్లి తర్వాత ముళ్ళుతొక్కించటం, ముందుముళ్ళు తొక్కించి తర్వాత పూలమీద నడిపించటం మొదలైనవన్నీ జగన్నాటకసూత్రధారి మాయలు. ఆ అతీతునికి సాధ్యంకానిదేదీ లేదు. కొద్దిరోజులు గడిచాయి. ఏమైనా సరే పెళ్లిచేసి తీరతానన్న భర్తపలుకులు రాజాతల్లికి చెవులల్లో వినిపిస్తున్నాయి. ఆమె భగవంతునిమీద భారంవేసి, తనవాళ్లందరికీ భర్తపలుకులు చెప్పింది. కొన్నాళ్లకి తెంపయింది. కొందరికి యిష్టం, కొందరికి అయిష్టం, కొందరికి యిష్టముండికూడా భయం. ఏట్లాగైనా మూడువంతులు బంధువులంతా యిష్టపడి సంబంధాలు వెతకడం ఆరంభించారు. మనుష్య ప్రయత్నమే కాకుండ దైవయత్నంకూడ వుందికాబట్టి త్వరలోనే ఓ చక్కటిసంబంధం, రాజా కోరుకున్నది, కుదిరింది. శీఘ్రంగానే పెండ్లికూడా అయిపోయింది. ఆహ్వానపత్రికలు పంపినవారూ పంపనివారూ కూడా యీపెళ్లికివచ్చారు. బంధువులంతా సగంమంది వచ్చారు. బెజవాడలో పెళ్లి. మగపెళ్లివారికీ ఆడపెళ్లివారికీ పెళ్లి మధ్య అలకలు ముగ్గులు యేమీలేవు. పెళ్లికూతుర్ని పెళ్లికొడుకు, పెళ్లికొడుకుని పెళ్లికూతురూ కూడా కొనుక్కోలేదు. పెండ్లికిముందు బాల్యవివాహాలల్లో మొగపెళ్లి

వారొస్తుంటే ఆడపెళ్లివారు యెదురై పానకం కావిళ్లతో యెదురుసన్నాహం అంటూ చేస్తారు. ఇప్పుడో తల్లక్రిందులైంది. ఆడపెళ్లివారికంటె ముందుగావచ్చి సిద్ధంగా వున్నారు మగపెళ్లివారు. ఆడపెళ్లివారువచ్చే వేళకు సరిగా రైల్వేస్టేషన్‌కివెళ్లి కాఫీతో సహా యెదురుసన్నాహం చేశారు. పెళ్లి చాలా సరదాగా అయింది. అప్పుళ్లో గొప్ప వాళ్లు కొంతమంది వచ్చారు. పొరుగూరు నుంచి రానివాళ్ళు రానందుకు విచారిస్తూ ఆశీర్వాదాలు టెలిగ్రామ్‌ద్వారా పంపేరు. ఆ సందర్భంలోనే శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీ బాయమ్మగారు యీక్రిందవ్రాసిన పద్యములు ఆశీస్సు వ్రాసిపంపి ప్రేమను తెలియపరిచారు.

ఆశీస్సు

ఏ విభుని దివ్యమధుర కృపావలోక
నాసుధావృష్టి నార్ద్రమై యమలమైన
స్వేచ్ఛ నానందమయమైన జీవితంబు
సాధ్యమో, యదిమీకు ప్రసాదమగుత!
గుణము శీలమునే గోరికొని స్వయంవ
రమ్ము నందినవారు పరస్పరమ్ము
వడయు పావనభూతలస్వర్గసుఖము
ననుభవించి ముదాబ్ధి విహారులగుడు!!
సాధుగుణకీర్తి శ్రీజగన్నాధమూర్తి
రాజరాజేశ్వరీప్రేమరత్న రుచిర
మోహన కృపార్ద్రములు జూపు
ముత్తియములు
సేసబ్రాలయి గూర్మి ఆశీస్సులిడుత!!!

సరే పెళ్ళి గమ్మునై పోయింది. పెళ్ళికూతురూ పెళ్ళికొడుకూ చక్కగా చిలకా గోరువంకల్లా చక్కాబోయారు.

వూళ్ళోవెలి. వెలంటే యెట్లాంటిది? వీరింటికెవ్వరూ భోజనాలకు రారట. "పోనీయండి రాకపోతే, మాకేం లోటులేదు, మేమే మిమ్మల్ని వెలివేశాం, మాబంధువులంతా వచ్చి పెళ్ళిచేశారు, వాళ్లంతా మాయింటికొస్తారు, మీరువస్తేరండి యిష్టంలేకపోతే మానండి. మాయిష్టంమాది" అన్నారు. వూళ్ళో కలకలంగావుంది. కొంతమంది యిదేం తప్పులేదన్నారు. మనసంఘంలో జరిగే ఘోరకృత్యాలు చూడలేకుండా వున్నాము, అంతకన్న వేయిరెట్లు యిదే నయం అన్నారు కొందరు. శాస్త్రం వప్పదన్నారు నిష్ఠాగరిష్ఠులు. మేం చచ్చాక మాఅబ్బాయిలు యిటువంటివాటికి వెడతారేమోకాని మేం బ్రతికి వుండగా మావాళ్లెడితే మాకూ వాళ్ళకీ కూడా బలవంతమరణమే అన్నారు, పట్టుదల గలవారు. ఓ యిలా లక్షమాదిర్లుగా అంటున్నారు. వీరంతా తమబిడ్డలకు రజస్వలానంతర వివాహాలు చేయవలసినవారే. ఇంతలో వీళ్ళను వెలేస్తారట, తర్వాత వాళ్ళు కూడా వెలై పోతారన్నమాట. ఓరోజు రాజా పుట్టింట్లో చిన్నసంతర్పణ—సత్యనారాయణవ్రతం వెంకటేశ్వర దీపారాధన. ఇష్టమైనవాళ్ళంతా పోగయ్యారు. పట్టండంటే పట్టండన్నారు. వాళ్ళింటికి భోజనాలకెళ్లేరు. అంతాకలిశారు. మమ్మల్నేమీ పట్టుకోలేదే అన్నారు, అరుగుమీద కూర్చుని గుసగుసలాడుకుంటూవున్న ఆహితాగ్నిపరుల దగ్గరకెళ్ళి.

# కీ॥ శే॥ పెదశింగు బాపనమ్మగారు

కర్రి సత్యరాజుగారు

రావుసాహేబ్ పెదశింగు వెంకటరంగయ్యగారికి సోదరుండగు సీతారామయ్యగారు సుమారిరువదివత్సరములకు పూర్వమే కీర్తిశేషులైయుండిరి. ఈ పెదశింగు బాపనమ్మగారు సీతారామయ్యగారికి ధర్మపత్ని. పల్లవరత్న వెంకటనారాయణగారి కీమె జనని. శ్రీముఖనామసంవత్సర జ్యేష్ట బహుళ త్రయోదశి బుధవారం అనగా 1933 వ సం॥ జూన్ 20 వ తేదీని బందరుపట్టణమున రామానాయుడుపేటలో తమ స్వగృహమునందీ బాపనమ్మగారు పరమపదించిరి. ఈమె యాత్మశాంతికై జూలై 1 వ తేదీ శనివారం తమ జన్మభూమియగు గరాలదిబ్బ గ్రామములో కర్మకాండయును, శ్రాద్ధనాది కృత్యములును, మిగుల భక్తి విశ్వాసములతో జరపియుండిరి. ఈమె బాల్యమునుండియు ఆగర్భ శ్రీమంతురాలయ్యును శాంతి, శమ, దమాది సద్గుణములుగలిగి నిరాడంబర జీవితమును గడపెను. పురుషులెంత త్యాగశీలురైనను స్త్రీలు తదనుగుణముగా నడచుకొనునప్పుడు గాని యా కుటుంబాధిక్యత లభివృద్ధి నొందనేరవు. ఈ పెదశింగువారి కుటుంబాధిక్యతలభివృద్ధినొందుటకీ బాపనమ్మగారెంతయో సహకారిణియనుటకు సందియములేదు. ఈమె గృహయాజమాన్యమును వహించి తమ గృహధర్మములును, తమ గృహకృత్యములును, గౌరవాధిక్యతల నొందుటకెంతయో సితిదాయకముగ వర్తించెను. తమ గృహమున కేతెంచిన బంధువులయెడలను తదితరులయెడలను విశేష ప్రేమాదరణములను జూపి గౌరవింపుచుండిరి. ఐరోపా మహాసంగ్రామ సమయమున దేశీయనౌకల వ్యాపారమభివృద్ధి గాంచినప్పుడు రంగయ్యగారి ఓడలవ్యాపారమెంతయభివృద్ధి నొందియుండెనో ఎల్లరకు దెలిసియేయున్నది. ఆ సమయమున రంగయ్యగారితో మాట్లాడుటకు అనేక వ్యాపారములపై ననేకులు వారింటికి వచ్చుచుండెడివారు. ఆ వచ్చిన వారి కెల్లరను భోజనములకు లేపవలసినదని రంగయ్యగారు దెలుపుచు వడ్డనను గావింపవలసినదని లోనికి వర్తమాన మంపుచుండెడివారు. వర్తమానమంపిన పదినిమిషములలో ఎంతమంది వచ్చినను వడ్డనలను గావింపజేసి తమ కుటుంబగౌరవాధిక్యతల ననుసరించి యీమె గౌరవింపుచుండేది. ముందు రానైయుండువారిని యీమె తన సూక్ష్మబుద్ధిచే గ్రహించి వారికి కావలసిన రిసవర్గములను ముందుగానే సిద్ధపరపించి వుంచేది. ఆసమయమున ఎంతమంది వచ్చినను వడ్డలను గావింపవలసినదనియే గాని, ఇంతమంది వచ్చియున్నారు వీరికి వంటచేయించవలసినదని రంగయ్యగారు గాని, వెంకటనారాయణగారు గాని లోనికి వర్తమానమంపియుండెడివారు కారు. వడ్డనవర్తమాన మందిన వెంటనే లోన వడ్డనలు జరిగిపోవుచుండేవి. అందును బట్టి యీమె ఎంత కుశాగ్రబుద్ధిశాలినియో, యీమె యొనర్చిన గృహకార్య నిర్వహణమువలన యీకుటుంబ గౌరవ మెటు లభివృద్ధిగాంచి యుండెనో పాఠకులే గ్రహింపగలరు. విసుగు విరామములు లేక గృహకార్య నిర్వహణమంతయును నీమె స్వయముగనే జూచుకొనుచుండేది. ఇట్టి సుధీమతల్లుల గృహకార్య నిర్వహణములే యా కుటుంబ గౌరవాధిక్యతలకు మూలకారణంబులని విజ్ఞానులు దలంపగలరు. ఈమె యొనర్చిన గృహకార్య నిర్వహణములో పూర్వ ధర్మములుగాని, పూర్వ సాంప్రదాయములుగాని ఎంతమాత్రము విడచియుండలేదు. మిగుల దైవభక్తి తత్పరతయై దైవారాధన జేయుచుండేది. తన కుటుంబములో నెల్లరకు నుత్సాహ ముద్భవింపజేయుచు, నెల్లర నైకమత్యమొనగూర్చి సంసారయాత్ర గడపియుండెను. తన మరందియగు రంగయ్యగారి యెడల నీమె పుత్రప్రేమ చూపుచుండేది. ఈమెకు ముగ్గురు పుత్రులును, యొక పుత్రికయును గలరు. అందు పల్లవ

రత్న వెంకటనారాయణగారు జ్యేష్ఠపుత్రులైయుండెను. ద్వితీయపుత్రుండు వీరరాఘవయ్యగారు. వీరు ఆంగ్లభాషలో బి. ఏ పరీక్షయందు కృతార్థులై ప్రస్తుతము బందరునందు కలెక్టరు కచేరీలో నుద్యోగిగానున్నారు. తృతీయపుత్రుండు నాగేశ్వరరావుగారు. వీరును బి. ఏ జదివియుండిరి. ఈసంవత్సరము పరీక్షకు వెళ్లనైయున్నారు.

ఈ బాపనమ్మగారికి సుమారు నాలుగుసంవత్సరములనుండి మనంబునందు దుఃఖాంకురము లంటియుండెను. తన జ్యేష్ఠపుత్రుండగు వెంకటనారాయణగారి భార్య సుమారు నాలుగుసంవత్సరములకు పూర్వమే శరీర రుగ్మతచేత నకాలమరణమునొందియుండెను. అప్పటికి యామె సంతతిలో పసికూనలుండిరి. తన మనుమలగు యాపసిపిల్లల మాతృవియోగమునకు బాపనమ్మగారు మనంబునం దెంతయో కుందుచు యాపిల్లల కేకొఱంతయును రానీక సంరక్షించుచుండెను. తిరిగి తనకుమారుడు వివాహము చేసుకొ లేదను విచారముగూడ యామెమనంబును బాధింపజొచ్చెను. వివాహము చేసుకొనుటకు యనేకులచే ప్రోత్సాహపరపించెను. గతసంవత్సరము వెంకటనారాయణగారు తిరిగి వివాహము జేసుకొని తమ మాతృకకు గలిగియున్న మనోవిచారమును కొంతపోగొట్టిరి. గాని యిప్పటికి సుమారు తొమ్మిదిమాసములకు పూర్వము మరొకదీర్ఘ విచారము ఆమె మనంబునందు నాటుకొనిపోయెను. ఆమె కొకపుత్రిక గలదని పైన దెలిపియుంటిని. ఆపుత్రిక పేరు రాజ్యలక్ష్మి. ఈ రాజ్యలక్ష్మియే తిమ్మ పట్టాభిరామయ్యగారికి ధర్మపత్ని. సుమారు తొమ్మిదిమాసములకు పూర్వము పట్టాభిరామయ్యగారు అకాలమృత్యువువాతబడి రాజ్యలక్ష్మికి ధరింపరాని దుఃఖమును కలుగజేసియుండెను. రాజ్యలక్ష్మియొక్క సుగుణసంపదయును, సుశీలతయును, దెలిసిన వారెల్లరు ఆమెకు కలిగిన యాపదకు దుఃఖింపకమానరు. అట్టి సుధీమణియగు కొమరితకు గలిగిన యాపదచే బాపనమ్మగారి మనంబంతయు సంపూర్ణ దుఃఖమయమైనది. అందుచే తన శరీరములోగల రక్తమాంసములు హరింపుకాజొచ్చినవి. ఆమెకు కలిగిన విచారము లన్నియును కలసి శరీర రుగ్మతక్రిందను మారి క్రమక్రమముగ యభివృద్ధిగాంచెను.

సుమారు రెండుమాసములకు పూర్వము నేను బందరు వెళ్ళినప్పుడు ఆమెను జూచుటకు ఆమె పరుండియున్న గదిలోనికి వెళ్ళితిని. అప్పటికి యామె శరీరములోగల రక్తమాంసములు పూర్తిగా హరింపుకాబడి శల్యమాత్రావశిష్టురాలై మంచముమీద పరుండియుండెను. నే నామంచముప్రక్కను నిలచి, అమ్మా మీయొంట్లో యెటులున్నదని పలుకరించితిని. వెంటనే నావంక తేరిజూచి నన్ను దెలుసుకొని యాప్రక్కనున్న యాసనముపై నన్ను కూర్చుండ నియమించి, "నాయనా యెప్పుడు వచ్చితివి? పిల్లలందరును క్షేమమా? ఇదియే నాకడపటిచూపు. నే నెంతయో కాలము జీవింపను." అని పలుకుచు ఆమె హస్తములు రెండును నాకు అందించి నాపై జూపిన మాతృప్రేమను దలంచుకొనినచో యిప్పటికిని నామనంబు దుఃఖమయముగుచుండెను. అట్టి విశాల భావోపేతమైన మాత, సుగుణరాశి, అందరను విడిచి దివమున కేగినదనిన యెవరిమనంబు దుఃఖభాజనంబు గాకుండును? బాపనమ్మగారి యాత్మకుశాంతిని చేకూర్ప దయామయుండగు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.



# ఫిర్యాదు

న్యాపతి కృష్ణారావుగారు బి.ఎ., బి.యల్.

యేసు ఉదయమున ఆలయము ప్రవేశించెను. జనులందఱు అతనిచుట్టును గుంపుగూడిరి. అవతారపురుషుఁ డాసీనుఁడై వారలకు బోధించుచుండెను.

అంతలో ఫారిసీలు ఒక జారిణిని తమ వెంటగొనివచ్చిరి. జన సమ్మర్ద మధ్యమున ఆ లతాంగిని నిలిపి ప్రవక్తనుద్దేశించి వారిట్లనిరి.

"ఆర్యా యీమె జారిణి. దుష్కర్మయందే పాపము బ్రద్దలయ్యెను. ఆ సమయముననే పట్టుబడెను. మహాశయుఁడైన మోసెసు అట్టి వారలను రాళ్లతో రువ్వి చంపుఁడని ఆనతిచ్చెను. తమరేమి సెలవిచ్చెదరు." మోసెసునకు వ్యతిరిక్తముగ నాతఁడేమి వాక్రుచ్చునో వానిని నిందింతుమని వారు తడవు వేచి యుండిరి. కాని యేసు తలవంచి వారల వినిపించుకొననట్లు తన చూపుడు వ్రేలితో పుడమిపై వ్రాయుచుండెను.

ఫారిసీలు మఱల ప్రశ్నించిరి. అపుడా ప్రభువు తలయెత్తి వారల విలోకించి వచించెను. "మీలో పాపరహితుఁడు ప్రథమమున ఆ అబలపై రాయి రువ్వునది." అని తలవంచి పుడమిపై వ్రాయ మొదలిడెను.

ఎల్లరును యేసు వాక్కులను వినిరి. పెద్దలుమొదలు చిన్నవారివరకును తాను పాపరహితుఁడనని తమతమ మనసులను సమాధానపరుప జాలరైరి. క్రమముగ అచ్చటినుండి ఒక్కరొక్కరె జారిపోయిరి. యేసును, ఆస్త్రీయును మిగిలిరి.

యేసు తిరిగి తలయెత్తి యిట్లనెను "అంగనా నీపై నేరముమోపిన ఫిర్యాదీ లేరి? నీపై నెవరును రాయి విసరలేదా?"

"ప్రభూ ఎవ్వరును రువ్వలేదు."

"నేనును నిన్ను నిందింపను. పొమ్ము. పాపముచేయకు మిక."

# "రవ్వల బ్రోచ్"

శ్రీమతి కామేశ్వరిగారు

చెన్నపురియందు రామచంద్రరావు గొప్ప ధనవంతుడు. అతనిభార్య జానకమ్మ. వారికి, ప్రభాకరుడు, సుశీలయును యిరువురు సంతానం. ప్రభాకరునితరువాత సుశీల ఆరువర్షములకు జనించెను. సుశీలకు చతుర్దశవర్షములు. ఆమె బాలికా పాఠశాలయందు ప్రవేశపరీక్షకు చదువుచుండెను. సుశీల చాలాచురుకైనబాలిక. పద్మయనునొక పేదబాలిక సుశీలకు ప్రియమైన స్నేహితురాలు. పద్మకు యేకాదశవర్షములు. పద్మ నాల్గవఫారమందు చదువుచుండెను. ఆమె విద్యకై వినియోగించు కాలముతప్ప మిగత సమయములంతయు సుశీల గృహమందేయుండెడిది. సుశీలకంటెను పద్మకు విద్యాసక్తి మెండు. ఆమెయనిన, సుశీలకారవ ప్రాణము.

పద్మకు వృద్ధుడగు జనకుడుతప్ప మరెవ్వరు ఆప్తబంధువులులేరు. మాధవరావునకు యౌవనమందే, భార్యావియోగము సంభవించుటచే, పద్మయే సర్వస్వమని, ఆమె నతిగారాబముతో పెంచుచు, విద్యాబుద్ధులు చెప్పుచుండెను. మాధవరావు చిరకాలముగ తాలూకాఫీసు గుమాస్తాగ యుండెను. ఇప్పుడతడుద్యోగమునూని, పెన్షను పుచ్చుకొనుచున్నాడు. ప్రతిమాస మాతనికి పాతికరూపాయలు పెన్షను వచ్చుచుండెను. ఆరోగ్యముతో మాధవరావును పద్మయు, ఒకచిన్న యింటియందు కాలము గడపుచున్నారు. పద్మ చిన్నబాలిక అయినను తండ్రికి గృహకృత్యములందు తోడ్పడుచుండును.

సుశీల ప్రవేశపరీక్షయందుత్తీర్ణ అయినట్లు తెలిసి, రామచంద్రరావుగారి కుటుంబమంతయు ఆనందముతో నిండియుండెను. ఒకగొప్ప శ్రీమంతుని కుమారునికి సుశీలనిచ్చి వివాహము చేయునట్లు రామచంద్రరావు నిశ్చయించెను. జానకమ్మ, సుశీలకు రవ్వల ఆభరణము లెన్నియో క్రొత్తగా చేయించెను. తనపుత్రి వివాహమునకై అహోరాత్రములు జానకమ్మ పెండ్లికార్యములు సంభ్రమముతో చేయుచుండెను. వివాహమునకు రెండుదినములు వ్యవధియుండెను. సర్వసిద్ధమైనది. రామచంద్రరావు గృహమంతయు బంధుజనులతో నిండి కళకళలాడుచుండెను. రామచంద్రరావు, జానకమ్మ, సుశీల ముగ్గురును మాధవరావు యింటికి వెళ్లి పద్మను, ఆమెతండ్రిని, తమకుమారి వివాహమునకు ఆహ్వానించిరి. సుశీలతన వివాహమగునంతవరకు, పద్మ తమగృహమందే యుండునట్లు ఆమెను ఒప్పించెను. పద్మ సుశీలయొక్క స్నేహపూర్ణ వాక్యములకు ఆనందించెను. వారందరు మాధవరావు వద్ద సెలవుగైకొని తమయింటికి వెడలిపోయిరి. సుశీల పెండ్లికి ముందురోజు సాయంత్రము, పద్మ ఒకతెల్లని చీరధరించి తన నామాంకితమైనచిన్న బంగారు వుంగరము పెట్టెనుండితీసి, దానికి మెరుగువేసి, సుశీలకు వివాహమప్పుడు తనపేర కానుకగ

యిచ్చెదనని తండ్రికి చెప్పెను. ఆమె పల్కులకు మాధవరావు సంతసించి ఒక ఖద్దరుచీర, అవుంగరము తయారుగావించి పద్మచేతికిచ్చెను. ఆమె వాటిని ఒకశుభ్రమైన తెల్లని వస్త్రమందు భద్రపరచెను. ఆనాారాత్రి సుశీలగృహమునకు వెళ్లుతూ "నాన్నా! మీారు రేపుదయము వారింటికి వచ్చినప్పుడు యీావస్తువులు నాకక్కడ అందివ్వండి" అనిచెప్పి పద్మవెడలెను.

సుశీల సర్వాభరణభూషితయై, నూతన వస్త్రాలంకారముతో శోభిల్లుచుండెను. పేద బాలికయగు పద్మకెట్టి యాభరణములు లేవు. ఆమె సహజసౌందర్యముతో యొప్పుచుండెను. సుశీలకంటెను పద్మరూపవతి. సుశీల పద్మనుచూచి జాలితో తనవికొన్ని ఆభరణములు చీరలు యిచ్చెను. అవి ధరించిన పద్మసౌందర్యము ద్విగుణీకృతమయ్యెను. అప్పటి ఆమెరూపమునుగాంచి మాధవరావు "పద్మ యొకభాగ్యవంతునింట జనింపక నిర్భాగ్యుడగు నాకడుపున బుట్టినది. భగవంతుని చిత్రలీల" యని తలచెను. సుశీలవివాహ మతివైభవముగ జరిగినది. ఆమె తల్లిదండ్రుల ఆనందమునకు మితియున్నదా? సుశీలకు వివాహమందొచ్చినకానుకలకు మితిలేదు. ఆమె కన్నికానుకలకంటె పద్మ తనకు వివాహమందుయిచ్చిన సువర్ణ అంగుళీయక మామెహృదయమున కానందము గూర్చెను. సుశీల పెండ్లినాటిరాత్రి మాధవరావు యిచ్చిన ఖద్దరుచీరె ధరించెను. పెండ్లినాటిరాత్రి, అందరుభుజించి శ్రమతో నిద్రించిరి. ప్రాతఃకాలమాయెను. పెండ్లివారందరు మేల్కొని తమతమ కాలకృత్యములు తీర్చుకొనిరి. సుశీల మేల్కొని కాలకృత్యములు తీర్చుకొని, అలంకరించుకొనుటకై గదిలోనికివెళ్లెను. సుశీల ఆభరణములు వేరువేరుగ ధరించుకొనుచుండెను. ఆమె అలంకృతి పూర్తి అయినది. ఆమె యేదోయొక ఆభరణము కనపడనట్లు గది అంతయు కలయవెదకుచుండెను. భయముచే సుశీల "అమ్మా! అమ్మా!"అని గట్టిగ అరచెను. కుమార్తెపిలుపువిని జానకమ్మ తత్తరముతో గదిలోకివచ్చి, "ఏమి? సుశీలా!" అనెను. సుశీల వణకుచు "అమ్మా! నారవ్వల బ్రోచ్ యెచ్చటనో పడిపోయినది. గది అంతయు వెదకితిని. దాని జాడలేదు. రాత్రి అన్నిసొమ్ములతోకూడ తీసియుంచితిని"అని చెప్పి పల్కకుండెను. జానకమ్మ తనబిడ్డ మాటలు వినుచు, ఆలోచించుచు నిల్చుండెను. సుశీలా పద్మలు ప్రత్యేకగదియందు రాత్రి నిద్రించుటచే, రాత్రి బ్రోచ్ పెట్టియుండున్నట్లు తెలిసి, జానకమ్మ అనుమానమంతయు పద్మపై మరలినది. ఆమె పద్మను పిలిచి, బ్రోచ్ ఆమె చూచినదేమోయని అడిగెను. తాను చూడలేదని పద్మ బదులిచ్చెను. జానకమ్మ అనుమానము ప్రబలుటచే, పద్మను మందలించెను. లాభము లేకపోయెను. తాను బ్రోచ్ తస్కరింపలేదని యెన్నో నిదర్శనములు చూపెను. అనుమానాగ్నిచే దహింపబడు జానకమ్మ, నిష్కపట హృదయయగు పద్మమాటలు నమ్మునా?

ఆమె పద్మ ననేకవిధముల దూషించి యిదిమొదలు తమయింటికి రావద్దని గద్దించి

పల్కి ఆగదినుండి వెళ్లిపోయెను. జానకమ్మ ప్రతిమాటయు పద్మకు కర్ణకఠోరములై తోచెను. పద్మ కంటికి మంటికి యేకధారగ నేడ్చుచుండెను. సుశీల పద్మదుఃఖమును భరింపలేక, ఆమెదగ్గర కూర్చుండి "పద్మా! యెంతఅధైర్యవతివే! మాఅమ్మ ఆత్రమున నిజమెఱుంగక కోపించి పల్కినమాత్రాన నీవింతగ దుఃఖించవలయునా? నీవునిరపరాధివని నాఅంతరాత్మ బోధించుచున్నది. నీవట్లు దుఃఖించిన నామనసు నెంతయు నొప్పించిన దానవగుదువు"అని ఆమెనూరడించెను. ఇంతలో రామచంద్రరావు ఆగదిలోనికివచ్చి పద్మనుగని, ఆత్రముతో యుక్తాయుక్తము లెరుంగక ఆమెను పోలీసువారికి ఒప్పగించెదనని కోపించిపల్కెను. పద్మ రోదించుచు హస్తములు ముకుళించి, సుశీలకు నమస్కరించుచు, తనయింటికి వెడలిపోయెను. పద్మ తనతండ్రివద్దకువచ్చి, వృద్ధునకు సర్వమెఱింగించి, తన పైబడిన మిథ్యాపవాదమును తెల్పెను. నిష్కారణముగ తనబిడ్డపై బడిన అపవాదమునకు మాధవరావు వగచి పుత్రిక నూరడించెను. పద్మకు తనకువచ్చిన అవమానముకంటెను సుశీల యెడబాటు దుర్భరముగ వుండెను. పద్మ నాల్గవఫారమందు జయమందినట్లు తెలిసెను. ఆమె యథాప్రకారముగ పాఠశాల కరుగుచుండెను. సుశీల పాఠశాల చాలించుటచే, ఆమెను పాఠశాలయందు చూచుటకుకూడా సాధ్యముకాదు. నాలుగువర్షములు గడచినది. పద్మా సుశీలలు ఒకరినొకరు చూడకుండుటచే వారు దిన మొకయుగముగ గడపుచుండిరి. పద్మ తనవివాహమందిచ్చిన అంగుళీయకమును చూచుచు సుశీల ఆమెనుతలచి దుఃఖించుచుండెడిది.

ఐ. సి. ఎస్. పరీక్షనిచ్చుటకై లండను నగరమున కరిగియుండిన ప్రభాకరుడానాడు చెన్నపట్టణమందున్న స్వగృహమున కేతెంచెను. అతనిరాకకు, రామచంద్రరావు, జానకమ్మ, సుశీలయు యెంతో ఆనందించిరి. ప్రభాకరుని తలిదండ్రు లతని విద్యావిషయమై వివిధప్రశ్నలు వేయుచుండిరి. సుశీలతన సోదరుని విదేశపువింతల నడుగుచుండెను. వీరిట్లు సంభాషించుచుండగా అక్కడికి వారి సేవకు డొకడు అరుదెంచి, "అమ్మగారూ! మనదాసి వెంకమ్మకు పాము కరచినది. చాలా అపాయస్థితిలో వున్నది. తమరితో ఒకముఖ్యమైన సంగతిచెప్పవలయునట. తల్లడిల్లుచున్నది" అనిచెప్పి త్వరగా వాడు వెళ్లెను. జానకమ్మయు సుశీలయు త్వరగాదాసి యుండు గుడిసెకు వెళ్లిరి. వీరినిచూచి వెంకమ్మ "అమ్మా! మీఋణము నేను తీర్చలేను. అమ్మా! నన్ను మీరుక్షమిస్తేగాని మీ పాదములు విడువను. నాపాపమునకు తగిన ప్రాయశ్చిత్తమైనది. చిన్నమ్మపెండ్లి నాటిరాత్రి, పద్మమ్మపై మీకనుమానము కలుగునట్లు బ్రోచ్ నేనుతీసితిని. పద్మమ్మ నన్ను క్షమిస్తేనేకాని నాప్రాణములు విడువను"అని దీనముగ పల్కెను. వెంటనే సుశీల మాధవరావు వసించుయింటికికారులో వెళ్ళి, దూరమునుండియే, "పద్మా!"అని బిగ్గరగ అరచెను. ఆస్వరమునుగుర్తించి పద్మ పరుగెత్తు

కొనివచ్చి, సుశీలను కౌగలించుకొని, "సుశీలా! నేను నిజముగ నిరపరాధిని సుమా!" అనెను. సుశీలనవ్వుచు సర్వము మాధవరావునకు పద్మకు ఎరిగించి, ఆమెను తనకారునందు కూర్చుండబెట్టుకొని, వెంకమ్మ గుడిసెకు తీసికొని వెళ్లెను. వెంకమ్మ పద్మను తనవద్ద కూర్చుండబెట్టుకొని ఆమెకు నమస్కరించుచు, క్షమాపణ వేడుకొనెను. పద్మ ఆమె పశ్చాత్తాపమునకు సంతసిల్లి, తన్ను చిన్ననాటి నుండియు ఎరిగినదాసి ప్రాణములు వీడుచున్నందుకు దుఃఖించెను. వెంకమ్మ తన గృహమందుదాచిన బ్రోచ్ జాడతెల్పి ప్రాణములు విడచెను. జానకమ్మ, సుశీల, వెంకమ్మ పశ్చాత్తాపపడి నిజమెఱిగించినందుకు ఆనందించి, నిష్కారణముగ పద్మను దూషించినందుకు వగచిరి. పద్మయొక్క సద్గుణ సత్యభాషణముల ననేకవిధముల ప్రశంసించి ఆమెను తమగృహమునకు తోడ్కొనివెళ్ళిరి. జానకమ్మ పద్మతో "పద్మా! నీపై నిష్కారణముగ నిందమోపితిమి. ఈబ్రోచ్ వలన యింతజరిగినది. గనుక నీకీబ్రోచ్ యిచ్చుచున్నాను"అనెను. సుశీల ఆమెపల్కుల కడ్డమువచ్చి, "అమ్మా పద్మయొక్క సుగుణములు మన కెన్నిదినములయినను, అలవడునా? మనము నొప్పించిన మాటలకు యీచిన్నిబ్రోచ్ బహుమానమా? ఇటువంటి సచ్చరిత్ర మనగృహమలంకరించిన మనము ధన్యులమగుదుము. అన్నా! ప్రభాకరా! నాదొకమనవి. సద్గుణరాశియు, విద్యావతియునగు, పద్మను నీ భార్యగ స్వీకరింపుము. నీవు అంగీకరించిన అమ్మయునాన్నయు అడ్డుపెట్టెదరా?"అనిన, ప్రభాకరుడు చిరునవ్వునవ్వుచు, "సుశీలా! నామనోగతమును నీవే వెల్లడించితివి. పద్మయే నాఅర్థాంగిఅయిన నేను ధన్యుడను." అనెను. కుమారుని మాటలు వినుచున్న జానకమ్మ, రామచంద్రరావు, పద్మబీదబాలికయని సందేహించిరిగాని, ఆమెసద్గుణములకు రూపమునకు, ధనవంతుని బిడ్డలకు తీసిపోవునదికాదు. మరియు కుమారుని మనసుకు నచ్చినకన్యను వీరు వలదని త్రోసివేయుదురా! వారు పద్మను కోడలిగా స్వీకరించుటకు అంగీకరించిరి. వీరిమాటలన్నియు వినుచున్నపద్మ సిగ్గుచే తలవాల్చెను. రామచంద్రరావు మాధవరావునకు సర్వమును వార్త పంపెను. ఆవృద్ధుని ఆనందమునకు మితిలేదు.

పద్మాప్రభాకరుల వివాహమతిమహోత్సవముగ జరిగెను. విద్యావంతుడును, ధన, రూపములచే యొప్పినట్టియు, ప్రభాకరుని భర్తగ బడసినపద్మ ఆనందముచే మైమరచియుండెను. సుశీల సంతోషముతో "వదినా! నీకు యీ బ్రోచ్ వేసెదనుండుము"అని తనస్వహస్తములో పద్మనలంకరించెను. పద్మయొక్క అప్పటిరూపము సుశీల తనివితీర గాంచుచుండెను. వృద్ధుడగు మాధవరావు సంతోషాతిశయముచే ఒకప్రక్క కూర్చుండెను. అప్పుడు, పద్మాప్రభాకరు లతనికి నమస్కరించిరి. మాధవరావు పుత్రికా జామాతల నేమి యాశీర్వదించెనో!

# జయపురము ఇస్టేటు

శనివారపు సుబ్బారావుగారు

## ప్రజలు—భాష.

జయపురము సంస్థానపు ప్రజలలో ఎక్కువమంది కొండజాతులవారే. వారిలో కూడ చాలా తెగలు గలవు. అనాది తెగవారు గదబ అను పేరిట నున్నారు. వీరిలో స్త్రీ పురుషాదులు ఇత్తడి తీగలను జతగా చేర్చి 6 అంగుళముల కైవారముతో గూడిన గుండ్రని తీగ చుట్టను రెండు చెవులకు పైభాగమున బెజ్జము చేసి అందు తగిలించుకొనెదరు. మెడలో వెండితీగెను స్త్రీపురుషులు ధరించెదరు. స్త్రీలు మాత్రము చేతులకు వెండి మురుగులవరుసను మోచేతివరకు తగిలించుకొనెదరు. పురుషులు ఒకటి రెండుజతగల మురుగుల వరుసనే రెండుచేతులకు తగిలించుకొందురు. స్త్రీలకు కాళ్ళకు అందెలున్ను తోడాలున్ను నుండును. మిగత కొండజాతులవారింతకన్న కొంచెము నాజూకుగా నుండెదరు. స్త్రీలు మోకాలువరకే చీరలను ధరించెదరు. ఇపుడిపుడే పంచెలను కట్టుచున్నారు. చొక్కాయలను ధరించుటకూడ గలదు. తలకు పాగా ఉండును. పురుషులకన్న స్త్రీలే ఎక్కువగా వ్యవసాయకృషిని చేయుదురు. ఇపుడు వారు కట్టే బట్టలన్నియు విదేశీవస్త్రములే. కొండజాతులవారు కట్టే అంచులు, పొడుపు, వెడల్పులతో కూడినట్లుగా జపాను దేశమునుండి టపేటాసిల్కు అను పేరిట చీరలు తయారై వచ్చుచుండును. వాటినే ఇపుడు ఆ ప్రాంతములలో నవనాగరికు లనుకొనువారంతా కట్టుచున్నారు. మిగతావారు అట్టిమాదిరి నూలుబట్టలనే (రంగులువేసినవి) కట్టుచున్నారు. మోటారుబస్సు నడచే రహదారీప్రక్కనుండే గ్రామములలో కాఫీహోటల్సున్ను, బట్టలు తదితర చిల్లరవస్తువులు దొరకే కిరాణా దుకాణములున్ను బట్టలకుట్టు మిషనులున్ను గలవు.

మనుష్యులు పరిశుద్ధంగా ఉండరు. తరచుగా నీళ్లు పోసుకొనరు. తలమాత్రం స్త్రీ పురుషాదులు అముదపునూనె, లేక విప్పనూనె రాసుకొని చక్కగా దువ్వుకొనెదరు. పురుషులలో నవనాగరికు లనుకొనువారికి క్రాపింగులు గలవు. మురికితో కూడిన వస్త్రములనే వాడెదరు. బట్టలను తరచుగా ఉతికేటట్టు తోచదు. ఆహారము చోడిఅంబలి. వరి అన్నమును ఎక్కువగా వాడరు. ఆవులు గేదెలు గలవు. వాటినుండి పాలు పితికి ఆపాలను తోడుపెట్టి నేయి, వెన్న, మజ్జిగ చేయడమనేది వారికి తెలియదు. పాలనుకూడా వాడరు. పాలను దూడలకే వదిలెదరు. మోటారుబస్సులవల్ల రోడ్డుప్రక్కలనుండే గ్రామములలో వెలసిన కాఫీహోటళ్లవారు పాలను కొని కాఫీ, టీ మున్నగువాటిని తయారుచేయుట గలదు. ఈ ప్రదేశములలోనుండే పెద్ద పెద్ద గ్రామాలలో వర్తకరీత్యాను తదితర ఉద్యోగాలరీత్యాను వెళ్లినప్రజలకు పాలను కొండప్రదేశములలోనుండే గ్రామాలవారు సప్లయి చేయుచుందురు. ఇపుడిపుడే కొన్ని చోట్లలో మజ్జిగ, నేయి చేయడమనేది నేర్చుకొంటున్నారు. ఒరియాభాషకు సంబంధించినదే యీ కొండజాతులవారి భాషయని చెప్పవచ్చును. ఒరియాభాష వచ్చినవారంతా సులువుగా యీ కొండజాతులవారితో మాట్లాడగలరు. తెలుగుభాష చాలా తక్కువ. జయపురమునందు కొద్దిమంది సిక్కులు, కొద్దిమంది హిందీభాషయే మాతృభాషగా నున్నవారు గలరు. ఒరియా మాతృభాషగానున్నవారు పెక్కురు గలరు.

## గనులు.

ఈ ఇస్టేటునందుండే కొండలలో ఎక్కువగా ఇనుము దొరకుననియు కోలాబానది ప్రవహించే కొండలదారియందు బంగారము దొరకుననియు వెనుక ఎపుడో భూగర్భశాస్త్రపరిశోధనలలో ఉత్తీర్ణుడైన పండితుడు పరీక్షించి తెలిసికొనినటుల చెప్పుకొందురు.

### లోకల్ బోర్డుల పరిపాలన.

లోకలుబోర్డులవారు చిల్లర రహదారీలున్ను, ప్రాథమిక, మిడిల్, శెకండరీ విద్యయు ఆసుపత్రులను ఏర్పాటుచేసిరి. ఈ ఏజన్సీ అంతటిలో 3 రూరల్ ఆసుపత్రులున్ను ప్రతి తాలూకా ముఖ్య పట్టణమందు ఒక ఆసుపత్రియు గలదు, కోరాపుట్టి యందు మాత్రము ప్రభుత్వ ఉద్యోగీయులలో ముఖ్యాధికారు లందరి వెంటను ప్రయాణములలో కూడా నుండుటకుగాను ప్రత్యేక డాక్టర్లు గలరు. ఇట్టివారు 7 గురు గలరట. జయపురమునందు హైస్కూలున్నది. ఎన్నికలపద్ధతితో జిల్లాబోర్డు ఏర్పడలేదు. గవర్నమెంటువారి నియామకముమీద నే సభ్యు లేర్పడెదరు. అందు ఎక్కువమంది ప్రభుత్వ ఉద్యోగీయులే అయి ఉందురు.

### డి. పి. డబిల్యు (ఇంజనీరింగు శాఖ).

ముఖ్య రహదారీలన్నిటిని నియమించుటకున్ను, వాటి సంరక్షణకున్ను, రహదారీలకు వంతెనలు మున్నగువాటిని నిర్మించుటకు, వాటి సంరక్షణకు, వాటి పరిపాలనకున్ను గవర్నమెంటువారే ఇంజనీరింగు శాఖను ఏర్పాటుచేసిరి. వీరు నీటిసదుపాయములకన్న రహదారీ సౌకర్యములనే ఎక్కువగా జూచుచుండెదరు.

### అబ్కారీ అండు ఎక్సైజు
### (మత్తుపదార్థములకై).

ఈ శాఖవారు నల్లమందు, గంజాయి దుకాణముల పరిశీలింతురు. విప్పపువ్వుద్వారా వ్యక్తులు సారాయి తీయుటకు ప్రభుత్వమువారి అనుమతి యవసరము. ఇందుకొరకు ఏర్పాటుచేసిన ఫ్యాక్టరీలను ఫ్యాక్టరీలవారు ఏర్పాటుచేసిన డిపోలనుగూడ ఈ శాఖవారు పరిశీలింతురు. వాటివల్ల వచ్చు రాబడిని యీ డిపార్టుమెంటువారే వసూలు చేతురు.

జయపురమునకు 4 మైళ్ల దూరములో ఉమిరి అను గ్రామము కలదు. అచ్చట నొక ఇంగ్లీషు కంపెనీ వారు విప్పసారాయిని తీసే ఫ్యాక్టరీని ఏర్పాటు చేసిరి. ఇట్టి ఫ్యాక్టరీయే రాయగడయందు మరి ఒకటి గలదు. ఈ రెండు ఫ్యాక్టరీలద్వారా విప్పసారాయిని తీసి వాటి అమ్మకమునకు డిపోలను ఏర్పాటుచేసిరి. కొండజాతులవారిలో పల్లెటిగ్రామాదులవారికికూడ యీ డిపోలు అందుబాటులోనుండును. విప్పపువ్వును అడవులనుండి తీసుకొనువారు ఇస్టేటునకు కొంత సుంకమును చెల్లించెదరు.

జీలుగుచెట్లు గలవు. ఈ చెట్లనుండి కొండజాతులవారు కల్లునుతీసి త్రాగెదరు. ఇట్టి కల్లుకు ఇంతవరకు గవర్నమెంటువారు ఏవిధమైన పన్నును విధించలేదు. తాటి, ఈతచెట్లు లేవు. అందువలన వాటివల్ల ఏర్పడే కల్లు దుకాణములు లేవు.

### పరపతి సంఘములు (కోఆపరేటీవు శాఖ)

ఇదివరలో ఈశాఖ అంతయు జిల్లాకలెక్టరుగారి ఆధీనమందే ఉండెను. గతసంవత్సరమే జిల్లాకలెక్టరుగారు దీనిని జిల్లా డెప్యూటీ రిజిష్ట్రారు వారికి వశపరచిరి. ఈ ఏజన్సీ అంతటిలోను రమారమి 20 సంఘము లున్నటుల తెలియుచున్నది.

### విద్య

పల్లెటి గ్రామాదులలో పాఠశాలలు లేవు. కొండజాతులవారు మాట్లాడేభాషకు వ్రాతలేదు. గ్రామములలోనుండే గ్రామకరణం మునసబులకు వ్రాత రాదు. ఓఢ్రభాషగాని, తెలుగుభాషగాని నేర్పుటకు రాజాగారు గాని, లోకల్ సెల్ఫుగవర్నమెంటు వారుగాని శ్రద్ధ బూనుటలేదు.

### సంతలు

ముఖ్యమైన ప్రదేశములందు సంతలు జరుగుచుండును. ఆసంతలకు పల్లెలనుండి ఎడ్లమీదను, బళ్లమీదను సరకులను తెచ్చి అమ్ముచుందురు. బస్తీలనుండి యీసంతలకే బట్టలు, కిరాణీ సరకులు, ఉప్పు, మున్నగు వాటిని తీసుకువెళ్లి అమ్ముచుందురు. బియ్యము, చోళ్ళు తీసుకొని వారికి కావలసిన ఇతర

సరకులను ఇచ్చేపద్ధతియే చాలచోట్ల అమలులో నున్నది.

మృగముల భయము లేకుండా నుండుటకై యీ సంతలకు వచ్చేవారంతా జట్టుగా బయలుదేరి వచ్చుచుందురు. చిఱుతపులులు, పెద్దపులులు, తోడేళ్ళు, ఎలుగుబంట్లు, లేళ్ళు, దుప్పులు మున్నగునవి తరచుగా తిరుగుచుండును. ప్రభుత్వ అధికారులు తరచుగా వేటకువెళ్లి వీటిని చంపుటకలదు. టంగీ అను పేరిట 8 లేక 10 అంగుళముల పొడవున విలువంపుగా గొడ్డలివలెనుండే ఆయుధము ఒకటి ఉండును.

ఈ ఆయుధమును బుజమున వేసికొనియే యీ ప్రాంతములలో నుండే పల్లెటి గ్రామాదులవారు పొలములకు తదితర గ్రామాలకు వెళ్ళుచుందురు.

ఆనపకాయ బుర్రలలో మంచినీళ్ళను, చోడి అంబలిని నిలువచేసుకొని దూరపు ప్రయాణములలో కూడా తీసుకువెళ్లుచుందురు.

కుండలు పగిలిపోవుననే కారణమున చీనారేకులో నుండే ఖాళీ కిరసనాయిలు డబ్బాలను బళ్లమీద తీసుకువచ్చి, సంతలలోను దారిలో చేసే మకాముల లోను ఆ డబ్బాలతోనే చోడి అంబలిగాని, అన్నంగాని, వండుకొనెదరు.

కార్మికులు

అస్సాము రాష్ట్రములోనుండే తెల్లదొరల తేయాకు తోటలలో పనిచేయుటకు ఈ ఏజన్సీప్రదేశమునుండి సాలునకు సుమారు 2000 మంది కూలీలను పంపుచుందురు. ఈ ఏర్పాటంతటికి కోరాపుట్టియందు టి.డి.యల్.ఎ. (టీ డిస్ట్రిక్టు లేబరు ఎస్సోసియేషను) అను పేరిట నొక ఆఫీసున్నది. ఈ ఆఫీసువారికి మోటారు లారీలున్నవి. రెండు సంవత్సరముల కంట్రాక్టుతో రోజుకు రు. 0-8-0 లు కూలి ఇచ్చేపద్ధతితో యీ ఏజన్సీయందుండేవారిని కార్మికులుగా తీసుకువెళ్లి కంట్రాక్టుకాలము ముగిసినపిమ్మట మరల ఏజన్సీలో దిగబెట్టెదరు. ఎక్కువకాలము అస్సాములో నుంచిన కార్మికసంఘము లేర్పడి సమ్మెకట్టులు వచ్చునను భయంతోనే ఇటుల చేయుచున్నారని తెలియుచున్నది. అస్సామునుండి కంట్రాక్టు కాలము ముగిసిన పిమ్మట తిరిగివచ్చే వారిని లారీలలో వారి గ్రామములకు తీసుకువెళ్లి విడచెదరు. వారి ద్వారా ప్రచారం చేయించి క్రొత్తవారితో మరల కంట్రాక్టు చేర్పరచుకొని మరొక జట్టును తీసుకువెళ్లుదురు. రెండుసంవత్సరముల అనంతరం ఒక్కొక్క కార్మికుడు రు 50 లలోపునే కూడబెట్టి తెచ్చుకొనుచుండునని తెలిసినది.

అస్సామునుండి యీరీతిగ వచ్చేవారు నల్లమందు, గంజాయిని కొని తెచ్చుకొనుట కలదు. అట్టివారిని ఎక్సైజువారు పట్టుకొని హెచ్చుస్న రొడల కేసుపెట్టి వారు కూడబెట్టి తెచ్చుకొనిన సొమ్మునకు సరిపోయే రీతిగా జరిమానాలను విధింపడముకూడ కలదని తెలియుచున్నది.

ఈ ఏజన్సీలోనుండే రోడ్ల మరమ్మత్తునకు కంట్రాక్టర్లు గలరు. వీరు రోజునకు రు. 0-3-0లు ఇచ్చి కూలీలను ఏర్పాటు చేయుచుందురు. ఇక్కడుండే పెద్ద కంట్రాక్టర్లు బెంగాలీవారే అని తెలియవచ్చినది.

## ఈ ఏజన్సీ తెలుగుదేశములో నుండవలెనా? ఓఢ్రదేశములో నుండవలెనా?

ఈ ఏజన్సీకి పశ్చిమమున మధ్యపరగణాలలో నుండే బస్తరు ఎస్టేటు సరిహద్దుగానున్నది. ఈ బస్తరు ఎస్టేటునందు బంగాళాదుంపలు హెచ్చుగా పండును. కంబళ్లు నేయుదురు. ఈ రెండు సరకులున్ను అచ్చోట పండించే ధాన్యమున్ను నౌరంగపూరు తాలూకానుండి జయపురమునకు తీసుకువచ్చి అమ్మెదరు. బస్తరు ఎస్టేటునకు ముఖ్యపట్టణము పేరు జగదల్పూరు. జయపురమునకు 60 మైళ్ల దూరముండును. ఆ చుట్టుపట్ల తాలూకాలనుండి చేరే సరకు అంతయు జయిపురం చేరవలెను. జయపురంలో ఆ సరకులను షాహుకార్లకు అమ్మి వారికి కావలసిన బట్టలు, తదితర రసవర్గములు కొనుక్కొనెదరు.

జయపురమునకు చేరిన సరకు అంతయు మోటారు లారీలమీద సాలూరునకు వచ్చును. సాలూరునకు

జయపురమునకు రమారమి 75 మైళ్లు గలదు. మోటారుచార్జీ మనిషికి సాలూరునుండి జయపురము రు. 4-లు తీసుకొనెదరు. ఈ మోటారుబస్సుల మీదనే సాలూరునుండి తపాలు నడుచుచుండును. సాలూరునుండి బట్టలను తదితర రసవర్గములను జయపురమునకు తీసుకువెళ్లి అమ్ముచుండెదరు. జయపురం ఏజన్సీలో 6 తాలూకాలకు సాలూరు ముఖద్వారమై ఉన్నది. మిగతా 3 తాలూకాలకు పార్వతీపురం ముఖద్వారమైయున్నది. ఈ కారణమువల్ల తెలుగు దేశముతోనే వర్తకవ్యాపార మంతటికి సంబంధమున్నది. ఇదియునుగాక కొన్ని తాలూకాలలో చాలమంది తెలుగువచ్చినవారు గలరు. ఈ రెండు కారణములనుబట్టి ఓఢ్రదేశములో చేరకూడదని తెలుగువారంటున్నారు. ఓఢ్రభాషయే మాట్లాడువారున్నందున ఓఢ్ర రాష్ట్రములో కలియవలెనని ఓఢ్రులంటున్నారు. తెలుగుకంటె ఓఢ్రము యెక్కువమంది మాటలాడుదురు. భాషనే ప్రధానముగా జూచిన ఓఢ్రదేశంలో కలుపవచ్చును. రాకపోకల సౌకర్యము, వర్తక వ్యాపార సౌకర్యము జూచిన తెలుగుదేశముతో కలసియుండుట అగత్యం.

## సాంఘిక కలహములు.

జయపురమునందు గ్రంథాలయముగాని పఠన మందిరముగాని లేదు. అందువల్ల పురజనులు కలియుటకే వీలులేదు. తెలుగు వార్తాపత్రికలను తెలుగు వచ్చినవారిలో ఏ ఒకరిద్దరో తెప్పించెదరు. ఉద్యోగస్థులు ఆంగ్లభాష నేర్చినవారు హిందూపత్రికను తెప్పించెదరు. ఓఢ్రులు ఓఢ్రపత్రికలను తెప్పించుకొందురు. ఉద్యోగస్థులలో అరవ, ఆంధ్ర తగాయిదాలున్ను బ్రాహ్మణ, బ్రాహ్మణేతర తగాయిదాలున్ను లోలోన గలవు. పురజనులలో ఓఢ్ర, ఆంధ్ర తగాయిదాలు గలవు. ఇట్టివి నశించవలెనంటే అంతా ఒకచోటుకు సమావేశమగు ప్రదేశ ముండవలెను. అందైనను ధనికుడు, బీదవాడు, ఉద్యోగి, ఉద్యోగము లేనివాడు అను భేదములేకుండా నుండవలెను.

## ఇస్టేటును గురించిన తగాయిదా

ప్రస్తుతము ఈ ఇస్టేటును పరిపాలించే విక్రమదేవుగారు కీ॥ శే॥ రామచంద్ర దేవుగారి తండ్రిగారికి అన్న కుమారులు. రామచంద్ర దేవుగారికి సంతతిలేనందున విక్రమదేవుగారికే రాజ్యము చెందునని వారున్ను అంగీకరించుతూ అందుకు తగిన కాగితములను వ్రాసియిచ్చిరట. చనిపోయిన రామచంద్ర దేవుగారి మేనల్లునకు (అక్కగారి కుమారునకు) వారసత్వరీత్యా యీ రాజ్యము సంక్రమించవలెనను తగాయిదాను వారు తెచ్చినటుల తెలియుచున్నది. కాని ఏ తగాయిదా వచ్చినను రాజ్యము ప్రస్తుతము పరిపాలించే విక్రమదేవుగారికే భుక్తమగుననుట కాటంకము లేదు. కనుకనే గవర్నమెంటువారు వీరికే రాజ్యాభిషేకమును గావించిరని ప్రజల విశ్వాసము.

ప్రస్తుతము దివానుగారు రాజుగారికి నె. 1-కి రు. 20000లను స్వంతఖర్చులకుగాను ఇచ్చుచున్నారనియు రాజాగారి కోటఖర్చుకై మామూలుగా ఇదివరలో ఎంత అగుచుండునో అంతయు ఇచ్చుచున్నారనియు తెలియవచ్చినది. రు. 20000లకన్న హెచ్చుగా వాడుకోకూడదనుటకు ప్రస్తుతముండే తగాయిదా కారణము కావచ్చును. చనిపోయిన రామచంద్ర దేవుగారి భార్యకు సాలునకు ఒకలక్ష రూపాయిలు యావజ్జీవభృతిక్రింద యిచ్చుచున్నారని తెలియుచున్నది. ఇదిగాక చనిపోయిన మహారాజాగారివద్దనుండే గాజాపాత్రో అను అంతరంగిక కార్యదర్శి గారికిన్ని ప్రస్తుతము రాజాగానున్న విక్రమదేవుగారి వద్దనుండె అంతరంగిక కార్యదర్శిగారికిన్ని నె. 1-కి రు. 300-లవరకు వేతనముగా నిచ్చుచున్నారని తెలియుచున్నది.

## రా జా గా రి కి మ న వి

ప్రస్తుతము పరిపాలన చేయుచున్న శ్రీరాజా విక్రమదేవవర్మగారు మిక్కిలి యోగ్యులనియు విద్వాంసులనియు ప్రఖ్యాతిగలదు. వారినిగూర్చి ఇట్టి పొగడికలనే నేనున్ను నా స్నేహితులును 1933 మార్చి నెలలో జయపుర ప్రాంతములను జూచుటకు వెళ్ళినపుడు విని ఉన్నాము. రాజావారు స్వయముగా దివానుగారింటికి సాయంకాలమపుడు మోటారు మీద వచ్చి వ్యవహారములు మొదలగు వానిని

చూచుకొనుచుండుసంతటి నిరాడంబర జీవులని కూడ వినియుంటిమి. వారి విశాలహృదయమును ఇంకను ప్రజ్వలింపజేయుటకు వారి ఇస్టేటునం దెంతయో అవకాశమున్నది. వ్యవసాయవృత్తిని అభివృద్ధి పెంచుటకు ప్రత్యేక వలసరాజ్యముల పద్ధతిగా గ్రామముల నేర్పాటు చేయవచ్చును. స్వంతంగా ఏర్పాటుచేయుట కష్టం లేకపోయినచో కోఆపరేటివ్ పద్ధతితో గ్రామములలో ప్రత్యేకంగా వ్యవసాయ పారిశ్రామిక అభివృద్ధిని చేకూర్చవచ్చును.

లాహోరు పట్టణమునకు 6 మైళ్లదూరములో మోడలుటౌను కోఆపరేటివ్ పద్ధతి నేర్పాటుచేసిరి. అదే మాదిరిగా యీ ఇస్టేటునందు ఎన్నియో పట్టణములను గ్రామములను నిర్మించి పనిలేని వారికిన్ని తిండిలేనివారికిన్ని దారి కనబరచవచ్చును. ఇట్టి అవకాశములున్నవి గనుక ఈపనిని సాగింప ప్రార్థితులు. విద్య వ్యాపించుటకు ప్రత్యేకంగా విద్యాశాఖను, ఆరోగ్య వైద్యసహాయములకు వైద్యశాఖను ఏర్పాటు చేసి ఏజన్సీలోని పల్లెటి గ్రామాదులవారి కెంతయు సహాయపడి తమ ఇస్టేటులోని ప్రజలందరని తమ సంతతిగా భావింతురుగాక!

—:o:—

## ప్రియుని హృదయము

కుప్పిలి జానకిరామా రావు పట్నాయకులుగారు

గీ॥ సుదతిరో! నీవు హృదయాన ముదముజెంద
నాదుమది మోదవార్ధిని నీదులాడి
పారవశ్యంబుతోడను ప్రకృతిమఱచు
నెందుచేతనోకాని నాకెఱుకపడదు॥

గీ॥ కాంతరో! నీవు మది నిసుమంతవగపు
పూనితివ, నాదు మనమెంతో గ్లానినూని
కొందలము చెందుచుండును కుందరదన
ఎందుచేతనోకాని నాకెఱుకపడదు॥

గీ॥ ముదిత! మధురసుస్మితి నీమోము దెలుప
మేలుకొనియున్న నామది యేలనోకొ-
నెమ్మదినిపొందుచుండును సమ్మదమున
నెందుచేతనోకాని నాకెఱుకపడదు॥

గీ॥ లలన! నీవొకబాధనుకలిగి నీదు
కనులనుండియు నీరము గార్తువేని
నాదుయొడలందు ముండ్లెన్నొనాటుకొనిన
కరణినుండును కారణమరయలేను॥

గీ॥ నెలత! నీయాత్మయే ప్రతినిముసమందు
నాదుహృదయానవ్యాపించి మోదమొసగు
కాని కారణమెఱుగను — నేనునీవొ!
నీవు నేనయి యుందువో? — నిజముగాను॥

# రవికలగుడ్డ

నిట్టూర్పుతో రిస్టువాచీ చూసుకొని, ముఖం చిట్లించుకుంటూ, షాపునుండి వెలుపలికివచ్చి, వీధివరండాలో ఒక్కక్షణం నిలుచున్నాడు సంజీవరావు, జేబురుమాలుతో చేతులు, మెడ తుడుచుకుంటూ. ముచ్చెమటలుపోసి, కందినట్లు ఎఱ్ఱగా ఉండెను ముఖం. పెదవులట్టే కదల్చకుండా తనలో తానేదో గొణుగుకున్నాడు, చికాకుతో.

ఆఫీసు పనిపాట్లు రోజూకంటె ఒకగంట ముందుగా ముగించుకొని, సాయంత్రం నాలుగుగంటలకే బయలుదేరాడు, యింటికి. బజారురోడ్డునవస్తూ, కోటుజేబులో పొందికగా మడతపెట్టి ఉంచుకున్న ఎఱ్ఱనిచిన్న గుడ్డపీలికనొకసారి పైకితీసి చూసుకున్నాడు, మందహాసంతో.

"నయమే. ఒకవేళ యీగుడ్డముక్క ఎక్కడైనా జారిపోయిఉంటే, నాఅజాగ్రత్తకు శాంత నన్నెంత దెప్పిపొడిచేదో?"

ఉదయం అతడు కచేరీకి బయలుదేరే ముందు భార్యయిచ్చిన పీలిక అది. "ఈ శాంపిల్ చూపించి మరీ అడగండి కొట్టువాడిని, ఆనక యేదో పనికిమాలిన బట్ట తెచ్చి నానెత్తినికొట్టక! దీనిమాదిరిగానే నున్నగా ఆరుద్రపురుగురంగులో ఉండాలి సుమండీ గుడ్డ!" అని నొక్కిచెప్పిందామె.

"సరేలే. ఆమాత్రం తెలియదనుకున్నావా నాకు? చిన్నపిల్లడికి చెప్పినట్లు బోధించి చెప్తున్నావు!" అన్నాడు సంజీవరావు నవ్వుతూ.

తాత కృష్ణమూర్తిగారు బి. ఏ. యల్. టి.,

ఇంకా శాంత యేమోచెప్పాలని అనుకుంటూ ఉండగానే మేడమెట్లు దిగినాడాయన, కచేరీ తొందరలో! గుడ్డ ఎందునిమిత్తమని కాని, ఎన్నిగజాలది కావలెననికాని ఆమె నడగడం మరచిపోయినాడు. సాయంత్రం అతడు గుడ్డకొనడానికి మొట్టమొదట బైరాన్‌షా షాపుకు వెళ్ళినప్పుడు కొట్టువాడు అడిగాడు ఆప్రశ్నలు. సంజీవరావుకు ఏం చెప్పడానికీ తోచలేదు. తటపటాయిస్తూ ఒక్కక్షణం ఊరుకున్నాడు. చివరకు ధైర్యం చేసి, "పరుపులకోసం కావాలి, యీబట్ట!" అన్నాడు గంభీరంగా.

షాపువాడామాటలువిని తనలో ముసిముసిగా నవ్వుకున్నాడు. సంజీవరావిచ్చిన శాంపిల్ ముక్కను పదేపదే తడిమిచూశాడు. పరుపులు, దిండ్లు కుట్టించుకుందుకు అట్టిబట్ట ఎవరూ ఉపయోగించరని చెప్పాలనుకున్నాడు. కాని మళ్లీ ఏమాలోచించుకున్నాడో, జబాబు చెప్పకుండా తల మాత్రం ఊపి ఊరుకున్నాడు, మర్యాదగా. వ్యాపారధర్మ ప్రకారం షాపులోఉన్న రకరకాల బట్టలన్నీ మడతలువిప్పి చూపించాడు.

'సరిగా యీశాంపిల్ గుడ్డవంటి బట్టే కావాలి నాకు. ఏమంటే, యింట్లో కొంత బట్టఉంది, యీమోస్తరుది. అదిచాలక—'

"అట్లానా? అయితే వాహబ్‌సాయిబు షాపులో విచారించండి. మావద్ద నిన్ననే

యీ స్టాక్ చెల్లిపోయింది." అన్నాడు షాపువాడు.

షాపునుండి బయటికివచ్చి టైమ్‌చూసుకున్నాడు సంజీవరావు. ఇంచుమించు నాలుగున్నర కావచ్చింది. ఆఫీసునుండి బయలుదేరి అప్పుడే అరగంట గడచిపోయిందే అని కొంచెం విసుగుకున్నాడు. పెద్దబిజినెస్ కంపెనీలో పనిచేస్తున్న తనకే యిట్టివృథాకాలయాపనం సంభవిస్తుందని అతడెన్నడూ అనుకోలేదు. కావలసిన గుడ్డముక్క కొనుక్కుందుకు పట్టుమని పదినిమిషాలు పట్టదనుకున్నాడు. ఎన్ని షాపులు తిరగవలసివచ్చినా సరేకాని, ఆగుడ్డ కొనకుండామాత్రం యింటికి వెళ్ళకూడదని మనోనిశ్చయం చేసుకున్నాడు. శూన్యహస్తాలతో యింటికివెళితే యేమంటుంది శాంత? కేళిచేసి, 'మీాబడాయి యింతేనా?"అని మొత్తిపోడవదూ?

షాపునుండి షాపుకుతిరగడం ప్రారంభించాడు సంజీవరావు. సాయిబులషాపులు, మార్వాడీషాపులు, పార్శీషాపులు, స్వదేశీ షాపులు, విదేశీషాపులు, అన్నీ గాలించాడు. ఎక్కడా లభించలేదు అతనికి కావలసినబట్ట.

అలసి రోడ్డుమీాద నిల్చున్నాడు కొంతసేపు ఏదో ఆలోచిస్తూ. తుకుచుకుంటున్న కొద్దీ చెమట అధికమవుతున్నట్లు తోచింద తనకి. ఉక్కడు, రోడ్డుధూళికి కళ్లుమండినవి. పేలుడుపట్టినట్లుగా చెమటకు చిటచిటలాడ దొడగిందితల. ధరించినది పలచనిపట్టుసూటే అయినా, ఒంటిమీాద ఎంతో భారంగా ఉన్నటు తోచింది అతనికి. కాలకుసందున చీమలు ప్రాకుతున్నట్లు అనిపించింది.

"పోనీ, రేపు ఆఫీసుకు సెలవుదినంకదా, సావకాశంగా ఉదయంపూటవచ్చి, నాలుగు కొట్లూచూసి, కొనుక్కుంటే గుడ్డ?" అనుకున్నాడు తనలో.

కాని, గడచినరాత్రి శాంతకూ తనకూ జరిగిన సంభాషణంతా అప్పుడు జ్ఞాపకము వచ్చింది.

".....మూటలవాళ్ళ దగ్గర కొనుక్కోకుంటే, నాతోచెప్తే నీకేగుడ్డలు కావలసినా తెచ్చిపెట్టనూ శాంతా? ఇళ్ళకుతెచ్చి సరుకులమ్మే వర్తకులందరూ మోసగాళ్ళని నమ్మ. రూపాయి ఖరీదైన వస్తువుకు మూడురూపాయి లడుగుతారు."

"కాని బేరంచేస్తే, మూడురూపాయల వస్తువు సహితం రూపాయికే యిస్తారుగా?" అన్నాది శాంత నవ్వుతూ.

"నీముఖంచూసి భ్రమసిపోయి యివ్వాలి, అట్లాయిస్తే!" అన్నాడు సంజీవరావు వేళాకోళానికి.

"చాలులెండి!" అని తల ఊపిందామె, అలకనవ్వులో.

పెళ్ళాన్ని మొగతాళిచేసి విసిగించి కోపం తెప్పించి బుజ్జగించడం సంజీవరావుకు సరదా. శాంతఅంటే నిజంగా నెర్రిప్రేమ అతనికి. అలిగి, మూతిముడుచుకొని, ఆలేడికళ్ళతో ఆమె తనవేపు చురచుర చూసిందంటే ఆనందంతో పొంగిపోయేవాడతను. అలకలేర్చే నెపంమీాద అప్పుడు తన మోహోద్రేకాన్ని ఎంతైనా పిచ్చిగా ప్రకటించుకో వచ్చునని కాబోలు అతనిఊహ!

శాంత పందొమ్మిదేళ్ళ జవ్వని. భర్త కంటె పదేళ్ళుచిన్న. మంచి యేపైన మనిషి. పొడుగుగా, తెల్లగా, అందంగా ఉండేది. తెలివితేటలతో కళకళలాడే తీరైన ఆమె వదనం, ప్రేమతో ప్రకాశించే ఆనవ్వుకళ్ళు, ఆరోగ్యంతోను యౌవనబలంతోను నిగనిగ మెరిసే ఆమె మెత్తనిఒళ్లు, ఆపెదవులరంగు, చెంపలనునువు, భుజాలగుండ్రన, నడుము వొంపు, అన్నీచూసుకొని మురిసిపోయే వాడు సంజీవరావు.

ప్రేమతో చెంప నిమురుతూ, నీవంటి అమాయకుల్ని టోపీవెయ్యడం వర్తకులకు సుళువు. మొన్న నువ్వు కొన్న పచ్చచీర చూశావా, ఒక్క రేవుకే రంగంతా వెలిసి పోయింది. చవకబేరమని చంకలుగుద్దుకున్నావు. పెద్దపెద్ద షాపులలో ఏవస్తువుకొన్నా యింట్లాంటి దగా ఉంటుందామరి?" అన్నాడు సంజీవరావు.

"నిజమే కావచ్చును. కాని నాకోసమని ఆషాపులన్నీ తిరిగి బట్టలు కొనితెచ్చేవాళ్లు ఎవరున్నారని?"

"నేను లేనూ?" అన్నాడాయన.

"ఔను. మీతో ఏదికావాలని చెప్పినా చప్పునే తెచ్చియిస్తారు పాపం! నేనన్నా, నా మాట అన్నా, ఎంతశ్రద్ధమీకు!" అని తల తమాషాగా ఊపిందామె, వాలుచూపులతో.

"అన్యాయం మాటలాడకు శాంతా. ఎప్పుడైనా—"

"సరేలెండి. ఎందుకొచ్చిన తగవుయిది? రేపుమీరు కచేరీకి వెళ్ళేముందు జ్ఞాపకం చేస్తానులెండి అయితే. నాకోచిన్న గుడ్డకావలసి ఉంది; తెచ్చిపెట్టండి మరి. నమూనా యిస్తానులెండి!" అన్నాది శాంత, మెల్లగా నవ్వుతూ.

....రాత్రిజరిగిన ముచ్చటలన్నీ తలపుకువచ్చి నవ్వుకున్నాడు సంజీవరావు. ఎంత ఆలస్యమైనా సరే, ఎన్నిచికాకులు పడవలసివచ్చినా సరే, శాంత కోరినగుడ్డకొని తెచ్చి, ఆమె మెప్పు పొందాలని అతని సంకల్పం. అప్పటి కప్పుడే ప్రొద్దుపోతూ ఉండెను. ఆరుగంటల తరువాత తెల్లవాళ్ళ షాపులేవీ తెరచి ఉండవుకదా అని, ముందుగా అక్కడ కనుక్కుందామని బయలుదేరాడాయన. ఖద్దరు యుగానికి వెనకటి రోజులవి!

"ఇట్లా దయచేయండి, కుడిచేతి హాలువైపు" అన్నాడొక షాపులో ఒక ముసలి నౌఖరు.

ప్రొద్దుపోకమునుపే వెలిగింపబడిన విద్యుద్దీపాలతో ఇంద్రభవనంవలె బలే రమ్యంగా ఉంది ఆషాపు. కందిరీగల ధ్వనితో ఎలెక్ట్రిక్ పంకాలు గిర్రునతిరుగుతూ, షాపులో ఉన్నవాళ్ల దుస్తులను కదల్చుచుండెను. రెండంతస్తుల దివ్యభవన మాషాపు. సరకులమ్మే ఉద్యోగస్తులందరూ గంధర్వులవంటి తెల్లజాతి యువకులును, అప్సరసలవంటి దొరసానులును.

సంజీవరావు ప్రవేశించిన హాలు అన్ని జాతుల జనముతోను క్రిక్కిరిసి యుండెను.

"అయ్యా, తమకు ఏమికావాలి?" అన్నాడొక షాపుగుమస్తా, సంజీవరావును చూసి.

సంజీవరావు చూపిన నమోనాగుడ్డ చూసి, "ఈమాదిరి గుడ్డ కావాలంటే, అదిగో ఆమె నడగండి" అని ఒక గుమస్తాను చూపినాడు.

అక్కడికి వెళితే ఆమె ఆ శాంపిల్ ముక్కను యిటూ అటూ తిరగవేసి, ముసిముసి నవ్వుతో మర్యాదగా లేదని చెప్పి, మరొక ఆడగుమస్తాను చూపింది.

"నావద్ద ముఖ్మల్ గుడ్డలు, శాటిన్లుతప్ప సిల్కులు, కాలికోలు లేవు. మేడమీదికి వెళితే దొరుకుతాయి. కాని యీ శాంపిల్ కంటె మేలైన బట్టలు చూపిస్తాను చూడండి, ఎరుపురంగులోనే" అన్నాదామె పెంకె చూపులతో.

రకరకాల గుడ్డలు టేబిలుమీద పరచి చూపింది, అతనికి. ఆమెను, గుడ్డల్ని చూస్తూ షాపుగంటవరకూ అక్కడే నిల్చున్నాడు సంజీవరావు. ఏమీ కొనకుంటే బాగుండదు కదా అని తలచో, లేక ఆమె ఓరచూపులకు ముద్దుమాటలకు భ్రమసిపోయో, ఆరు గజాల ముఖ్మల్ గుడ్డ, ఏడు గజాల శాటిన్ బట్ట కొన్నాడు.

పిమ్మట మేడమీదికి వెళ్లి అడిగినాడు తనకు కావలసిన గుడ్డనుగూర్చి. హాలునుండి హాలుకు, ఆడగుమస్తావద్దనుండి మగగుమస్తావద్దకు, మగగుమస్తావద్దనుండి ఆడగుమస్తావద్దకు తిరుగుతూ మేడ యావత్తూ గాలించాడు కాని, ఏమీ లాభం లేకపోయింది.

అతడు చూపిన శాంపిల్ గుడ్డను పరీక్షిస్తూ ఒక గుమాస్తా, "ఇది టర్కీ ఎరుపు. నూలుబట్టలలో యీరంగు మావద్ద ప్రస్తుతం లేదు. పట్టులోను, ఉన్నిలోను మీ చిత్తంవచ్చిన రంగులు సప్లయి చెయ్యగలం. దయచేసి ఒకటి రెండు రకాలు చిత్తగించండి" అంటూ మృదువైన మాటలతో మెప్పించి, రెండు మూడు రకాల గుడ్డలతనిచేత కొనిపించగలిగినాడు.

గాజులబేరానికని సంతకువెళ్లి తుదకు గాడిదను కొని తెచ్చుకున్నట్లు సంజీవరావు ఇంగ్లీషుషాపులన్నీ తిరిగి తనకు కావలసిన గుడ్డకాక, ఏవేవో బట్టలు చాలా కొన్నాడు అనవసరంగా. భార్య యిచ్చిన శాంపిల్ వంటిబట్ట యింకే షాపులలోనైనా దొరుకుతుందేమో అని, చిన్నవి పెద్దవి ఇండియన్ షాపులు అన్నీ వెదికినాడు. తుదకు కన్నయ్యశెట్టి షాపులో కాజాలు ఎన్నో గుడ్డలు తీయించి పరీక్షించగా, తన శాంపిల్ కు యించుమించుగా సరిపోయిన ఎర్రరంగుగుడ్డ ఒకటి కనిపించింది.

"ఇది తీయించండి సామీ, మంచి పక్కారంగు. కుంకం ఎరుపులో యింతకంటె మేలైన రంగు మరిదొరకదు. బట్ట

చూసేరా, ఎంత నాజూకుగా ఉందో? ధర జాస్తీ అని సంకోచించకండి!" అన్నాడు షాపుగుమాస్తా.

ఆ గుడ్డకూడా కొంతకొని పైకం చెల్లించాడు సంజీవరావు. అప్పటికే ఆరు గంటలు దాటింది కనుక, యింకా బజారులో తిరగడానికి ఓపికలేక వెంటనే జట్కామీద యిల్లు చేరుకున్నాడు.

మగడు తెచ్చిన బంగీలన్నీ చూసి ఆశ్చర్యంతో, "ఏమిటీ పొట్లాలన్నీ?" అన్నాది శాంత.

"నీకోసమే. విప్పిచూసుకో, నచ్చుతాయో లేదో" అన్నాడు సంజీవరావు, దుస్తులు విప్పుకుందుకు తన గదిలోకి వెళ్లిపోతూ.

కాగితాలలో పొందికగా మడతపెట్టి ఉన్న రంగురంగులవీ, రకరకాలవీ గుడ్డలన్నీ చూసి బ్రహ్మానందభరితురాలయింది శాంత. ఖరీదైన మంచి మంచి గుడ్డలవి. నచ్చనిదేదీ కానరాలే దామెకు. అన్నీ బాగున్నాయి! కాని, వాటిలో తానిచ్చిన నమోనా మోస్తరు బట్ట మాత్రం ఆమెకు కనిపించలేదు. అందుచేత ఆమె తనలో మెల్లగా నవ్వుకున్నది. ఒకరింటికి పసుపుకుంకానికి వెళ్లవలసి ఉండి, ఒక గజమున్నర రవికలగుడ్డ కావలసివచ్చింది, ఆమెకు. తెచ్చిపెడతానన్నాడు కదా అని భర్త చేతి కిచ్చింది ఒక శాంపిల్ గుడ్డముక్క. ఆయన తెచ్చినవి అవి!

రాత్రి భోజనాలప్పుడు కాని మళ్లీ ఆ ప్రస్తావన యెత్తలేదు శాంత. అప్పుడు సావకాశంగా ప్రశ్నించింది భర్తను, అతడు తెచ్చిన గుడ్డలనుగూర్చి. ఏయే షాపులు తిరిగినాడో, ఎట్లా ఎట్లా బేరాలుచేసినాడో, ఏయేబట్ట ఎందునిమిత్తం ఎన్ని గజాలది కొన్నాడో, మొత్తం ఎంత డబ్బు వ్యయమయిందో, అన్నీ నిలువదీసి అడిగింది అతనిని. పూసగ్రుచ్చినట్లతను పడిన అవస్తలన్నీ చెప్పాడు సంజీవరావు. ఇద్దరూ ఉప్పెనగా నవ్వుకున్నారు.

"అయితే గజంన్నర గుడ్డకోసం రెండున్నర గంటలసేపు షాపులన్నీ తిరిగి, తుదకు—" అని శాంత నవ్వుతో పూర్తి చేసింది మిగిలిన వాక్యం.

"నువ్విచ్చిన శాంపిల్ గుడ్డ యింతచేసింది! పోనీ, రెండు మూడు శాంపిల్సు అయినా యిచ్చి ఉంటే..........?"

"అవును లెండి. వివరంగా చెప్పకపోవడం నాదే తప్పు! కాని నిజంగా నే నిచ్చిన నమోనాకంటె మీరు తెచ్చిన గుడ్డలు వెయ్యిరెట్లు బాగున్నాయి. ఈమాటు నాకే బట్టలు కావలసివచ్చినా, నా అంతట నేను చూసుకొని కొనుక్కున్నకన్న, మీచేత తెప్పించుకుంటేనే నాకు లాభం! ఒకచీర కావాలని చెప్తే, పది చీరలు వస్తాయి! కదూ?" అన్నాది శాంత ఉత్సాహంతో.

"నీ పుణ్యముంటుంది. ఈసారి మాత్రం నాకు పురమాయించకు యిట్టి బేరాలు. నీకేవి కావలసివచ్చినా నువ్వే చూసుకొని కొనుక్కోవాలి" అన్నాడు సంజీవరావు నవ్వుతూ.

# గ్రహస్థితి బాగు లేదు

శ్రీమతి ఆదంట సత్యవతమ్మగారు

వాఁడు పుట్టిన వేళావిశేషమని, గ్రహస్థితని, మనుజున కన్వయించేలాగనుకునేవారు. ఇప్పుడో యేకముగా దేశానికే గ్రహస్థితి బాగులేదు.

"పూర్వము పండుగ లొచ్చాయంటే, తత్పూర్వము పదిహేను రోజులనుండియే గోడపూతలు, అలుకులు, ముగ్గులు, వెల్లలు, గడపలకు పసుపుకుంకుమలు, మొదలగు వాటితో, ఊపిరి సలుపకుండా కొట్టుకు పోయేవారు. ఆపైన కూతు రల్లురను తీసుకురావటం, ముప్పొద్దు పిండివంటలతో నిఁక వంటశాలే గతైయేది. ఇంక స్త్రీలకు తమ శరీరాలంకరణములకు తీరికే లేదు.

"ఇప్పుడో మింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనెలని తినుటకే చాలని స్థితిలో హూణవిద్యా ఫలిత నవనాగరికత యొకటి వచ్చిపడినది. దానితో కలిమి లేములు సమమై, స్త్రీలకు బద్ధకము బలిసి, సులభోపాయాలతో దినచర్య గడచిపోవుచున్నది. గచ్చిండ్లగుటచే దాసిది కడిగి ముగ్గు వేసేను. పండుగనాడింత వీధిగడపకు మాత్రం పసుపురాసి చిగారు కొట్టుటతో సరిపోవును. పూజా నమస్కారములు నివేదన యక్కరలేదుకదా! ఆవేళ కింత వండుకొని తినుటతో పండుగ సమాప్తమగును" అంది సుశీల భర్తతో.

"అగును. ఇల్లలుకగానే పండుగగునా? చేతిలో పైసాయుంటేకదా పండుగ లక్షణములు పూర్తియగుట. నానాకష్టములుపడి పగలెల్ల శ్రమఁజెంది కష్టమో నిష్టూర్యమో పొంది నాల్గురూకలు సంపాదించి తెస్తే ఈవాళ దసరాఅని, రేపు దీపావళని అల్లుని తీసుకురావాలని అమ్మాయికి చీరలని, అబ్బాయికి బాణసంచాలని లిస్టు తయారుచేస్తావు. మురిసి మురిసి ముచ్చటలని అచ్చటలని అమ్మాయికి పదోయేట ముడిపెట్టించినావుకదా? మూడుముగ్గులు, ఆరుముళ్లు దానికాపురము. అల్లుఁడు తాడిచెట్టు మొవ్వలో దూరాఁడు. పిల్లని పంపరు. మనలను రానీయరు. మాడనీయరు. దాని పెండ్లికి చేసిన అప్పింతవఱకు తీరలేదు. భూములు పుట్రలు వెళ్ళాయి. పరిస్థితులు చల్లపడ్డాయి. పిల్లబాధలు వినలేక తీసుకువద్దామా అంటే మనమే కాపురము తీసివేయుటచే భరణమేనా యుండదు. ఎల్లకాలము దానిని పోషించే శక్తి మనకులేదు. వెనవభరణము దాని బట్టకేచాలదు. అందుకనే ఎవరి పొట్ట వారు పోషించుకునేలాగున స్త్రీపురుషులకు కూడా సమాన విద్యాభ్యాసముండాలని నామతము" అన్నారు పురుషోత్తమరావుగారు భార్యతో.

"అందుకనే కాదూ అబ్బాయిలతోపాటు చిన్నమ్మాయిని చదివిస్తున్నారు. బాగానే యుండికాని ఆవిడ చదువేమిటో కాని, ఒకటే నీతివిషయక పుస్తకమే లేదు. స్త్రీలకవలయు పాకశాస్త్రము, శిశుపోషణవిధానము, గృహనీతి అసలే చెప్పుటలేదు. చదువు తక్కువ షోకులెక్కువ కనబడుచున్నవి. సినీమాలు వచ్చింది మొదలు ఆనటుల యిమిటేషన్లుగా మారారు. ఆనడకలు, ఆచూపులు, ఆషోకులు, సూదులు, రిబ్బన్లు, సబ్బులు, సెంట్లు, పువ్వులు, వదులుజడలు, కాలిజోళ్ళు వీటిఖర్చులు జీతాలని మించుచున్నవి. ఇట్లుగా పడమటిగాలి ప్రభావమున సంసారాలు చితికిన తాటాకు గొడుగుఁవలె ఉన్నవి."

"పెద్దమ్మాయి కష్టము తలకించిరో, తనువు లశాశ్వతములు. మన మెల్లకాలముండు టసంభవము. కాన, బిడ్డల కింత విద్యాధనమిచ్చి, జీవనోపాధికి దారి చూపించ నుద్దేశించిరో, తనయులతోపాటే చిన్న తనయను చదివింపఁ దలంచితిని. బాల్యవివాహము వలన కలుగు నష్టము లనేకములు మనము చూచుచున్నాము. మన యనుకూలముఁ జూచుకొని, యస్వతంత్రులుగా బిడ్డలనుఁజేసి, చేసిన వివాహముల వలన వా రాజన్మాంతము దుఃఖపడవలసివచ్చును. చివరకు సెట్టి సాహసము వా రొనరించినను, పెద్దలు వారినే దూషించెదరు కదా?"

"అయితే, అమ్మాయికి పెద్దవయస్సు వచ్చాక మన మాట వింటుందా? "కన్యా వరయితే రూపం" అన్నట్లుగా, కులశీలము లాలోచించక రూపముగ్ధ

రాలై ప్రణయమోహావేశమున నే యవగుణమునో వరించి భ్రష్టనని విచారించుచున్నాను.

"అప్పటికిప్పుడు వెఱ్ఱిమోహమునఁబడి యాడిన పెండ్లిండ్లకు రానురాను గుణగణములు బయల్పడి, పడజాలక విడాకులకొఱకు వేలం వెఱ్ఱిగా యేడుస్తున్నారు. అట్టిదేమంత స్థిరకాపురము! 'ఏవేళకే కోపమువచ్చి పెండ్లి రద్దుచేసుకొనునో, నాది, నా కాపురమనని యనుకొనుటకే యవకాశములే'దని మగనిగోల."

"సుశీలా, నీవన్నది బాగున్నది. బిడ్డలకు విద్య చెప్పించినా, అతిస్వతంత్రులఁజేయుదు. తగిన కట్టుదిట్టములతో, మనము మెలకువవహించి జాగ్రత్త బుచ్చుకొనిన, నీవన్న యిబ్బందులుండవు. మన శీల కచ్చముగా హూణవిద్యాసంపర్కమే నే నిచ్చుచుంటినా? ఇంట, భక్తి నీతుల బోధించు పురాణాదికములను కుట్టుపనిని సంగీతవిద్యను నేర్పించుచుంటిని కదా? వంటచేతకాక మగనీసురాలగునన్న భయమున నే, కాఫీ, ఫలహారము లమ్మాయిచేత నే ముచ్చికగా బోధించి చేయించుచుంటిని. జాతీయ ధర్మములను మఱువకుండ భక్తిభావహృదయయగుటకే వారముభజన లేర్పరచితిని. ఇన్నియు, నా మె భావిశుభమునకే. పండ్రెండు సంవత్సరములు నిండినవికదా? ఇఁక రెండు సంవత్సరములకు నేఁదలఁచిన (మెట్రిక్యులేషన్) ప్యాసవును. తదుపరి అనుకూల వరునిఁజూచి వివాహ మొనరింతము. శారదాగారి ధర్మమున కొంపలుఁగూల్చు వరశుల్కము లంతరించును. విద్యాజ్ఞానకుటుంబములు వియ్యమందిన, అనవసర ముచ్చటలు ఆడంబరఖర్చు లంతమొంది, అంతన్న బొంతన్నగార్ల అలుకలు మాసిపోయి, యుచిత వేడుకఖర్చులతో, నుల్లాసవియ్యము లేర్పడునని నా నమ్మకము" అని పురుషోత్తమరావుగారు భార్యను చూచి నవ్విరి.

సుశీల చిరునగవుతో, "మహానుభావుఁడగు గాంధి మహాత్ముని ధర్మమాయని ఖద్దరుగౌరవ మొచ్చినప్పటినుండియు అల్లుండ్ర భాగ్యవిశేషములతో పనిలేకుండ ఖద్దరువస్త్ర బహుమానములతో, బీదకుటుంబీకునికి నీచతలేకుండ గౌరవము దక్కుతూంది. ఖద్దరు వృద్ధిపొంది లోకానికందుబాటుగా సరసమైన ధరకు కొనుక్కొని, జాతీయతఁ గాపాడుకోవాలనిన పదిమందీ పూనుకొనవలెను. సోమరులను, కంటిగ్రుడ్డిగాఁక అసయకపూర్తిగలిగి, భిక్షాటనవృత్తి నవలంబించువారిని ధనవంతులు ఉదారచిత్తులై పెట్టుబడిపెట్టి, రాట్నము లేర్పరచి, దారము తీయించిన పొట్టకు, బట్టకు పరుల యాచించు బ్రతుకు తప్పును. బట్టవిరివితో డబ్బు చౌకగును కాదా? ఏమనెదరు?" అంది.

"అంతా డబ్బుతో ఉంది. ప్రభుత్వపుపన్ను లెక్కువ. పంటాదాయము తక్కువ. యజమానిజీతము తక్కువ, బిడ్డల విద్యాజీతము లెక్కువ. బంగారము విలువ హెచ్చగుటతో, డబ్బెక్కువ వచ్చునను గుడ్డినమ్మకముతో, ఇంట చిన్న మెత్తు బంగారము లేకుండ అమ్ముకుని కాగితములతో సంతోసించుచున్నారు ప్రజలు. కూరకు కానీ లేకపోయినా, కాఫీహోటల్సు. సినిమాలు, నాటకములకు కొదువలేదు. అంతా హిందువులమేయన్న ఐకమత్యాభిమానము లేక కులభేదములతో కొట్టుకుంటున్నాము. లోకవార్తలు తెల్పు పత్రికలు, యితర దేశములం దున్నంత విరివిగా ప్రచారములేకుండుటకీ ధనాభావమే కారణము. ఆంధ్రుల కాంధ్రభాషలో వ్యాసము వ్రాసి, ఉపన్యసించుటచేత కాదు. పైగా నామర్దా. హిందూధర్మము లిప్పటి నాగరికాగ్రేసరుల మధ్య నలుగుచు త్రిశంకుస్వర్గములాగున్నవి. అబ్బాయిలు, అమ్మాయి వచ్చేవేళయింది. లే" అన్నారు గృహస్థు.

ఇంతలో బిలబిల బడులనుండి పిల్లలొచ్చి, "అమ్మా! దీపావళికి నా కేమిస్తావని" యొకరు, ఆకలేస్తుం దేమైన పెట్టుమని యొకరు అంటూ తలిదండ్రుల చుట్టుకున్నారు. అందరిని అన్నివిధముల సముదాయించి శీలతోను, ఎడబిడ్డతోను వ్యాయామ మొనరించ పురుషోత్తమరావుగారు లేచిరి.

ఒడిబిడ్డకు పాలొసగి, ఊయెలలో నిదురబుచ్చి ఆకలగు బిడ్డల కాహారము పెట్టుటకు వంటశాల ప్రవేశించిన దా సుశీలాసతి.

# ఆంధ్రలక్ష్మి

శ్రీమతి కుడితిపూడి అచ్చమాంబగారు

శత్రువులజెండాడి చాకచక్యమున రాజ్యమ్ముపాలించె. రుద్రమ్మతల్లి
భర్తనుదీవించి పౌరుషోద్రేకాల సమరంబుకంపె మాంచాలబాల
ప్రాణముల్ తృణముగాభావించి అగ్నికర్పణముగావించె మల్లమ్మరాణి
చివ్వనుండి పఱతెంచిననాథు శూలంబుగాపల్కె ఖడ్గతిక్కన్నభార్య

అసువులాసింపక రిపులకసరికొట్టి
స్వీయరాజ్యమానాలు రక్షించుకొనిరి
ఇట్టినారీమణులతో రహించుచున్న
ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి! జోహారులివిగో॥

తన్మయత్వము నచేతనములకు జనింపజేసెగదా రామదాసుభక్తి
పట్టిమ్రాకులు చిగిర్పగజేసె మకరందధార పోతనకవితానురక్తి
పర్వతంబులు వడవడలాడగాజేసె ఝాన్సిలక్ష్మిబాయిశౌర్యశక్తి
బ్రహ్మాండమెల్ల గిరగిరాదిరుగజేసె నాయకురాలిమంత్రాంగయుక్తి

విశ్వమున నిట్టివారిని వ్రేలుమడిచి
పరిగణింపగ దగినట్టి వారుగలరె;
అహాహ! నీప్రాభవము కొనియాడదరమె
ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి! జోహారులివిగో॥

నీ రమణీయయశోరేఖ లూర్మిఘోషలనుగానించు కృష్ణాస్రవంతి
నీప్రాభవమును మహాప్రవాహముగ పారించును గోదావరీస్రవంతి
నీ పూర్వవిభవంపురూపు కన్నులకట్టచిత్రించె నాంధ్రులశిల్పగరిమ
నీతెలుగుదనము నిగ్గుదేరంగ ప్రత్యక్షమా విశ్వవిద్యాలయంబు

చేవబారిన శౌర్యంబుజీవగడ్డ
పారమెరుగని ధాన్యంపు పైడిపుడమి
బిడ్డలను కడుపారగా బెంచుతల్లి
ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి! జోహారులివిగో॥

# ఉదయిని

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం. ఏ; బి. యల్.

తూరుపున చిమురు కెంపురాగము ఉదయిని హృదియందలి అనురాగము. ఉదయిని స్తన్యమును గ్రోలి సమధిక తేజమంది, తన శక్తి శౌర్యములచే దివము, దిగ్దంతులకు మిఱుమిట్లు గొలుపును. మధ్యందినమార్తాండుని అద్భుతప్రతాపము ఉదయిని కనికరంపు కవుంగిలియందు పెఱిగి పెంపొందిన అరుణకాంతి. పవలందుఁ దోఁచు చిత్రదృశ్యములును, మహితసంఘటనములును ప్రభాతపురంధ్రి ఉత్సాహప్రోత్సాహములందే పుట్టును.

ఉదయిని ప్రేమ స్త్రీహృదయము. స్త్రీహృదయము యీశ్వరునిపీఠము. అంతరంగస్థ దివ్యసింహాసనమును గుఱుతించుటకే సుందరసువర్ణాలంకృత సింహాసనమును గృహలక్ష్మి తన పూజాగృహమం దిడికొనును. స్త్రీ అలంకారములను కాంక్షించును. లోనలంకారములు లేని వ్యక్తి అవ్వలివగల నెఱుఁగనే యెఱుఁగదు. వస్తుభావము వలననే వస్తువు గుర్తింపఁబడును. కవి మాటలందు కాంతులు నగల మాటయెవ్వరిది? కవి హృదయమున నృత్తగీతములఁ దేలు భావసుందరి దాలుచు భూషలు కావా? మంచుమంచిముత్తెములందు ఆత్మహృదయమును కాంచి ఉదయిని యుప్పొంగునట్లు, ప్రభాకలితములగు తన రచనలందు అలంకార సంశోభితమైన నిజహృదిని విలోకించి కవీంద్రుఁడు ముదితచిత్తుఁడు కాఁడా?

ఉద్బోధనమునకు అలంకారము ప్రధానము. ఉన్నదున్నట్లు మోటురీతి నేకరువుపెట్టు శ్రోత్రియ రూపులకు చెవియొగ్గువా రెందరుందురు? చిత్రమును అలంకారమును పుట్టువుతోడనే మానవమానసము దాలుచు కవచకుండలములు. ఇంపుసొంపులను, సొగసుసొబగులను ఎఱుఁగని భౌతికశాస్త్రము మేధాపటుత్వమున వృద్ధినందినవారికే గ్రాహ్యమగును గాని, సామాన్యులకును బాలకులకును గాదు. కావుననే తల్లియుఁ గవియు నలంకారములందు నింపియే తమ బోధనలను చదువరుల కందించెదరు.—

రామమోహనుని తత్త్వామృతమును గ్రోలిన వృద్ధ కవీంద్రుఁడు విగ్రహారాధనయేల పుష్పపూజయేల యనును. కవి గాని రవి యిట్లనవచ్చును. కవిరైన రవి యిట్లనినచో, అతఁడు అనృతవాది యనిపించుకొనును. రవికవిపల్కులు సుందరమూర్తులతోను, సుగంధసుమములతోడను శోభిలు విచిత్ర దేవాలయములు. విగ్రహముగల మాటను గాని, అలంకారముగల అక్షరమును గాని ఉపయోగించుట నిర్గుణోపాసకుఁడైన బ్రహ్మసమాజికునకు తగదనియు, మల్లెబట్టను బోలి సుద్దముక్క తెనయైన సుమువులనే ఉపయోగింపక తప్పదనియు రవి కవిని నిర్బంధించితిమేని, అతఁడు తనకలము విఱుచుకొని, కన్నీటి కాల్వలందు లోఁగల కవితను పిండివైచి, తాను వట్టి యెమ్ముల ప్రోవైన నగును. లేకున్న దేవేంద్రనాథుని తనయుఁ డయ్యు తాను సగుణోపాసకుఁడైన హిందువునని యొప్పుకొనినను, నొప్పుకొనును. గీతల నంజలి నిడికొనుట, అలంకారములను చేఁబూనుట కాదా? ఉదయినీ హృదిఁగల రవికవి మరీచికాలంకారములను వలదనిన, దాను రవికవి కానని తెలుపుకొనుట కాదా? ఉదయింపనివాఁడు రవి యెట్లగును? రవి ఉదయిని కావుననే జ్ఞానమయూఖలను దశదిశలందుఁ జిమ్ముఁగలిఁగెను.

సౌందర్యమును, కాంతియు, చల్లదనమును, ఆనందమును ఉదయినియందు శోభిలుచుండు ననిన, నవికైతనెలంతయందుఁ, కన్నతల్లి యందును గూఢ రాజిలుచుండునని వర్ణించుట కాదా? కవితామతల్లి, కన్నతల్లులు, ఉపాధ్యాయినులు, గంభీర భావములును, ఉన్నతాశయములును ఉదయిని అంకసీమయందే పెంపారును. మహితభావములును, మహత్తర జీవనములును కవిత్వమై కాలవిహాయసమున వెలుగొందును. ప్రతి మహావ్యక్తియు కవిత్వఖనియని నా యభిప్రాయము. రామకృష్ణులు కవులు కాకున్న వాల్మీకి వ్యాసుల హృదయముల నెట్లాకర్షింపఁగలరు? ప్రకృతిని చూచి కవియేల ఉప్పొంగును? ప్రకృతి యందలి భావ భాగ్యము, కవిభాగ్య మగుటవలన గాదా? మహితాశయ విలసిత జీవనములుకూడ కవి నలరించుటకు కారణ మవి కవికాంక్షించు ఐశ్వర్యమున కాంతులు మంట కాదా? భగవతి సీత, ఇట్టి విభూ-

ఇతో వరలి రామాయణమును హృద్యమైన పద్యము గావించివైచెను. వాల్మీకి కలమున కెంతో తేజ మొసఁగెను. పాదాంగుష్ఠమందలి చుట్టును మాత్రము గుర్తు పట్టఁగలుఁగు సౌమిత్రి సీతనగలను జూచి, మొఱకువలె నిలిచెననిన కవి రెండు మాటలం దెంత భావము నిమిడ్చినాడు! లక్ష్మణునట్లు నిలిపి, అశ్రుసంసిక్తములైన నగలమూట నెదుటఁబెట్టి, ఘోరాపదకాదంబినిఁ దలపై మోపి, పృథ్వి నొక చేతితో కదపివైచి,—సన్నిహితబంధువుఁడైనను ఒక యాడుదానియెడల వర్తించు రీతిని,—స్త్రీపూజ యందలి గభీరతత్వమును రెండవచేతితోఁ గుడుపఁ బెట్టి ఒకపరి పాఠకుని విషాదమున ముంచిన వాల్మీకి, తోడనే అతని నానందమునఁ దేలింపలేదా? ఉన్నతాశయములను చిత్రింపని సారస్వతము సారస్వతమే కాదు. మహితగుణపూరితమంజూషము కాని కవిత్వము కవిత్వమే కాదు. ఉన్నతాశయములను, గంభీరభావములను, సుందరసారస్వతమును, మధురకవనమును గనిపెంచునది హృదయముకాని మేధస్సు కాదు.

హిమాచలము పగిది మేధస్సుకంటె, రత్నాకరముబోలు హృదయమే మహత్తరమైనది. గగనచుంబి మేధస్సున నిలువ నరుఁడు గుబాలున లోఁతులోయలోఁబడి నరకజ్వాలలను నాల్కపై రాచుకొనినను రాచుకొనును. గభీరరత్నాకరమందు మునుఁగు నాతఁడు చిరవిరాజితమైన శాంతిని గని, తేజోవంతములైన భావరాసులను దోసిళ్ల కొలఁది పడయఁగలడు. హృదయైశ్వర్యమున స్త్రీకి పురుషుఁడు చాలడు. రాగమాలికయగు స్త్రీ హృదినుండియే,—స్త్రీ హృదిఁగల వ్యక్తినుండియే గుణగణములును, కవితాకళలును నుదయించును.

ఉదయద్యుతులే శైశవహృత్పటమున చిత్రవిచిత్ర రీతులఁ జిత్రింపఁబడు తలఁపులై, కాలక్రమమున స్వర్ణాక్షరములై, జీవితచారిత్రములగును. జనయిత్రీ హృదయమే దుగ్ధధారలనుండియు, ప్రబోధధారలనుండియు దిగి శివాజీయందు ప్రవేశించెను. తల్లి శిక్షణమున తనరినపుడే నెపోలియను తన భావిభాగ్యమును కాంచఁగలిఁగెను! సద్గుణచ్ఛటాసముద్భాసితమైన కన్నతల్లియెడదను పుడికినవాఁడే గాంధి, భావసూర్యప్రభాకలితమైన తన భావిజీవనమును కనులారఁ గాంచఁగలిఁగెను!! ఉదయిని హృదయనభమునఁ దోఁచినవాఁడే రవీంద్రుఁడు కవీంద్రుఁ డాయెను!!! భాస్వంతమైన ఆశయములును, మహత్తరములైన జీవనచారిత్రములును, కనదురుభావములనీను కవిత్వములును, మిహిరతేజమును చిమ్ము సాహిత్యములును, సుధామాధుర్యమును చిల్కు గీతములును, మానవసముద్ధరణమునకు దినమణియొసఁగు ఆనందోత్సాహములును ఉదయిని హృదినుండియే కదా ఉప్పొంగును!

---

## పల్లెపిల్ల

గవను వేంకటకృష్ణయ్య చౌదరిగారు

(గోంగూరకోత)

చిన్నివెన్నెలకందు జిగిపొందఁ బగనొందు మొగమందు హాసముల్ మోసులెత్త
దండిచనుంగొండదండ పూదండ నెత్తావిమొత్తంబు వ్యాప్తంబుగాఁగ
తులలేనివిలుబూను వలజేని తూపుచూపులగముల్ గ్రిగంటఁబొలిపాఱ
బింబంబు డంబంబు పెంపేదఁజేసెడి పెదవులన్ వెడపాట వీడుకొనఁగ

తడవు చాలంగఁబోదను తత్తరాన
జిలుగుపయ్యెదలోనికి జిట్టిచేత
గోఁగుఁగూరఁగోసికొనంగ గ్రుమ్మరు పొల
మెల్ల నడబెడంగులను మాపల్లెపిల్ల॥

## మా ము లా టి న్

బర్మా నారీసమితియందు మిగులవిఖ్యాతి గాంచిన యువతీమణులలో మామూలాటిన్ అమ్మగారొకరు. ఈ సోదరీరత్నము బర్మా సీమయందుండు గ్రామాదులలో స్త్రీవిద్య విరివిగా వ్యాపింప జేయుటకు యువతీసంఘములను స్థాపించినది. ఈడుముదిరిన కాంతామణులకు గృహనిర్వహణము, ఆరోగ్య శాస్త్రము, గర్భిణీనియమములు, శిశుపోషణము, దాత్రీపరిచర్య విధానములు, గృహము నందు రోగికిచేయవలసిన సామాన్యచికిత్సలు, గృహావరణమందుండు జంతుజాలముల పోషించువిధానములు, పాకశాస్త్రవిషయ చర్చలు, సంగీతజ్ఞానము, నృత్యనాట్యశాస్త్ర జ్ఞానము, సూచీవానలేఖాకృతచిత్రఅలంకార అల్లికవిధానములు, చేతిపనుల విశేషములు మున్నగు యంశములగూర్చి మాతా సంఘములందు నేర్పించెను. వనితామణులను ముఖాచారములనుండి ప్రస్థుతస్థితికి దెచ్చుటకు నెంతోయోపికతోను పట్టుదలతోను కృషిసల్పి నారీమణుల మన్ననలకు పాత్రురాలైనది.

ఇంకను ఈవిదుషీరత్నము వేయిజనములుగల గ్రామములలో యావశ్యకముగాను నిర్బంధముగాను ప్రసవాలయముల స్థానిక సంస్థలవారు నెలకొల్పవలయునని తీవ్రమగు ప్రయత్నములను యువతీసమాజముల మూలమున చేయుచున్నది.

సౌందర్యపోషణ గూర్చి యీవిద్యావతి చేయుచుండు విధానములుమిగుల యమూల్యములైనవి. ఈమెకు రమారమి నలువది వత్సరముల వయస్సైనను యిప్పటికిని యీామె శిరోజములు నెరయుట కనబడదు.

ముఖసౌందర్యములేని స్త్రీజన్మ జన్మ గాదని పలువిధములైన యుదాహరణములతో తెలుపుచున్నది. మానవతులు రూపరేఖావిలాసములవల్ల పురుషుల నాకర్షించు నటుల యలంకరించుకొనుట యుక్తధర్మము. సకలావయవములలోను నేత్రములు ప్రధానమైనవి. దానంజేసి అంగనామణులెల్లరును నేత్రముల యావశ్యకతను, శ్రేష్ఠతను నెఱిగి శుచిగాను, నిర్మలముగాను, కాంతివంతముగాను, పసందుగాను, భద్రముగాను, ఆకర్షనీయముగాను, మనోజ్ఞముగాను, చూచుటకింపుగానుండు శృంగారపు చూపులనీనెడి నీలాలవంటి నిగనిగలాడెడు విధానముల నరిసియుంచుట యెంతయు బాగుకదా! సుకుమారమగు అవయవములుగల యబల సౌందర్యపోషణ విధానముల నెఱింగి యుండిన, నెల్లప్పటికిని తేజస్సును కీర్తిని గలిగి మానవలోకమును రాణింపజేయుశక్తి గలిగి యుండగలదని ఆవిదుషీమణియొక్క ముఖ్యనమ్మకము.

సుందరమును, కోమలమును, సుకుమారమునుగల యువతులపాదము లెంత మృదువుగా మెత్తగానుండునో యోచింపుడు! అట్టివారు గులకరాతియందును తారుగల రస్తాలయందును, దవాగ్నికాలవాలమగు యెండ

యందును, కటికముండ్ల పొదలయందును పాదరక్షలులేక పోవుట అంతగా సమంజసము కాదు. మన మాతృమండలమున పాదరక్షణాచారములు కేవలము దూష్యముగా నెంచబడుచున్నది. కారణములేవో గ్రాహ్యము గాకున్నది. ఈయమ్మగారు పురుషులకంటే స్త్రీలే యత్యవసరముగాను, నిర్బంధముగాను మెత్తని తేలికగల కాలిజోళ్ళను యుష్ణప్రదేశీయులు వాడుట యవసరమని మేలుకొలుపుచున్నది. కంటికిజోడును కాలికి జోడును వేసికొనుట దూష్యముగాని పాపము గాని యిసుమంతయు లేదని పల్కుచున్నది.

ఇకనైనను నారీమణులు పిచ్చినమ్మకములు, నెత్తితలంపులు, యత్యాచార నిబంధనలు వదలి, కాల దేశవర్తమానముల ననుసరించి మేలుకొమ్మని హెచ్చరించుచున్నది. ఈ పుణ్యమాత పాఠశాల ఉపాధ్యాయినిగా యుండెడుకాలమున మురికియందు మూలుగుచున్న నీచజాతులను ఆదరించి దేహారోగ్య విధానములనేర్పి నవనాగరీకులుగాను సుందరరూపులుగాను జేయుచుండెను. ఈమె యిప్పుడు దయామయుడగు దివ్య మంగళ చిన్మయస్వరూపుడగు పరంధాముని సుస్థిర మదితో సేవించుచున్నది.



# గృహమేధికి

శ్రీపాద వేంకటావధానిగారు

ఏకరణి సీతనూజు డహీనభక్తి
పూతమతి మాతృదేవిని పూజసేయు
నట్టిభక్తితో నినుగూడ ననుదినంబు
సద్గృహీ! తన్వుగావుతశ్రద్ధతోడ॥

నీవునట్టులె ప్రవిమలనియతబుద్ధి
బుజ్జగింపు తనూభవు, నొజ్జవగుచు
శిష్టశిక్షణమొసగి సుశ్రేయమొసరు
నటులవర్తింపు మేప్రొద్దు ననఘచరిత॥

సాధ్వి నాథుని సంతోషసాగరమునc
దేల్ప గృహలక్ష్మి మెలగెడు తీరు గనుచు
పతియు నిర్మలప్రణయభావంబుతోడ
నుచితగతి నామెc దనియింపుచుండవలయు॥

నీసుతుల్ ద్వేషపూరితనీచబుద్ధిc
దామతమలోనc దగవులcదగులకూడ
సతము సౌభ్రాత్రసౌఖ్యంబు సాదరముగ
గోరుచునునీకు ప్రమదంబుగూర్త్రిగాత॥

అటులె సుతలును అన్యోన్యమధికప్రేమ
సోదరులతోడచదువు చత్వాదరమున
మాతృదేశానురాగ సంపన్నలగుచు
నున్నతసతీత్వమును చాటుచుండ్రుగాత॥

సత్యసంపద, శౌచము సహనగుణము
చిత్తశుద్ధియు నోర్మి సచ్ఛీలతయును
పొంది భవదీయ పుత్రికాపుత్రులెపుడు
నెదప్రమోదంబునీకు గూర్చెదరుగాత॥



శ్రీమతి మా మా లేటిన్ గారు

# పశ్చాత్తాపము

కొమఱ్ఱాజు వినాయకరావుగారు

పరిచయము

[ఇదొక విషాదప్రేమైక గాథ! ఒక యౌవనబ్రహ్మచారి ఒకమనోజ్ఞ పర్వతారణ్యంలో అధ్యాత్మచింతనం చేస్తూండటం కనిపెట్టి యొక యాటవిక కన్నె అతన్ని మోహించింది; తనవలపు నాతని కెన్నివిధాలనో సూచించింది; ఎన్ని చేసినా ఆ తరుణ తపసి కరగినాడుకాడు; ఘననిరాశామానసంతో సమీపంలోని జలపాతంలో పడిపోయిం దామె! ఆమె మరణానంతరం ఆ యువకతపసి ఆ కన్నెయొక్క నిర్మల దివ్యోన్నత ప్రేమమును గుర్తించాడు. అంత అతని హృదయాన్ని పశ్చాత్తాపాగ్నికీలలు దహించివైచినై!]

(1) ఇంత యుగాయుష్యపుఁబనిఁ
నింతలోనె నిప్పగిదిని,
యింతీ! నేతుననుచు నెన్న
డెంచనైతిఁ గలనైనను! ॥
ఆహా! యచ్చరల నిన్న!
ఓహో! యాటవిక కన్నె!

(2) ఊవిదా! బ్రహ్మచర్యమూని
యుండఁ నేఁ మహాతపమున,
నీ యుజ్జ్వల రూపము నా
నేత్రాంచలములనుబడెను! ॥

(3) ఐహికేచ్ఛనణచియుంటఁ
నాధ్యాత్మసమాధినుంట,
అచ్చపు నీవలపు కలిమి
యడవిఁగాయు వెన్నెలాయె! ॥

(4) ఈనాటికి కనువిచ్చితిఁ
నేమి లాభమున్నదరే!
మల్లె పరిమళించునాడె
కొల్లగొనకపోతిఁ వలపు! ॥

(5) దారుణ మీయాత్మహత్య,
ఘోరము ఘోరంబరరే!
ఈ యురవడి నీటగలసి
నెటువలె క్షితిఁబడిపోతివో? ॥

(6) మెరుమువలెను వొక్కమ్మడి
మెరసి తళుక్కుమనుచు నేదో!
మూసికొన్న రెప్పలనే
దూసికొంచు ప్రవేశించి! ॥

(7) మెరుము మెరసి, యురుమువట్లు,
మేదినిఁబడెనో? చదలన !
ప్రళయాగమ సూచనవలె,
భయదశబ్ద మొకటియయ్యె ! ॥

(8) ఉలికిపడితి! కనుఁదెరచితి !
యుగ్రతపోవిధి మరచితి !
"యరరే! పడినా రెవరో?
యార్తనాద మెదో వినబడె !"॥

(9) దడదడ దడగుండియుతో
తడబడిపోయే నడతో
వడివడి శృంగపుంగొనకు
పరువిడితిని భయపడుచును! ॥

(10) చూచి, చూపులల్లెయాపి
చూచుచునే నిలచిపోతి !
ఎంతకాలమటు లుంటినో
యేమొకాని నేనెరుగను! ॥

(11) శృంగాగ్రమునుండి యధో
భాగమునను జూచుసరికి,
యింకేమున్నది నీవే
యేటఁ గొట్టుకొనుచుంటివి! ॥

(12) తెప్పిరిల్లి నీకొరకై
తేరి పారఁజూచినాను !
దివ్యభవన్మూర్తి నెచట
దేవులాడినా కననే! ॥

(13) కొమ్మ! నేను నీ కుతుకఁ
గోసినాను తడిబట్టలో
నీచావుకు కారణంబు
నేను! నేను! నేనేనే !॥

(14) తెల్లని తొలిప్రొద్దులలో
చల్లని నునుగాలులలో
జల్లను సలిలమ్ములలో
తొల్లి స్నానమొనరింతువు! ॥

(15) ధణధణ పడు జలపాతము,
ఝణఝణ ఘూషా రవళియు
నైక్యమొంద, మధురశ్రుతీ
సౌఖ్యగాన ముద్భవించు! ॥

(16) అపుడె నిద్రవోయి లేచు
నచ్చపు తెలియంబుజముల,
తామరాకులలో కోసి
దైవమట్లు ననుగొల్తువు! ॥

(17) తరుణారుణసంధ్యలలో
కారుణ్యమెలర్ప, ఫలా
హారమొసగి, క్షీరసుధా
ధారవోసి చనుచుందువు! ॥

(18) బంగరు మునిమాపుల, యీ
శృంగవనీసీమలలో
బొంగార విపంచి మీటి
మొరయింతువు ప్రేమగీతి! ॥

(19) అప్పటి వీణాస్వనమ్ము
లప్పటి నీ గళరవమ్ము
లొక్కటియై ముంచివైచి
చొక్కించు చరాచరమున్! ॥

(20) అలశారదపూర్ణచంద్రి
కామనోజ్ఞ నిశలలోని
తావకీన దివ్యనగ్న
తాండవలయగతి నందించు! ॥

(21) నీ యమాయికపు శీలమె,
నీ రుచిరావయవ జాలమె,
నీ హృదయపు నైర్మల్యమె,
నీ దివ్యోన్నత ప్రేమమె! ॥

(22) నాగుండియ లాగివైచె!
నామనసును కలచివైచె!
బ్రహ్మచర్య దీక్షఁద్రచ్చెఁ! ॥
పరచింతనమును మాన్చెఁ! ॥

(23) ఇప్పుడె నే తెలిసికొంటి
నేమొ ప్రేమమ్మటన్న!
అప్పుడె ప్రేమామహాత్మ్య
మదియొకగిన నిటులేనా? ॥

(24) ఇహమున సర్వమ్మనిత్య
మిలనిర్మల మగుప్రేమే
నిజమారయ శాశ్వతమ్ము
నేడు, నాడు, యేనాడును! ॥

(25) ఓహో ప్రేమైకధునీ!
ఆహా ప్రణయోరుఖనీ!
ఓహో మధుమాసవనీ!
ఆహా మోహనస్వనీ! ॥

ఓహో! యచ్చరల మిన్న!
ఆహా! యాటవిక కన్న!

◆ ◆ ◆ ◆
◆ ◆ ◆ ◆

(26) అని పశ్చాత్తాపముపడి
యా యౌవన బ్రహ్మచారి,
నిజ ప్రేయసికై విలపుచు
నీడయనక నడయాడెను! ॥

(27) గ్రుమ్మరిల్లి గ్రుమ్మరిల్లి
గొంతువోవ యరచి యరచి
సొమ్మసిల్లె నాతడొండు
క్రమ్ముకొన్న మావినీడఁ! ॥

(28) మూర్ఛగాదు! పాప! మేమొ
మూతపడ్డ కను తెరువడు!
పరమపదినిబట్టె 'జీవి'!
ధరబడి నిద్రించె నతడు! ॥

(29) గీ. విన, యీనాటికిని రసాలావనులను
కానబడును దీనపికముగా నతండు!
వినగవచ్చు, గుండియలద్రవించు నతని
యతివిషాదప్రణయగీతు లనవరతము!॥"

సమాప్తి

[N. B. ఇది యొక గేయరూపమునున్న కావ్యము. విశ్వనాథ సత్యనారాయణగారి "ఓహో! కిన్నరసానీ!" అను గేయమువలె యీ గేయమును నడచును.]




ఉత్తమయిల్లాలు

చి॥సౌ॥ చెల్లెలు శ్యామలాంబకు మీఅక్క సీతాలక్ష్మి అనేకఆశీర్వచనములు త॥ సోదరీ,

నాన్నగారు వ్రాసిన యుత్తరమందినది. నిన్ను మీఅత్తవారు పిలువవచ్చిరనియు క్రొత్తకాపురము చేయుటకు విజయనగర మేగుచున్నావనియు తెలిసి మిగుల సంతోషించుచున్నాను. ఇదేసమయమున మీబావగారు చెన్నపురిలో ప్రాక్టీసుపెట్టుకొనుటకుగానన్ను తీసుకొని వచ్చుటచేత నేను నీదగ్గరలేనందుకు విచారించుచున్నాను. నీపై పడుచున్న యీక్రొత్తబాధ్యతను నీవు సంతోషముగను సక్రమముగను నెరవేర్చగలవని నేను పూర్ణముగ విశ్వసించుచున్నాను. గృహనిర్వహణమునందు నీసాయము నెప్పటికప్పుడు గొనుచు మనతల్లిగారు నీకొసగిన శిక్షణము నీకిప్పుడత్యంతోపయుక్తముగ నుండకమానదు. నీకిప్పుడు నేనుచెప్పవలసిన విశేషాంశము లేమియును లేవు.

శ్రీమతి పాకల కనకరత్నమ్మగారు

చెన్నపురి,
11-11-33.

అయినను క్రొత్తగా అత్తవారింటికి పోవు పడుచులకు పెద్దవారెల్లరును వారికి తోచిన సలహా లిచ్చుచుండుట ఆచారము గనుక నాకుతోచిన సలహాలు నేను నొసంగుచున్నాను. నీతీరికకాలమునెల్ల గ్రంథపఠనము సంగీతాభ్యాసము కుట్టుట బొమ్మలువ్రాయుట మొదలగు పనులయందు వినియోగించుచున్నచో నీమనస్సున కెట్టిచింతలును గలుగవు.

గృహిణీకృత్యములు:—

స్త్రీతనశక్తికొలదిగృహమును అందలివివిధ వస్తుసముదాయమును, శుభ్రముగాను, నయనానందకరముగాను ఉంచుటకు సదా యత్నించవలయునేగాని, ఎచటివస్తువులచటే, ఎచటి మాలిన్య మచటనెయుంచి "ఈ యింటినింత సొంపుగనుంచిన యిల్లాలెవతె"యని చూపరులుతలంచునట్లుండరాదు. ఇల్లుచూచియిల్లాలినిచూడుమని ఆర్యవచనముగూడానున్నది. ప్రస్తుతమనేకులు, తమ అవివేకము చేతనో, కొలదియో గొప్పయో విద్యాగంధము

గలవారమనియో, లేక అదియే నాగరికతా లక్షణమని ఎంచియోగాని తమ నిత్య కృత్యములనన్నియు నౌకర్లమీదవదలి వారు పెట్టినది తినుచూ, సోమరులై వళ్లుయిల్లు గుల్లచేసికొనుచున్నారు. ఎంతసుకుమారులైనను సేవకుల భరించుశక్తియున్న చేయించుకొనవచ్చునుగాని భారమెల్లవారిపై బడవైచి, యజమానురాలు, నిర్వ్యాపకముగ కాలమువ్యర్థపుచ్చక అన్ని విషయముల గమనించుచుండవలెను. గృహమునకు తానురాణి యని జ్ఞాపకముంచుకొని పనివారు తమ నియమిత కార్యముల సక్రమముగ నెఱవేర్చునది లేనిది పరీక్షించుచు, గృహము నిత్యవస్తుసంపూర్ణముగా శోభిల్లఁజేయుచు నెటు చూచినదానైయె గృహలక్ష్మియను నామముసార్థకమొనరింప యత్నించవలె. మరియు దాసదాసీజనంబులయెడ నాదరముగల్గి వారి యోగక్షేమము లరయుచుండుట లెస్స. అట్లుగాక మనక్రింద నూడిగము లుచేసి జీవించువల్పులుగదాయని, నిరసించి, అకారణముగ వారలదూషించి హింసించుటయు, మిగుల క్రూరము. మానవజాతి అంతయు నీశ్వరునిబిడ్డలగుట సోదరులు.

సతీధర్మములు:—

అగ్నిసాక్షిగా పరిణయమాడిన భర్తయందలి దోషారోపణములకుఁ గడంగకనే, పత్యనుగుణయై, యాతనియెడ నిష్కళంకప్రేమ గౌరవముల గనబరచుచు తాను మగని యనురాగమునకు పాత్రురాలగునట్లు మెలంగవలెను. కష్టసుఖములయందు భర్తతో సహభాగినియై, యాతని శ్రేయోన్నతులకు తన యావచ్ఛక్తిని వినియోగింపుచూ, భర్తృరక్షణార్థమై యెట్టియిడుములఁ గుడుచుటకైనను వెనుదీయని యువతీరత్నమే అర్ధాంగియనఁజెల్లును. అట్టిపడుచులు పూజనీయులు.

మగవాఁడు పనిముగించుకొని అలసి సొలసి యింటికేతెంచగనే కొందఱుమూఢ యువతులు కొఱమాలిన ప్రసంగములచే నాతని విసిగించుచూ లేనిపోని గొడవల నేకరువుపెట్టుచూ తనకిదికావలె నదికావలె నని సాధించుచూ "సంసారమే నరకము, భార్యయే దయ్యమని" భావించి "ఏస్నేహితునితోనో, ఏక్లబ్బులోనో కాస్సేపుకూడ నుల్లాసముగఁ గడపక యింటికెప్పుడేయేల వచ్చితి"నని తలంచునట్లు చేతురు. అట్లొనరించుటెంతయు గర్హ్యము. అట్లుగాక పతి యేతెంచగనే ఆతనిని తగుసపర్యలతోడను, మృదుమధురభాషణములతోడను ఆనందపరుప యత్నించుట ఉత్తమ యిల్లాలి లక్షణము.

పైనఁజేర్కొనిన విషయములేగాక సంసారమీదుటకు, ధృతి, క్షమాది గుణముల నలవరచు కొనవలెను. ప్రపంచమందు సుఖదుఃఖములు సమానమేయైనను, దుఃఖమె అధికముగ గోచరించును. స్త్రీలెల్లరు పిచ్చివాదస్తములను మూర్ఖాచారములను బారద్రోలి సద్గృహిణులై తనరారుదురుగాక. ప్రతియిల్లాలును నిట్టిగుణములుగల్గి ప్రవర్తించిన భూతలమె స్వర్గతుల్యమగును. గృహమె దేవేంద్రభవనమగును.

ఇట్లు

ప్రియసోదరి

సీతాలక్ష్మి.

# ఆరోగ్యబోధిని

విద్యావారము సందర్భమున 31-10-33 తేదిన భీముని పట్టణములో జరిగిన
స్త్రీల సభలో శ్రీమతి ఆక్ముగం హేమలతగారు చదివిన వ్యాసము.

ప్రపంచములో పుట్టు ప్రతిజీవికి ఆరోగ్యము ముఖ్యమైన అవసరము, మహాభాగ్యము, సర్వసంపదలకు మూలకారణము.

ఆరోగ్యము రెండువిధములు. (1) శరీరసంబంధమైనది. (2) మనస్సంబంధమైనది. శరీరారోగ్యమును కాపాడుకొనుటకు నాలుగు ముఖ్యసాధకములు గలవు. 1 గాలి 2 నీరు 3 ఆహారము 4 సుఖపరిశ్రమము. మన దేశమునందుగల ప్రజలలో చాలామంది విద్యాగంధము లేకపోవుటచే, భగవంతు డేర్పరచిన ఆరోగ్యవిధులను సరిగా గమనించక, అకాలమృత్యువువాత బడుచున్నారు. చాలామంది 1,2 సంవత్సరములలో మృతినొందుచున్నారు. ఇట్లు చనిపోవుటకు పసిబిడ్డలకు, చిన్నతనముననే జనించువ్యాధులు కారణము.

వ్యాధులు రెండువిధములు. (1) శరీరమునందు జనించునవి. (2) అంటువ్యాధులు. అంటువ్యాధులన్నియును, సూక్ష్మక్రిములచే ఒకరినుండి మరియొకరికి వ్యాపించునని 1828 సంవత్సరమున లూయిపాస్టరను నాతడు కనిపట్టెను. వీనిలో ముఖ్యమైనవి కలరా, ప్లేగు, విషూచి, మసూచికము. చలిజ్వరము, పచ్చపుష్టము, క్షయ. మనము త్రాగడు పానీయములు శుభ్రముగానుండక, అందు యీవ్యాధిక్రిములు ప్రవేశించుచున్నందున కల్గుచున్నవి. అందుచే మన గృహమునందు భోజనపదార్థములు, త్రాగడునీరు మొదలయిన వన్నియు వైరోగములను జనింపజేయు క్రిములను దూరముగా నుండునట్లు చేయవలెను. ఈ క్రిములన్నియును, మన యిండ్లలోనుండు, ఈగలవలనను, దోమలవలనను, నల్లులవలనను మనకు వ్యాపించుచున్నవి. ఇట్లు వ్యాపింపకుండా చేయుటకు మన గృహములయందు ఈగలను దోమలను చేరకుండా చేయవలయును. దీనికి యింటి పరిశుభ్రత ముఖ్యమైన అవసరము.

గృహము:—మన కందరకును ప్రధానమైనది గృహము. ఇచ్చటనే మనము కొన్ని గంటలకాలము తప్ప, మిగిలిన విశేషకాలము గడుపుచుందుము. గృహములోనికి ప్రాణవాయువుతో కూడిన వాయువు బహిరంగముగా ప్రవేశించునట్లు పెద్దగవాక్షములు, తలుపు లుండవలయును. సూర్యరశ్మి గృహములో ప్రవేశించునట్లుండవలయును. ఇట్లుండుటవలన యింటిలోనున్న అణుజంతువులను నశింపజేయును.

నివసించు యింటిని పలుమారు శుభ్రము చేయవలయును. ఇంటిని నీటితో కడుగుట, దుమ్మును దులిపించుట, కప్పునందు గోడమూలలందు బూజును నూడ్పించుట, యింటిలోనున్న మంచములు పెట్టెలు నల్లులు పట్టకుండా చూచి యెండలో వేయుట అందరకును తెలిసినవిషయమే. అయినను దీనియందు పెక్కులు అశ్రద్ధగాయున్నారు. సున్నము వేయుటవలన సూక్ష్మక్రిములను చంపి ఆరోగ్యము వృద్ధి పొందించును. దుమ్మునందు చిన్న చిన్న యిసుక రేణువులు, లోహపురేణువు లుండును. ఇవి గాలి ద్వారా శ్వాసకోశము లోనికివళ్ళి రాపిడి కలుగజేసి వ్యాధులను కల్గించుచున్నవి. కండ్లలో పడుటవలన కండ్లకలక, కండ్లఎఱుపులు కల్గును. గాన దుమ్ము లేకుండా చూడవలయును. మనము నివసించు యిండ్ల చుట్టు హద్దులేక ఉమియుట చేత కూడా వ్యాధులు కల్గుచున్నవి. ఉమియుట చేత, అది ఎండి పొలుసుగా మారి గాలిలో ఎగురుచుండును. దానినే మనము పీల్చిన వ్యాధులు ముఖ్యముగా క్షయ మొదలగునవి సంభవించును. గాన ఫినైలులోపనును యిండ్ల యొద్ద చల్లిన చాలామంచిది. ఇండ్లకు సమీపములో

# ఆరోగ్యబోధిని

విద్యావారము సందర్భమున 31-10-33 తేదిన భీముని పట్టణములో జరిగిన స్త్రీల సభలో శ్రీమతి ఆర్ముగం హేమలతగారు చదివిన వ్యాసము.

ప్రపంచములో పుట్టు ప్రతిజీవికి ఆరోగ్యము ముఖ్యమైన అవసరము, మహాభాగ్యము, సర్వసంపదలకు మూలకారణము.

ఆరోగ్యము రెండువిధములు. (1) శరీరసంబంధమైనది. (2) మనస్సంబంధమైనది. శరీరారోగ్యమును కాపాడుకొనుటకు నాలుగు ముఖ్యసాధకములు గలవు. 1 గాలి 2 నీరు 3 ఆహారము 4 సుఖపరిశ్రమము. మన దేశమునందుగల ప్రజలలో చాలామంది విద్యాగంధము లేకపోవుటచే, భగవంతుడేర్పరచిన ఆరోగ్యవిధులను సరిగా గమనించక, అకాల మృత్యువువాత బడుచున్నారు. చాలామంది 1,2 సంవత్సరములలో మృతినొందుచున్నారు. ఇట్లు చనిపోవుటకు పసిబిడ్డలకు, చిన్నతనముననే జనించువ్యాధులు కారణము.

వ్యాధులు రెండువిధములు. (1) శరీరమునందు జనించునవి. (2) అంటువ్యాధులు. అంటువ్యాధులన్నియును, సూక్ష్మక్రిములచే ఒకరినుండి మరియొకరికి వ్యాపించునని 1828 సంవత్సరమున లూయిపాశ్చరను నాతడు కనిపెట్టెను. వీనిలో ముఖ్యమైనవి కలరా, ప్లేగు, విషూచి, మసూచికము. చలిజ్వరము, పచ్చవుష్టము, క్షయ. మనము త్రాగెడు పానీయములు శుభ్రముగానుండక, అందు యీ వ్యాధిక్రిములు ప్రవేశించుచున్నందున కల్గుచున్నవి. అందుచే మన గృహమునందు భోజనపదార్థములు, త్రాగెడునీరు మొదలయిన వన్నియు పైరోగములను జనింపజేయు క్రిములను దూరముగా నుండునట్లు చేయవలెను. ఈ క్రిములన్నియును, మన యిండ్లలోనుండు, ఈగలవలనను, దోమలవలనను, నల్లులవలనను మనకు వ్యాపించుచున్నవి. ఇట్లు వ్యాపింపకుండా చేయుటకు మన గృహములయందు ఈగలను దోమలను చేరకుండా చేయవలయును. దీనికి యింటి పరిశుభ్రత ముఖ్యమైన అవసరము.

గృహము:—మన కందరకును ప్రధానమైనది గృహము. ఇచ్చటనే మనము కొన్ని గంటలకాలము తప్ప, మిగిలిన విశేషకాలము గడుపుచుందుము. గృహములోనికి ప్రాణవాయువుతో కూడిన వాయువు బహిరంగముగా ప్రవేశించునట్లు పెద్దగవాక్షములు, తలుపు లుండవలయును. సూర్యరశ్మి గృహములో ప్రవేశించునట్లుండవలయును. ఇట్లుండుటవలన యింటిలోనున్న అణుజంతువులను నశింపజేయును.

నివసించు యింటిని పలుమారు శుభ్రము చేయవలయును. ఇంటిని నీటితో కడుగుట, దుమ్మును దులిపించుట, కప్పునందు గోడమూలలందు బూజును నూడ్పించుట, యింటిలోనున్న మంచములు పెట్టెలు నల్లులు పట్టకుండా చూచి యెండలో వేయుట అందరకును తెలిసినవిషయమే. అయినను దీనియందనేకులు అశ్రద్ధగాయున్నారు. సున్నము వేయుటవలన సూక్ష్మక్రిములను చంపి ఆరోగ్యము వృద్ధి పొందించును. దుమ్మునందు చిన్నచిన్న యిసుకరేణువులు, లోహపురేణువు లుండును. ఇవి గాలి ద్వారా శ్వాసకోశము లోనికివెళ్ళి రాపిడి కలుగజేసి వ్యాధులను కల్గించుచున్నవి. కండ్లలో పడుటవలన కండ్లకలక, కండ్లఎఱుపులు కల్గును. గాన దుమ్ము లేకుండా చూడవలయును. మనము నివశించు యిండ్ల చుట్టు హద్దులేక ఉమియుటచేత కూడా వ్యాధులు కల్గుచున్నవి. ఉమియుటచేత, అది ఎండి పొలుసుగా మారి గాలిలో ఎగురుచుండును. దానిచే మనము పీల్చిన వ్యాధులు ముఖ్యముగా క్షయ మొదలగునవి సంభవించును. గాన ఫినైలులోనునును యిండ్లయొద్ద చల్లిన చాలామంచిది. ఇండ్లకు సమీపములో

మురికికాలువలు, పెంట కుప్ప లుండరాదు. ఇవి మురుగుమ చెడువాసన గొట్టును. మనము దానిని పీల్చిన రక్తమునందు బలహీనతకల్గి, వ్యాధులకు లోనగుచున్నాము. ఇచ్చట దోమలు, ఈగలు, వృద్ధియై, కుళ్ళుచున్న నీటియందలి, పెంట కుప్ప యందలి వ్యాధి క్రిములను కాళ్ళయందు దిరికించుకొని మన భోజనములపై, త్రాగేనీటిపై వ్రాలి పురుగులను విడుచును. అవి మన కడుపులోనికి వెళ్లి వ్యాధులను కలుగజేయుచున్నవి. దోమలవలన చాలా అపాయములు. వానినిపట్టుటకైనను మనకు సాధ్యము కాదు. అవి మనలను కరువకుండా దోమతెరలను వేసుకొనిన చాలామంచిది. పెంటకుప్పలుగాని, చెత్తనుగాని యిండ్లయొద్ద కుళ్లనీయరాదు.

గర్భిణియొక్క దేహారోగ్యము:—ప్రసవ మను నది యొక దేహపరిశ్రమము గనుక దేహము నారోగ్యమైన స్థితిలోనుంచవలయును. కాయకష్టపడు స్త్రీల ప్రసవము లతిసులభములు. ఇంటిలో కూర్చొని అతిసుఖముగా కాలము వెళ్లబుచ్చెడివారి ప్రసవము లతికష్టములు. అయినను మితిమీరిన దేహపరిశ్రమ మనవసరము. ప్రతివారు కొద్దిపాటి దేహపరిశ్రమము కల్గియుండవలయును. గర్భిణికి మనోవిచారముండ రాదు. సాధ్యమైనంతమట్టుకు వినోదములతోడ కాలము వెళ్లబుచ్చుచుండవలయును. సంగీతము పాడుట, మంచి మంచి పుస్తకములను చదువుట, పూలమొక్కలను పెంచుట, దైవధ్యానము చేయుట, వీనియందు మనస్సుండవలయును. తల్లియొక్క గుణములు, కోర్కెలుప్రకారము బిడ్డలుందురు. తల్లి మంచి కోర్కెలు కలదైన బిడ్డకూడా గుణవంతు రాలుగానుండును. ప్రతిసాయంకాలము షికారునకు వెళ్లుచుండిన మంచిది. ఎడ్లబండ్లమీదను రైలు మీదను బహుదూరప్రయాణము చేయరాదు. ప్రతి దినము స్నానముచేసి, శుభ్రమైన బట్టలు ధరించ వలయును. రాత్రులందు చాలావరకు మేల్కొని యుండక త్వరలో నిద్రించవలయును. ఆహారము దేహమునకు పుష్టికరమైనదిగా నుండవలెను. అధికముగా మాంసకృత్తులను మాంసమును తినుట తగ్గించవలెను. శాకపదార్థములను, ఫలములను భుజించుట వలన మలశుద్ధి బాగుగానగును. మామూలుగా చేసెడి స్నానపద్ధతులను మార్చకూడదు. గర్భకాలమునం దామె వస్త్రములు రొమ్మును బిగించునట్లుండ కూడదు. వర్షకాలమునందు, చలికాలమునందు వున్ని వస్త్రములను ధరించవలెను. గర్భిణియొక్క మూత్రమును అప్పుడప్పుడు పరీక్షించుచుండవలయును. అందులో ఓజస్సు (Albumen) అను ధాతు వుండిన యెడల వ్యాధి సంభవించి, కాళ్లు, చేతులు వాచును. దానికి అమ్మలక్కలు తుట్టసారమని అశ్రద్ధ చేయుట వలన ఆకస్మికమరణములు, మూర్ఛలు, ప్రసవములో కష్టములు కల్గుచున్నవి. చేతులు, కాళ్లు వాచియున్న వెంటనే ఆస్పత్రికివెళ్లి నీరుడును తనిఖీచేయించి, వ్యాధి తగ్గనరకు మందు పుచ్చుకొని, వారు చెప్పు పథ్యమును చేయవలయును. కడపటి మాసములో వారమున కొక పర్యాయమైనను నీరుడును తనిఖీ చేయించవలెను.

ప్రసవపునొప్పులు ప్రారంభించిన వెంటనే మంత్రసానులకుగాని, వద్యులకుగాని కబురు చేయవలయును. నొప్పు లారంభమగుచున్నప్పుడు వెంటనే పురిటిగదిని సిద్ధపర్చవలయును. పురిటిల్లు సూర్యకాంతి వచ్చునట్లు వీలుగులాగు నుండవలెను.

పురిటిల్లు:—గది వలయునంత వెలుగు, గాలి వచ్చునట్లుండవలయును. గదిలోనికి దుమ్ము రాకూడదు. గదిలోనుండు సామానులు, కుండలు, పెట్టెలు బయటికి తీసివేయవలయును. జనులసందడి లేకుండా చేయవలెను.

పడక:—ఒక మనిషికి తగిన పడక వేయవల యును. గర్భిణిని యెటునుండియైన అందుకొనుటకు వీలుగానుండవలయును. వెలుగు, గాలి వచ్చునట్లు మంచమును త్రిప్పియుంచవలెను. నులక, లేక పట్టె మంచమైనదానిపై నొక పలకనువేసి పడకను సిద్ధపరచవలయును. పురిటిగదిని మంచమును సిద్ధపరచి ఏతవారిని, గొల్లవారిని, ఎరకలవారిని పిలువరాదు. వారికి యేమియూ తెలియదు. వారు అనేక కుస్తీ పనులచేసి, మురికిబట్టలు, మురికిచేతులు, కడియములు, వుంగరములు పెట్టుకొని అనవసరమైన లోని పరీక్షలు చేయుచున్నందున ప్రసవమైన తరువాత

అనేక జబ్బులు పుట్టుటయేగాక ప్రసవములో అకస్మిక మరణములు కల్గును. అదియుగాక మోటు సాధనములు చేయుచు, కషాయములు మొదలగునవి యిచ్చి గాబరా పెట్టుచున్నారు. ప్రసవపుగదిలో యెక్కువ సందడి, మురికిగుడ్డలు మొదలగునవి విస్తారముగాయుండి తలుపులు కిటికీలు వేయుదురు. దానివల్ల గాలి విషమైపోవును. దానిని ఒకొకరు పీల్చినందున వ్యాధులు సంభవించును. అదియుగాక ప్రసవమయిన మనిషిని నిలువబెట్టుట, స్నానము చేయుట, మురికిగుడ్డలు చుట్టి పరుండబెట్టుట, బిడ్డకు తవుడు, నలుగుపిండి, పసుపు మొదలగువానితో స్నానము చేయించుట, 3 రోజులవరకు ఆముదముపట్టుట చేయుచున్నారు. ప్రసవమయిన తరువాత మనిషి చాలా బడలిక తీరియుండును. అట్టి మనిషిని లేవదీయకూడదు. స్నానము చేయించరాదు. శుభ్రమైన బట్ట కప్పి 3 రోజులవరకు లేవదీయరాదు. చిన్న బిడ్డల శరీరము మృదువుగా నుండును. వారు ఎంతో శ్రమజెంది తల్లి గర్భమునుండి క్రిందపడుచున్నారు. అట్టి బిడ్డలకు పసుపుతోను, నలుగుతోను నలిచి, సహించలేనంత వేడినీరు బయలు స్థలములలో పోయుచున్నారు. బిడ్డ వేడినీరు సహించలేక సొమ్మసిల్లి పోయిపడియున్న మావానికి వేడినీరు పోసినాము. అందుచే బాగుగా పండుకొనియున్నాడని సంతోషించుట తప్ప దానికి బాధగాయుండునని తలంచరు. నలుగుపెట్టుటవలన వారి శరీరమునకు బాధగాయుండును. గాన నలుగును మాని సబ్బుతో నులివెచ్చని నీటిని, గాలిలేనిచోట పోయవలెను. నిదురపోయినపుడు చల్లగాలి తగులనీయరాదు.

ప్రసవమయిన తల్లికి 3 రోజులవరకు పత్ర యింగువ కాయమునిచ్చి మంచినీటినైన యీయక యిగరబెట్టుచు, తలుపులు కిటికీలు గాలిలేకుండా వేయుచు, చెవులలో గుడ్డలు పెట్టుచు, క్రింద వేడికుంపట్లు పెట్టుచు, శరీరమునకు మరి యెక్కువ వేడి కలుగ చేయుచున్నారు. కొందరు బ్రాంది త్రాగనిచ్చెదరు, ఇది రక్తములోచేరి మనిషికి ఆరాటము కల్గించుచు, వుద్రేకముగా యుండును. పసిబిడ్డలకును పుట్టిన 6 గంటలవరకు యేమి యీయక తరువాత తల్లియొక్క రొమ్మును నోటిలోపెట్టి పాలుత్రాగునట్లు చేయవలెను. దానివల్ల బిడ్డకారోగ్యము, మలశుద్ధి బాగుగానగును. కాని ఆముదమునే గడియగడియకు పట్టరాదు. దానివల్ల బిడ్డ ఆరోగ్యము చెడిపోవును. ప్రసవమయిన మనిషికి 3 రోజులవరకు కాఫి, జావ, పాలు మొదలగునవి యిచ్చి ఆమెయొక్క నీరసమును తగ్గించునట్లు చూడవలయును. గాలి బాగుగా వచ్చునట్లు తలుపులు కిటికీలు తీసియుంచవలెను. గాలి బాగుగా పీల్చిన మనిషికి ఆరోగ్యముగాన చెవులలో గుడ్డలను మునుగులను వేయరాదు. మంచము క్రింద కుంపట్లు పెట్టరాదు. ఆవేడిని బిడ్డలు సహించలేరు. వారికి చలిగానుండిన వున్ని బట్టలను కప్పవలయును. సాధ్యమైనంతవరకు పురిటిలో యిచ్చు పత్ర, యింగువ, కాయముల నిచ్చుట మాని, ఆస్పత్రిమందుల నుపయోగించిన బాలింతలకు ఆరోగ్యము కలుగ చేయును. తలదగ్గర రోలు, జోడు, కత్తి, చీపురుల నుంచి వెర్రిభ్రమలు పడుచున్నారు. మనము ఆరోగ్య విధులను సరిగా గమనించి, తల్లియొక్కయు బిడ్డయొక్కయు సుఖము నిమిత్తము మంచి పద్ధతుల నవలంబించ వలయునుగాని, కత్తులు, చీపురులు, జోడులు, తలయొద్ద పెట్టుటవలన వారిని రక్షింపవు. తల్లికి పత్ర కాయము బ్రాందిని యిచ్చుటవల్ల పాలుకూడా పత్రగాను, బ్రాందియున్నవి వుద్రేకము కల్గించునవిగాను వుండును. అట్టి పాలు బిడ్డలు త్రాగుటవలన అనేక జబ్బులు పడుచు అకాలమృత్యువాతబడుచున్నారు. ఇట్టి పాలు త్రాగుటవల్ల అసానులు మొదలగు జబ్బులువచ్చును. దానికి వారు బిడ్డయొక్క కడుపును చురకలతో కాల్చుచు, జీవహింస చేయుచున్నారు. ప్రతివారు బాలింతలకు ఆస్పత్రి మందుల నుపయోగించి, డాక్టర్ల అనుమతి ప్రకారము నడిచిన బిడ్డలకు తల్లులకు ఆరోగ్యము కల్గుటయేగాక, అకాలమృత్యువులుండవు. మనము అశ్రద్ధగా యుండుటవల్ల సంవత్సరమునకు బాలింతలు, పసివారు 10 వేలకు చనిపోవుచున్నారు. గాన ప్రతివారు బాలింతల, బిడ్డల విషయమై జాగ్రత్తగా యుండవలయును.

# మహిళా సభలు

గుంటూరు నగరమున అక్టోబరు 28-వ తేదిని జరిగిన 7-వ మండల మహిళాసభాధ్యక్షురాలు శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగారి యుపన్యాసములోని ప్రధానభాగములు:—

**వర్ణభేదములు:—**

ఒకానొకప్పుడు వర్ణభేదములు సంఘీభావమునకు అంతరాయములు గావని తలంపబడినను హిందూదేశము నంతను ఒక్కమారుగ కదల్చిన హరిజన సమస్యాపరిష్కార విషయమున జరుగుచున్న వాదవివాదములను పరీక్షించిన స్వరాజ్యము బడయుటకేమి, దేశాభివృద్ధికేమి వర్ణభేదములు అన్నివిధముల ఆటంకములని తేలుచున్నది. పుట్టుకరీత్యావర్ణ నిర్ణయము చేయుట ప్రస్తుత కాలపరిస్థితులకు తగని విషయమని ఒప్పుకొనక తప్పదు. అంటరానితనము, వర్ణభేదములు రూపుమాయనిది మన దేశమునకు మోక్షము లేదు. పట్టణములలో పై భేదములు తగ్గుచున్నను, పల్లెటూళ్లలో రేమాత్రముకూడ తగ్గుటలేదు కనుక పల్లెటూళ్లను బాగుచేసిననే గాని ప్రయోజనము లేదు. విద్యాధిక్యతవల్ల పురుషులు సంఘసంస్కారణమున ముందంజ వేసినను, విద్యలేని లోపమువలన స్త్రీలోకముకూడ పురుషుల ఆదర్శముల అంగీకరించనందువలన సాంఘికసమస్యా పరిష్కారము నానాటికి వెనుకబడుచున్నది. అస్పృశ్యతానివారణ విషయమున నేమి, వర్ణభేద విచ్ఛేదవిషయమున నేమి, యితర విషయముల నేమి, స్త్రీలోకముకూడ, పురుషుల ఆదర్శముల నంగీకరించి చేయూత నొసగనంతవరకు సాంఘికసమస్య పరిష్కరింప బడదనుట నిశ్చయము. ఇంత మాత్రముచేత నిజముగ పురుషులు అస్పృశ్యతా నివారణకొరకు సంసిద్ధులుగా నుండిరనియు, స్త్రీల మూలముననే యీ సమస్య యింతవరకు ఫలోన్ముఖమునకు రాలేదనియు నేను చెప్పజాలను. ఎందువల్లననగ పురుషులు వేదికలపైకెక్కి యుపన్యాసము లిచ్చుటతోనే తమవిధిని నిర్వర్తించితి మనుకొనెదరు. స్త్రీలు అటులకాక నిజముగ మనఃస్ఫూర్తిగ యే ఉద్యమ మందైనను ప్రవేశించినయెడల, ఎన్ని కష్టములు వచ్చినప్పటికీ లెక్కచాయక ఆ పనిని నెరవేర్చుటలో కృతార్థులయ్యెదరని చెప్పుటకు నేను గర్వించుచున్నాను. కనుక నిజముగ స్త్రీలు యేనాడైతే పంచములు, మనతోడి సోదరులు అని తలచి అస్పృశ్యతా నివారణకొరకు ప్రయత్నించెదరో ఆనాడే అంటరానివారు అనుమాట మటుమాయమై మన ఇండ్లనిండ సేవకులుగను పరిచారకులుగను నియమించుటలో నేవిధమైన అభ్యంతరము నుండదు. అప్పుడు ఈ సమస్య అతి తేలికగా అంతరించిపోవును. ఆనాడే నిజముగా హిందూదేశమునకు మోక్షము గల్గును.

**హిందీభాష:—**

విద్యావిధానమున హిందీభాషకు ఉచితస్థానమీయవలెను. స్థానిక స్వపరిపాలనా సంఘములలోను రాష్ట్రీయ శాసనసభలలోనే గాక సామ్రాజ్యశాసన సభలలో కూడ స్త్రీలు స్థానములు కలిగి కార్యభారమును వహింపవలసిన తరుణము రానున్నది. హిందూదేశమునందలి నానాప్రాంతముల స్త్రీలలో కలిసిమెలసి తిరిగి వారి కష్టసుఖములు తెలిసికొని,

దేశభాగ్యోదయమునకు తోడ్పడవలెనన్న అన్నిప్రాంతముల అర్థమగు హిందీభాష నేర్చుకొనుట అవసరము. మన దేశమున దాదాపు అన్ని భాగముల హిందీభాషలో మాట్లాడిన తెలిసికొనగలవా రెక్కువమందిగలరు. మరియు అందరు హిందీభాష నేర్చుకొనుటకు సర్వత్ర ప్రయత్నములు జరుగుచున్నవి. కొలదికాలములో హిందూ దేశమునకంతయు మాతృభాషగా హిందీయే కానున్నటుల శుభసూచకములు కన్పట్టుచున్నవి. స్థానికసంస్థలు, విశ్వకళాపరిషత్తులు తమ విద్యాలయములలో హిందీభాషకు ప్రాముఖ్యమునిచ్చుచు, ఆభాషను సర్వాంగీకారముచేయు విశ్వప్రయత్నములు చేయుచున్నారు. స్త్రీలును ఈ తరుణమందు వెనుకబడక పురుషులకంటె ముందంజవేసి హిందీభాషను నేర్చుకొనుట అత్యవసరమని మనవిచేయుచున్నాను.

విడాకులు:—

ప్రపంచపరిణామము దూరదృష్టితో చూచిన కొలది సంఘనిర్మాణమునకు వివాహము యెట్లు అవసరమో, వివాహవిచ్ఛేదనముకూడ అటులనే ధర్మమని తోచకమానదు. ఈవిషయమై వాదవివాదములు కలవని గుర్తెరిగియే నా అభిప్రాయమీయ సాహసించుచున్నాను. వివాహవిముక్తి విషయమై స్త్రీకి స్వతంత్రత కలిగిన, నీతిబాహ్యులగుటకు కారణమగునని అభిప్రాయపడుట పొరపాటు. స్త్రీ తన నీతిని కాపాడుకొనుట, కాపాడుకొనకుండుట, స్వభావమును బట్టియుండునుగాని, అవకాశమునుబట్టి మారుననుకొనుట సరి అయినదికాదు. వ్యాధిగ్రస్తయగునట్టియు, దాంపత్యమునకు తగనట్టియు, దుష్టురాలగునట్టియు స్త్రీని పరిత్యజించి, వివాహేచ్ఛగల పురుషుడు ద్వితీయము చేసికొనుటకు అవకాశము కలిగినప్పుడు అనర్హుడగు పురుషునే పట్టుకొని వుండమని స్త్రీని శాసించుట ధర్మవిరుద్ధముగాదా? అట్టి స్త్రీ బ్రతుకు మరణముకన్న అన్యాయమే అగును. అట్టి స్త్రీకి భర్తతో కాపురమసంభవమైనప్పుడును, వివాహకాంక్ష తీరనప్పుడు, వివాహ విముక్తిచేసికొని పరిణయమాడు స్వతంత్రమునిచ్చు శాసనముండుట అవసరము. వివాహవిచ్ఛేద శాసనముండినంత మాత్రమున స్త్రీలు అవినీతి పరులగుదురని, శాసనమును దుర్వినియోగము కావింతురని తలంపకుందురుగాక యని కోరుచున్నాను.

ఆర్థికదుస్థితి:—

భారత రాజకీయ సాంఘిక పరిణామములు దినదినము మార్పు చెందుచున్నవి. ఒకానొకప్పుడు అష్టైశ్వర్యములతో తులతూగిన భారతభూమి నేడు ఆర్థిక దారిద్ర్యముచే వణగద్రొక్కబడి యున్నది. తిరిగి అర్థస్థానము పొందుటకు సర్వతోముఖప్రయత్నములు జరుపబడుచున్న సమయమిది. సాంఘిక వ్యవహార పరిష్కారములు చురుకుగ జరుగుచున్నవి. పురుషులు స్త్రీలను, భాగ్యవంతులు బీదవారలను, పెద్దలు చిన్నలను, ఒకమతస్థుడు మరియొక మతస్థుని, ఒక కులమువారు మరియొక కులమువారిని అణగత్రొక్కి యుంచగలుగు రోజులు గతించినవి. సమానత్వప్రబోధము జరుగుచున్నది. పరస్పర కలహములు సర్దుబాటుచేసుకొని దేశాభ్యుదయమునకు అందరు శక్త్యనుసారముగ తోడ్పడి భారతమాతకు ఉచితస్థానప్రాప్తి కొఱకు పాటుపడు సూచనలు కనబడుచున్నవి. రాజకీయ స్వాతంత్ర్యముకన్న ఆర్థికస్వాతంత్ర్యము మనదేశమున కత్యవసరముగ కనబడుచున్నది. జాపానువారేమి, ఇంగ్లీషువారేమి, మరి యితరదేశస్థులేమి, మనదేశ వాణిజ్య నాశమునకు యేవిధముగ కారకులైనది నిత్యమును, మనము పత్రికలద్వారా తెలిసికొనుచున్నాము. సర్వత్ర శాంతిని, సౌఖ్యమును, తృప్తిని అనుభవించుచున్న పల్లెలు రూపుమాసిపోయి నానాటికి దౌర్భాగ్యస్థితికి వచ్చుచున్నవి. కారణము స్త్రీపురుషులు ఆధునిక వ్యామోహమునబడి ప్రతివిషయమునను పరాధీనతయందుండుటయే. ఈ స్థితిమార్పుభారము పురుషులతోపాటు స్త్రీలమగు మనపైనకూడ గలదు. మన దేశస్థితులతోపాటు పోల్చిచూచుకొని అభివృద్ధినొందు మార్గముల

తెలిసికొనుటకు మనము తరచుగ సమకూడుటకు సంస్థలను నేర్పరుపవలెను. ఆంధ్రదేశమునం దంతటను ప్రతి పల్లెయందును, పట్టణమందును మహిళాసమితులు స్థాపించినగాని సోదరీమణు లందరు సమావేశమై దేశపరిస్థితులు గమనించుటకు సావకాశములు గలుగవు.

### స్త్రీ సమాజములు:—

పల్లెటూళ్ళకు విద్యావంతులగు స్త్రీలు తరచుగ వెళ్లుచు, అక్కడ కాలముగడుపుచు మహిళా సమాజములద్వారా దేశపరిస్థితులు సుబోధకములుగ సోదరీమణులకు చెప్పుచుండవలెను. అఖిలభారత మహిళా సంఘమునకు, రాష్ట్రీయసంఘములు, వానికి మన మిప్పుడు సమావేశమైనట్టి జిల్లాసంఘములు యేవిధముగా తోడ్పాటు చేయుచున్నవో, అదేవిధముగా జిల్లాసంఘములకు, తాలూకాసంఘములు, వానికి గ్రామసంఘములు, అంతశ్శాఖలుగా నేర్పడినగాని సరియగు ప్రబోధము జరుగజాలదు. అప్పుడు గాని స్త్రీలు తమ హక్కులను సరిగ గ్రహించి వినియోగింపజాలరు. నేను చెప్పిన మహిళాసమితులు, చిన్న చిన్న విద్యాసంస్థలుగ కూడనుండి, వయసుమీరిన బాలికలకు, గృహిణులకు కూడ తగు విద్యాజ్ఞానము నివ్వగలిగి వుండవలెను.

—:o:—

## సప్తమాంధ్రరాష్ట్రీయ మహిళాసభ ఏలూరు 4-11-33 లో శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారి అధ్యక్షకోపన్యాసములోని ప్రధానభాగములు.

### ఆంధ్రదేశము—మహిళాసభలు

ఆంధ్రదేశమున అఖిలభారత మహిళాసంఘమునకు, అనేక శాఖోపశాఖలు విస్తరిల్లినవనియు, ఆంధ్రదేశము మన రాజధానిలో నొకభాగమేయయినను ఇతర భాషాప్రయుక్త ప్రదేశములకన్నను అధికముగ కృషిచేసి అనేక జిల్లాలయందు మహిళాసభలను జరిపియున్నదనియు మీ నివేదికవలన స్పష్టమగుచున్నది. ఆంధ్రనారీమణులు రాజకీయస్వాతంత్ర్యము నెంత అవసరమని గుర్తెరింగియున్నారో, అట్లే సాంఘిక విద్యాసంస్కరణావశ్యకతలనుగూడ గుర్తించుటలో వెనుకబడలేదనుటకు కిదియే తగిన తార్కాణము.

### దేశస్వాతంత్ర్యసేవ

దేశస్వాతంత్ర్యమునకు కావలసిన సేవను త్యాగమును చేయుటయందు మీరు అగ్రస్థానము నలంకరించియున్నారు. సత్యాగ్రహోద్యమమునందు ఉత్తములగు స్త్రీ పురుషు లనేకులు అపరిమిత కష్టనిష్ఠురములకు పాల్పడి నేటికిని ఈ రాజధానియందలి అనేక కారాగృహములలో శిక్షల ననుభవించుచున్నారు. ఈ క్లిష్టపరిస్థితులయందు మీలో కొందరు మీ కాలమును బుద్ధిని సాంఘికసేవయందు వినియోగించుట ప్రశంసనీయము. దీనినిబట్టి మీ దేశసేవ సర్వతోముఖమనియు, మీరు సాంఘిక రాజకీయ మత సాంప్రదాయము లన్నింటిని సంస్కరించుచున్నారనియు విస్పష్టమగుచున్నది. కాని ఈ సాంఘిక రాజకీయ మతవిషయములు పరస్పర సంబంధము కలవై ఒకదానిపై నొకటి యాధారపడియున్నవి.

రాజకీయముగా మేల్కాంచిన ప్రజలు సాంఘిక విద్యావిషయక పరివర్తనయందును సమానమగు నుద్రేకమును చూపుట నేను సాధారణముగ కనుగొనుచున్న విషయము. సామాన్యముగ సంఘసంస్కరణములు స్త్రీ సంఘమునకు సంబంధించిన సంస్కరణలతో నేకీభవించి వాటిపై నాధారపడియున్నవి. సంఘసంస్కరణ యనగా స్త్రీకి గృహమునందును, సంఘమునందునుగల గౌరవమును వృద్ధిచేయుట.

### సంఘసంస్కరణమునకు ప్రతిబంధకములు:

### బాల్యవివాహము

మన దేశములో కావలసిన సంఘసంస్కరణకు ముఖ్య ప్రతిబంధకములు కొన్ని కలవు. (1) విద్యా

వ్యాప్తి లేకయుండుట యనగా ప్రజల అజ్ఞానము. ఆధునికవిజ్ఞానమును గడించుటకు ప్రజలకు సౌకర్యములు లేకుండుట. (2) దొరతనమువారు మతసంబంధమగు విషయములందు జూపు ఉదాసీనత. కేవలము ప్రజాహితసంఘములయొక్క ప్రబోధప్రచారముల వల్లగాని, కేవలము శాసనముల నమలుపరచుటవల్లగాని తగినంత ప్రబలమైన సంఘసంస్కరణము కలుగజాలదని ఇటీవల జనాభాలెక్కల మూలమున తెలియుచున్నది. మద్రాసు, బెంగాలు, బిహారు, ఒరిస్సా, అస్సాములలోని సమిష్టి జనాభాలెక్కల వలన బాల్యవివాహములు ఎట్లు అభివృద్ధినొందుచున్నవో స్పష్టమగుచున్నది.

| వయస్సులు | బాల్యవివాహితలు | | బాలవితంతువులు | |
|---|---|---|---|---|
| | 1921 | 1931 | 1921 | 1931 |
| 0—1 | 2,144 | 21,330 | 197 | 594 |
| 1—5 | 82,860 | 377,983 | 6,536 | 13,196 |
| 5—10 | 826,483 | 2,019,675 | 46,275 | 54 475 |
| 10—15 | 2,769 585 | 3,333,957 | 138,509 | 98,326 |
| 0—15 | 3,681,072 | 5,752,945 | 189,517 | 166 531 |

## చదువు

1921 సం. జనాభాలెక్కలకంటె ఇప్పటికి 2 కోట్లకు పైగా జనసంఖ్య వృద్ధియయినప్పటికిని మన దేశములో నిప్పుడు 2 కోట్ల 8 లక్షలు మాత్రమే చదువుకొనినవా రున్నట్లు తెలియుచున్నది. వెనుకటి జనాభాలెక్కల నాటికన్న 50 లక్షలు అక్షరాస్యులసంఖ్య వృద్ధియైనది. ఈ విషయమును గమనించినయెడల ప్రస్తుతస్థితి మిగుల శోచనీయము. కేవలము బి.ఏ. డిగ్రీలు పొందినను సంస్కరణములకు విముఖులై వాటిని నిరోధించునట్టివారి సంఖ్య గాక, నిజమయిన విద్యాధికులు మనలో అత్యల్పసంఖ్యాకులుగనుండుటచే, అవిద్యచే తమకు ప్రాణావసరములగు సంస్కరణములను సహితము ఆమోదించలేని అజ్ఞానులైన భారతప్రజలలో అమూల్యములగు నవీన సంస్కరణోద్దేశములను చక్కగ వ్యాపింపజేయు టెంతయు దుష్కరముగనున్నది. ఇట్టి అసహాయస్థితిలో తుర్కీ, చైనారాజ్యములయందువలె ప్రభుత్వమువారే అవసరమైన సంస్కరణముల నన్నిటిని శాసనబద్ధముగా దేశములో నమలుజరుపుటయే కర్తవ్యము. కాని దొరతనమువా రిప్పుడు తమ ధర్మమును పూర్తిగ విస్మరించి శారదాచట్టమునైనను, దేవదాసీ చట్టమునైనను పూర్తిగ నమలులోపెట్టుటకు తగు బాధ్యత వహించుటలేదు. తురుష్కరాజ్యములో తరతరములనుండి వచ్చుచున్న ఘోరదురాచారమును కెమాల్ పాషా గారు క్షణములో రూపుమాపుటయే గాక కావలసిన సంఘసంస్కరణములను శీఘ్రముగా నాచరణలోనికి దెచ్చియుండెను. అట్లే చైనారాజ్యములోని జాతీయప్రభుత్వము దేశానర్థదాయకములగు దురాచారములను నాశనముగావించి జాతీయౌన్నత్యమును సంపాదింపగలిగినది. బహుపత్నీత్వము నిర్మూలింపబడినది. స్త్రీలు స్వేచ్ఛ ననుభవించుచున్నారు. వ్యభిచారము శిక్షార్హము కావింపబడినది. వైవాహికసంబంధములలో ప్రజలు స్వాతంత్ర్యము కలిగియున్నారు. చైనారాజ్యములో తీవ్రమగు యువజనోద్యమమువలన జాతీయప్రభుత్వము క్రింద విద్యా, సాంఘిక, మత, జాతీయసంస్కరణములు సంపూర్ణముగ గావింపబడినవి. హిందూసంఘము పట్టి పనికిమాలినదనియు, హిందువులు గౌరవమర్యాద లెరుగని నీచులు, హీనులనియు స్వతంత్రప్రభుత్వమునకు అనర్హులనియు చేతనైనంతవరకు తమ దేశములోనే గాక ప్రపంచమునందంతటనుకూడ దుష్ప్రచారము చేయుటయే ప్రధానోద్దేశముగ పాశ్చాత్యులచే వ్రాయబడిన కొన్ని హానికరములగు పుస్తకములను నా పశ్చిమఖండయాత్రలలో నేను చూచియుంటిని. విద్య, ఆరోగ్యము, నీతి, ఆధ్యాత్మికవిజ్ఞానము ఈవిషయములలో ప్రజల శ్రేయోభివృద్ధి

ప్రభుత్వ పరిపాలనావిధానము ననుసరించియుండును. సర్వసామాన్యముగ ప్రతి నాగరికప్రభుత్వము వారును అనుసరింపవలసిన విధ్యుక్తధర్మములను మేయో మిసమ్మగాని, పెట్రిషియా కెండల్ సతిగాని, గమనించక నిస్సహాయస్థితిలోనున్న భారతజాతిని నిందించుటకే పూనుకొనుట అక్రమనుమాత్రమే గాక కుతంత్రమువలెగూడ కన్పట్టుచున్నది. ఇట్టి దూషణల కన్నింటికిని హిందువులు సమాధాన మొసంగగల స్థితిలోలేరు. మీదుమిక్కిలి అఖిలప్రపంచ సమక్షమున ఆ దూషణలయొక్క సత్యాసత్యముల విమర్శ చేయించి రాద్ధాంత సిద్ధాంతములు చేయుటకు హిందువు లిపుడు సమర్థులుకారు.

## ప్రభుత్వము

ప్రభుత్వముయొక్క విధ్యుక్తధర్మము లెట్టివో, ప్రభుత్వవిధానములలోని మార్పులు ప్రతి కుటుంబము నందలి కుటుంబినియగు తల్లియొక్క కష్టసుఖముల కేరీతిగా వర్తించునో, ఆ కుటుంబములద్వారా కులమునకును సంఘమునకును జాతికిని అవి ఏరీతిగా వర్తించునో ఈక్రింద విశదీకరించుచున్నాము.

## స్త్రీలు—ప్రభుత్వ బాధ్యత

(1) ప్రభుత్వము అనగా ప్రభుత్వవిధానము మాత్రమనిగాని అమలులోనున్న అధికారవర్గమనిగాని అర్థముకాదు.

(2) ప్రభుత్వోద్దేశము—అనారోగ్యము, అజ్ఞానము, కరువు, కల్లోలము అను నీ నాలుగు పీడల బాధపడకుండ ప్రజలను కాపాడుట.

(3) ప్రజలను ఈ అపాయములనుండి తొలగించి కాపాడుటకు చట్టములద్వారా ఈదిగువ నుదహరించిన విషయములలో శ్రద్ధవహింపవలసియున్నది.

(ఎ) ఆరోగ్యము, అనుకూలవాతావరణము అనగా ముఖ్యముగా మంచి జనావాసములు.

(బి) విద్య.

(సి) జీవనోపాధి—అనగా మనకు కావలసిన వస్తువులను ఉత్పత్తిచేయుట. లేదా, మనకు కావలసినవానికొరకై బదలీగా ఇతరవస్తువులను తయారు చేసి యిచ్చుట.

(డి) పౌరస్వామ్యములు—అనగా వ్యక్తిస్వాతంత్ర్యమున్ను సర్వసమత్వముగల న్యాయపరిపాలనయున్ను—.

ఇవన్నియును ఇంటిలోని కుటుంబినియగు తల్లికి ముఖ్యములైన విషయములు. అవి ఆమె జీవితమును కుటుంబజీవితమును తారుమారు చేయగలవు. కనుక శాసననిర్మాణమునందు స్త్రీ జోక్యము కలుగ చేసికొనవలసియున్నది. అనగా ఎన్నికలలో తగు బాధ్యత వహింపవలసియున్నది. అట్లయినచో శాసన సభలకు తగినవారిని పంపి వారిద్వారా న్యాయచట్టములను నిర్మించి తద్వారా తమ కుటుంబ సంసారములను పైచెప్పిన నాలుగు అపాయములనుండి రక్షించుకొనగలరు. కావుననే స్త్రీ వోటరుల సంఖ్య అధికముగనుండవలయుననియు, వారు స్వతంత్రలై, విద్యావివేకవంతులై ఓట్లు నీయవలెననియు మా విజ్ఞాపనమునందు మేము ఇంగ్లాండులో మనవిచేసియున్నాము. మన పిల్లలకు చక్కనివిద్య, ఆరోగ్యము, శరీరదార్ఢ్యము జీవనోపాధి కావలయును. ఇవి లభించుట కనువైన పరిపాలనావిధానములను నిర్ణయించుటలో మన మాట చెల్లుబడియగుటకు మనకు శాసనసభలలో తగిన ప్రాతినిధ్యముండవలెను.

మన పిల్లలకు నిర్బంధ ప్రాథమికవిద్య యుండవలెననియు, పాఠశాలలలోని పిల్లల ఆరోగ్యదార్ఢ్యములను వైద్యులు పరీక్షించుచుండవలెననియు, తల్లులకును, బిడ్డలకును రక్షణకరణ్యముల నొసంగవలెననియు, పేదలకు ఆరోగ్యకరమైన వసతుల నేర్పాటు చేయవలెననియు, వైవాహికపద్ధతులను సంస్కరించవలెననియు, మనవారసత్వపు హక్కులను సంస్కరింపవలెననియు, స్త్రీ పురుషుల పరస్పరసంబంధము లుత్తమ నీతిదాయకములై యుండవలెననియు, స్త్రీలను బాలికలను వ్యభిచారవృత్తికై యుపయోగించు వ్యాపార మడుగంటవలెననియు మనము కోరుచున్నాము గదా.

## సప్తమాంధ్రమహిళాసభ ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి చుండూరి రత్నమ్మగారొసంగిన ఉపన్యాసమునందలి ప్రధానభాగములు:—

### స్త్రీ గౌరవము

మన హిందూదేశమున, నేడు నాగరిక దేశములలో వాడుచున్న (Equal rights, liberty for women.) సమాన హక్కులు, స్త్రీ స్వాతంత్ర్యము అనుపదములు మన ఇతిహాసమున కాన్పించవు. సహధర్మచారిణి అర్ధాంగలక్ష్మి అను మహోన్నతగౌరవము మన పూర్వసభ్యతలో గలదు. అట్టి అపూర్వ పూజ్యభావము, మహాపవిత్రవంతమగుస్థానము, యుగయుగములనుండి మనకుగలదు. స్త్రీల హక్కులకై కృత్రిమపోరాటము మనకు అలవాటు లేదు. మనహక్కులు పూర్వము ధర్మబద్ధమై యుండెడివి. తుచ్ఛభోగములకు, భౌతిక వ్యామోహములకు గాక మానవజీవితము ధార్మికముగ నుండెడిది. స్త్రీపురుష స్వాతంత్ర్య మనగా స్వేచ్ఛావిహారముగాదు. జీవితములో పోటా పోటీ కాదని నామనవి. ఒకరి గౌరవము నింకొకరు మన్నించుచు, ఒకరికొకరు ఆత్మసమర్పణ చేయుచు జీవిత యాత్రను ధర్మపథమున నడుపుచు మానవకళ్యాణమును సేవజేయుటయే పరమావధియని తలంచెడువారు. నేడు కనిపించు సంసారకల్లోలములు, తండోపతండములుగా ప్రత్యక్షమగు విడాకుల తగవులు, కుటుంబ నిర్వహణమున నిర్లక్ష్యభావము, స్వేచ్ఛావిహారము, మనదేశమునకు నూతనముగా దిగుమతియగుచున్న అంటువ్యాధులు.

### ఇప్పుడు

అయితే కాలము మారినది. మనకు పరాధీనత సంప్రాప్తించినది. మన సంఘములోగల ఉత్తమ ఆదర్శములు అడుగంటినవి. స్త్రీలతో సమానముగా పురుషులుగూడ అధఃపతితులైరి. ధార్మికవిద్య నశించినది. ధైర్యశౌర్య పరాక్రమములు మనల విడనాడినవి. సంఘము దురాచార భూయిష్టమైనది. సైతాను మనసంఘములో నిరాఘాటముగ రాజ్యము చేయుచున్నది. నవనాగరికతా ప్రవాహమునబడి దరిగానక మనము కొట్టుకొని పోవుచున్నాము. నేడు మనము సంఘమును సంస్కరించుటయా లేక ఇతర సాంప్రదాయములను అరువు తెచ్చుకొనుటయా అను ఆందోళనలోపడి పరితపించుచున్నాము. మనసంఘము పెడమార్గమున బడుచున్నదేమో అని సంశయించుచున్నాను.

### సంసారనిర్వహణము

విద్యావిషయములో అసలు ఇప్పటి విద్యాపద్ధతులు పురుషులకు నైతికముగను ఆర్థికముగను అనర్థదాయకముగనుండి నిరుద్యోగసమస్యను అధికము చేయుచు సేవకావృత్తికి దారిచూపుచుండ, స్త్రీలను గూడ ఆదారినే నడిపించుట ఒక గొప్ప లోపము. జీవితయాత్రలో పురుషుడు నిర్వహింపవలసిన పనులు కొన్ని, స్త్రీబాధ్యతలు కొన్ని గలవు. స్త్రీపురుషులు ఉభయులు గృహకృత్యములలోనే యుండుటయు లేక ఇవి వదలి వారు లౌక్యవ్యవహారములయందే నిమగ్నులగుటయు సంసారనిర్వహణమున కసంభవము. ఈ సమస్యనే జర్మనీదేశపు (ఛాన్సలరు) హిట్లరు ఈమధ్యపరిష్కారము చేసెను. స్త్రీలను గృహనిర్మాణమునకు రాణిగను, స్త్రీజనాభ్యుదయమునకు ఒక బ్రహ్మాండమగు శక్తిగను ఏర్పాటుచేసి పురుషులను లౌక్యవ్యవహారములయందును రాజ్యాంగనిర్మాణమునందును కర్తలుగా శాసించెను. స్త్రీలను ఉద్యోగపదవులలోనుంచితప్పించి పురుషులనిరుద్యోగసమస్యను పరిష్కరించి ఆర్య సాంప్రదాయముల ననుకరించెను. అంతమాత్రమున స్త్రీ ఇతరవ్యవహారములలో అడుగు పెట్టకూడదని గాదు. అవసరము వచ్చిన మనపూర్వభారతనారీమణులవలె సకల కార్యకలాపములలో ముందంజవేసి తమ సహజ శక్తిసామర్థ్యముల ప్రకటించగలరు.

అట్లుగాక కృత్రిమ సమానహక్కులను గృహకృత్యములను సంసారబాధ్యతను ఉపేక్షించి స్త్రీలు పూర్తిగా రాజ్యాంగవ్యవహారములలోను ఆటపాటలలోను స్వేచ్ఛావిహారములలోను తిరుగ నేర్చిన గృహములలోను బాహ్యమునను యుభయులకు పోటీవచ్చును.

సంతానమును శరణాలయములకో, బోర్డింగులకో, హోటళ్ళకో అప్పజెప్పుట, వంటయిండ్లు వంటలక్కలకు అప్పజెప్పుట, ఉదయము మిత్రగోష్ఠి, సాయంత్రము క్లబ్బులు, ఆటపాటలు, రాత్రిళ్ళు సినిమాలు, నాటకాలు, సభలు మొదలగునవి ఇప్పటి నాగరిక పద్ధతులు. ఇవే మన ఆదర్శములుగా చాలమంది భావించుచున్నారు.

ఈ ఆదర్శములకు అలవాటుపడిన స్త్రీపురుషుల మధ్య అనురాగము దూరమగుచున్నది. పాశ్చాత్య దేశములలో స్త్రీస్వాతంత్ర్యము పేరిట సంసారములు కూలిపోవుచున్నవి. ఈ సాంప్రదాయములు మన విద్యావతులగు కొందరు సోదరీమణుల హృదయములలో నాటుకొనుటవలన ఆదర్శగృహిణులని అనిపించుకొన జాలకున్నారు. పాశ్చాత్యదేశముల పీడించుచున్న మహాసంకటము నేడు మనసంఘములో ప్రవేశించుచున్నది. స్త్రీల బాధ్యత పురుషులకు, పురుషుల బాధ్యత స్త్రీలకు గలదని అందరు తెలిసికొనిన చాలును. ఒకరికి ఇంకొకరు అపకారము చేసిన దేశము కూలిపోవును. కుటుంబములు నశించును. దేశసౌభాగ్యము అడుగంటును. గాన మన సంఘమునకు సంబంధించిన వ్యవహారములోనే మనము నిమగ్నులమయి మానవకళ్యాణమునకును స్త్రీజనోద్ధరణమునకును, మనము కంకణము కట్టుకొని తక్కిన లౌక్యవ్యవహారములను పురుషులకు వదలి సంఘములో పోటీవ్యవహారములను అంతరింపజేయుట మన కర్తవ్యమని నామనవి.

## విద్య—విద్యావిధానము

ఇప్పటి పాఠశాలలలోని విద్య స్త్రీలకు నిష్ప్రయోజనకరమని అందరికిని తెలియును. సంగీతము, సాహిత్యము, చిత్రలేఖనము, చేతిపనులు, వైద్యము, శిశుపోషణ, రాట్నమున నూలుతీయుట మొదలగు విద్యలు తరగతులనుబట్టి దేశీయపద్ధతుల ననుసరించి ప్రతిబాలికావిద్యాలయములోను చేర్పవలయును. సంఘసేవ, మతవిద్య, నైతికవిద్య మొదలగునవి బాలికలకు ప్రథమమునుండి, చేర్పవలయును. ఇట్టి ఉత్తమ పద్ధతులు శ్రీశారదా నికేతనము (గుంటూరు) వైశ్యసేవాసదనము (రాజమండ్రి) మొదలగు జాతీయవిద్యాలయములలో నేర్పుచున్నారు. అచ్చట విద్యార్థినులు, సర్వవిధముల ఉత్తమనారీమణులుగ శోభిల్లుటకు ముందు గొప్ప అవకాశములు గలవు. ప్రభుత్వ విద్యాలయములలో బాలికలకు చెప్పబడు విద్యలో పటుత్వము లేదు. గాన విద్యాపద్ధతులు మారువరకును మనము ఆందోళన చేయవలయును. ఈ విద్యాపద్ధతులవలన నిస్సహాయులగు స్త్రీలు అవసరము వచ్చినప్పుడు నిరాధారలగుచున్నారు.

## విడాకుల సమస్య

విడాకులసమస్య చాలా కఠినమైనది. హిందూ సంఘములో తక్కువ కులములలో ఈ పద్ధతి స్వేచ్ఛగా నున్నను అగ్రవర్ణము లనిపించుకొనువారిలో లేదు. పూర్వము స్మృతికర్తలు ధర్మశాస్త్రములలో ఒకప్పుడు నిర్ణయించినను ఈ యుగమున కది రద్దు చేసిరి. పాశ్చాత్యదేశములలో కుటుంబములను ఈ విడాకుల చట్టమే తలక్రిందులు చేయుచున్నది. స్వల్పవిషయములలో భార్యాభర్తల మధ్య అనుమానము, అసూయతవలన సంసారములు కొంతకాలమైన నిలుచుటకు హామీలేదు. వారి దాంపత్యము భౌతిక వ్యామోహములపై ఆధారపడియున్నది. మనది ధర్మబద్ధము. అందుచేతనే జీవితాంతమువరకును అటు పిమ్మటకూడను వివాహము రద్దుకానేరదు. మన సాంప్రదాయము ననుసరించి స్త్రీపురుషుల మధ్య వివాహవిచ్ఛేదములేదు. ఎవరుకాదన్నను వీలులేదు. అయితే బహుభార్యాత్వము రద్దుచేయించిన చాలును.

విడాకులు లేనందువలన గలుగు నష్టములకంటె ఇది క్రొత్తగా తెచ్చిపెట్టుకొన్నందువలన స్త్రీలకే

విపరీతపష్టము తటస్థించునని తోచుచున్నది. కొన్ని ప్రత్యేక కారణములవలన విడాకులు అంగీకరించినను ఆ ప్రత్యేక కారణములు ఇవియని నిర్ణయించుటకు ధర్మసందేహము కలుగును. పాశ్చాత్య దేశములలో విడాకుల దావాలు నిత్యము మనము చూచుచున్న సివిలు క్రిమినలు దావాలకు రెట్టింపు ఉండును. విడాకులవలన సంసారకల్లోలములు, కన్నబిడ్డల యధోగతి అటులుండ వెనుకటికన్న ముందు హాయిగా నుండగల హామీ యుండుట అరుదు. పాశ్చాత్య దేశములను ఈ విడాకులు కలవరపరచుచున్నవి. విడాకులు లేనందువలన ఏకొద్దిమంది స్త్రీలో బాధపడినను మొత్తముమీద ఈపట్టు ముండుటవలన చాలా అనర్థకమని తోచుచున్నది. అంతమాత్రమున స్త్రీ స్వాతంత్ర్యమునకు భంగమని తలంచుటకు వీలులేదు. మహా విద్వాంసులును అనుభవజ్ఞానులును శాస్త్రవేత్తలును అగు స్త్రీ పురుషులు సమావేశమయి చర్చించి సూక్ష్మముగా యోచించిన మీదట ధర్మనిర్ణయమునకు రావలసిన మహాసమస్యగాని మనము సభలలో చేతులెత్తి అవునని కాదని నిర్ణయించదగిన విషయము కాదు. ♦ ♦ ♦

### సంస్కరణవిధానము—సంఘసేవ

ఉత్తమాదర్శములకు ఆటపట్టయిన మన సంఘమును విపరీతభావములతోను, విలక్షణసంప్రదాయములతోను, తారుమారు చేయుటకంటె ప్రస్తుతము సంఘములో ఉన్న లోపముల సంస్కరించిన చాలును. ఇట్టిపనికి విద్యావంతురాండ్రును సంఘాభిమానమును దేశాభిమానమునుగల యుత్సాహవంతురాండ్రగు స్త్రీలును, పురుషులును గావలయును. ప్రతి జిల్లాలోను, స్త్రీ విద్యానికేతనములు, అనాధశరణాలయములు, వైద్యాలయములు, శిశుపోషణాలయములు, వ్యాయామసంఘములు, పారిశ్రామిక విద్యాలయములు, సేవాసమితులు, స్త్రీలే ఏర్పాటుచేసి నిర్వహింపవలయును. స్త్రీ జనాభ్యుదయమునకు పత్రికలు, పఠన మందిరములు నెలకొల్పవలయును. స్థిరసంకల్పులగు సోదరీమణులు దేశాభ్యుదయమునకు తోడ్పడవలయును. ♦ ♦ ♦

### తృతీయ గంజాం మండల మహిళాసభ

ఈసభ 16, 17 వ తేదీలను, విద్యావతియు, సుగుణవతియు, సంఘసంస్కర్త్రియునగు శ్రీమతి టి. సరస్వతీబాయి, ఎమ్.ఎ., ఎల్.టి. గారి యాధిపత్యమున జయప్రదముగ జరిగినది. సంఘాభిమానులగు పెక్కుమంది స్త్రీలు సభ నలంకరించిరి. ప్రార్థన గీతములతో సభ ప్రారంభింపబడెను. ఆహ్వానసంఘాధ్యక్షురాలగు శ్రీమతి ఉప్పల సుందరమ్మగారి యుపన్యాసము, కార్యదర్శి నివేదిక యైనపిమ్మట, ఈదిగువ తీర్మానములు ప్రధానముగ చర్చింపబడెను.

(1) ప్రతి గ్రామమునను, ఒక్క పాఠశాల యందే బాలబాలికలకు నిర్బంధోచిత ప్రారంభవిద్య నేర్పుటకై స్త్రీ యుపాధ్యాయినులే యుండవలెను. (2) ఆంధ్రరాష్ట్రమునకు ప్రత్యేక స్త్రీ కళాశాల మిక్కిలి ఆవశ్యకము. (3) అంతకంతకు ప్రజలలో ఆరోగ్యము క్షీణించుచున్నందున ప్రతి యూరునందును, పబ్లిక్ పార్కులకు వ్యాయామముకొఱకై విశాలస్థలమును ప్రత్యేకించవలెనని స్థానిక సంస్థలను కోరుచున్నాము. (4) ప్రతి తాలూకా ముఖ్యపట్టణమునకు ఒక స్త్రీ సబ్ అసిస్టెంటు సర్జను, ఇద్దరు ట్రైన్డు మంత్రసానులు ముఖ్యావశ్యకము. (5) మన దేశములో తయారైన వస్తువులనే యుపయోగించుచు ముఖ్యముగ ఖద్దరునే ఉపయోగించవలెను. (6) బాల్యవివాహనిషేధ చట్టమగు శారదాచట్టము అమలుపరచుటలో తృప్తికరముగ లేనందున ఇంకను శిక్షాశక్తులు బలపరుపవలెననియు, చట్టమునకు వ్యతిరేకముగ నడచుచున్న ప్రతివ్యక్తిని బద్ధులగునట్లు కృషిసలుపవలెననియు, అందువిషయమై విధించబడిన జరిమానా సొమ్ము సంఘముకొఱకై వినియోగించవలెననియు కోరుచున్నాము. ♦ ♦

### మైసూరురాష్ట్రమున పంచవర్షప్రణాలిక

మైసూరు రాష్ట్ర మహిళాసభ నవంబరు మొదటి వారములో జరిగెను. శ్రీమతి కమలమ్మ దాసప్ప

గారు రాష్ట్రములో స్త్రీ సమాజములను వ్యాపింపజేయుట కొరకు పంచవర్ష ప్రణాళికలను ప్రభుత్వము ప్రవేశపెట్టవలెనని యొక తీర్మానమును తెచ్చెను. ఎనమండ్రుగురు పట్టభద్రురాండ్రను ప్రభుత్వమువారు జీతములిచ్చి యీపనికై నియోగించవలెననియు, యీ యెనమండ్రుగురును యెనిమిదిజిల్లాల ముఖ్యపట్టణములలో మొట్టమొదట స్థిరపడి స్త్రీ సమాజములను స్థాపించి వానిద్వారా భజనలు, హరికథలు, సంగీతపు తరగతులు జరుపుచు, పేదవారికి పరిశుభ్రజీవనము నడుపు మార్గములను బోధించవలెననియు; ఇదేసమయమున కొందరు సమీపపట్టణములవనితలకు ఇట్టి పనులను తమ పట్టణములయందు జరుపుటకు తగిన శిక్షణము నొసగూర్పవలెననియు; జిల్లా ముఖ్యపట్టణములలో పని నేర్చినతరువాత తాలూకా ముఖ్యపట్టణముల కేగి యిట్టి పని జరిపించవలెననియు; ఇట్లు రాష్ట్రమంతట నొక్కయెత్తున పని సాగింపవలెననియు; ఇందునిమిత్తము సంవత్సరమునకు రు. 5000 లు శాంక్షను చేయవలెననియు ప్రతిపాదించెను. ప్రస్తుతము యేవో కొన్ని ముఖ్యపట్టణములలో పెద్ద యుద్యోగస్థుల భార్య లిట్టిపనులు ప్రారంభించుచున్నారనియు, వారికి బదిలీకాగానే సమాజములు సన్నగిల్లుచున్నవనియు, ఇట్టి ప్రణాళికను ప్రారంభించినచో శాశ్వతముగు పని జరుగుటయేకాక ఉత్తమ విద్యావతులలోగల నిరుద్యోగసమస్యకూడ కొంత వరకు తొలగుననియు ఆమె యుపన్యసించెను. ప్రణాళిక అంగీకరింపబడెను.

## క్రొత్త రాట్నము

—:o:—

యంత్రము లోకమైపునుండి విజృంభించుచు వేనవేలు ప్రజల నిర్వ్యాపారులుగను నిర్ధనులుగను దుఃఖభాజనులుగను జేయుచున్న యీ సమయముననే గృహపరిశ్రమల కెల్ల తల్లివంటి రాట్నము క్రొత్త క్రొత్త కళలను దాల్చి ఆకర్షణీయమై భారత గృహిణీమణుల హస్తపద్మముల నలరార యత్నించుచుండుట యెంతయు శుభావహము. రాట్నమును గూర్చి యిదివరకు ఆక్షేపించిన వారందరును అది సన్నని దారమును తీయజాలదనియు, వేగముగా నెక్కువదారము ముత్పత్తికాదనియు, ఆ కొంచెము దారము వలన పని చేయువారు పడెడి శ్రమయే కనిపించును కాని వారికి లభించు కూలి కనిపించదనియే కదా! ఈ మధ్యను రాజగోపాల మొదలియారను నొక బెంగుళూరు యువకుడు క్రొత్త పరిశోధనలు చేసి కనిపెట్టి నిర్మించిన రాట్న మిట్టి లోపములను పూర్తిచేయుచున్నది. చూచుట కదియొక గ్రామఫోనువలె మిగుల రమణీయముగ కనిపించును. మామూలు రాట్నముకన్న యిది యెక్కువ రమణీయమైన దారమును తీయగలదని అఖిలభారత చరఖాసంఘకార్యదర్శి శ్రీయుత శంకరలాలు బ్యాంకరుగారు చెప్పుచున్నారు. వారముదినములు తరిఫీదుపొందిన వెనుక యెట్టి ముసలమ్మయైనను దీనిపై దినమునకు 1000 గజముల దారమును తీయగలదట. సాధారణరాట్నము మీద 50 గజముల కంటె నెక్కువదారము వచ్చుట కష్టము. రాట్నము వడకబడగానే తనంతటతానే కండెకు చుట్టుకొనిపోవును. అలహాబాదు ప్రదర్శనములో ఇది మిగుల ప్రశంసగాంచినది. 10, 20, 30, ఏ నెంబరు నూలు కావలసిన ఆ నెంబరు నూలే తీసుకొనుట సాధ్యము. మదరాసులో డిశంబరులో జరుగనున్న స్వదేశీవస్తు ప్రదర్శనములో నిది ప్రదర్శింపబడును. మైసూరు వాణిజ్యపరిశ్రమల డైరెక్టరయిన సర్. సి. వి. రామనుగారు దీనినిగూర్చి మైసూరు ప్రభుత్వమువారితో సంప్రతించి సర్వవ్యాప్తముగ ప్రయత్నములు చేయుచున్నారు. ఇట్టి రాట్నములు సర్వసామాన్యములగు నెడల మిల్లులు వీటితో పోటీ చేయగలవనుటకల్ల. ఖాదీదీక్షాపరతులగు ఆంధ్రమహిళామణుల కిట్టి రాట్నము కొంగుబంగరు వంటిదికదా!

సప్తమాంధ్రరాష్ట్రీయమహిళాసభలు



అధ్యక్షురాలును, ఆహ్వానసంఘమును



'ఎండలోకొస్తే చలిలేదుకదూ!'



## శ్రీమతి జయంతి దేవిగారు

శ్రీయుత బాబు కాశీనాథుగారి పుత్రికామణి. ఈమె వయస్సు 7 సంవత్సరములు. అలహాబాదులో కొలదిదినములక్రిందట ఓరియంటలు క్లబ్బువారు జరిపించిన 11-వ యీతపోటీ పరీక్షలో చక్కని చిత్రములు చేసి చూపినది. యమునానది నీపై (మధ్య క్షణమాత్రమును అలసట తీర్చుకొనకుండా) రెండు పారులీదినది. ఈమెను కాళ్ళుచేతులు కదలకుండా కట్టి 12 అడుగుల ఎత్తునుండి నదిలోనికి త్రోసి వేయగా ఊపిరిబిగపట్టి చాలాలోతుకుపోయి తిరిగి పైకి తేలినది. 1931 లో కాశీలో జరిగిన యీత పోటీలో ఈమె రెండు వెండిపతకములను, ఒక బంగారు బ్రోచిన్ని బడసినది. ఈమె గంగానది యావలఒడ్డుకు ఈదుకొనివెళ్ళి వెంటనే యీవల ఒడ్డుకు రాగలదు.

# బాలవిజ్ఞానశాఖ

## పిల్లలు పాటలు

గోపరాజు రాజప్పగారు

౧

తుమ్మచెట్టుమీఁద గెద్దవాలింది
తుపాకితేరా పడగొడదాము
తప్పకుండ లెక్కపెడితె ముప్పయ్యొక్కటి.

౨

చెంచమ్మమాయింట గెంతువేసింది
చెలువుల్లనాయుడూ గొడుగు తెచ్చాడు.
గొడుగుకీ మువ్వల్ల గూడుకట్టారు
గూడులో మాతాత పెళ్ళిచేసారు
పెళ్ళికేమేమంత విందుకొచ్చాము.

* * *

౩

విందులూ గోవిందుల్లు
విద్యార్థుల చదువుల్లు
చదువుల్ల తెలువుల్లు
తెలువుల్ల తేటల్లు

* * *

మాటల తేటలు మాయింట
మాపిటిభోజనం మీయింట.

## మసిపూతమహర్షి కథ

కవితిలక పులవర్తి కమలాదేవిగారు

నారచీరెల ధరించిన సీతను రామలక్ష్మణులను గాంచి మిక్కిలి చింతాక్రాంతచిత్తయై "తండ్రీ! రామచంద్రా! ముల్లోకముల నేలవలసిన నీకు కట్టడినై యెట్టి యిక్కట్టును దెచ్చిపెట్టితిని. నాజన్మంబు కాల్పనా? ఇపుడే నీపాదంబులచెంత యీతనువు విడచి నాపాపంబును కొంత బాపుకొందును" అనెను. ఏకాంతమున రామచంద్రుడామె కిట్టులనియె "తల్లీ! శోకింపనేల? దుష్టులగు ఖరదూషణ రావణాదుల సంహరింపవలసి యున్నయది. నాసంకల్పబలమున కావాణి నీనోట యామాటల బల్కించినది. ఇది దేవ రహస్యము. చింతిలక సుఖంబుండుము." నాపుడు నాచిగురుబోడి "రామచంద్రా! ఎంతపని యొనర్చితివి. ఈ అనల్పమగు నిందకు అభాగ్యురాలనగు నేను దప్ప ఎవ్వరు నీకంటికి గాన్పింపరైరా" యనిన రామచంద్ర మూర్తి దరహసితవదనారవిందుడై "తల్లీ! ఎవరి కర్మకు వారే బాధ్యులు. నీతలవ్రాత యట్లుండ నే నేమి చేయుదు. చిన్నతనంబున దూర్వాసమహర్షి మీయింటి కరుదెంచి మీతండ్రివలన పూజింపబడినవాడై మీనగరి యందు విడిసియుండెను. అతడు సమాధినిష్ఠ నున్నతరి బాలికవగు నీవు కొంటెతనమున నాతని మొగమునకు మసిరాసి యాతడద్దాని నెఱుంగునో లేదో యని తమాషా చూచుచుంటివి. ఆసంయమీంద్రుడును సమాధినుండి మేల్కాంచి భిక్షకై యూరిలోని కరుగ నెల్లరు మసిపూయబడిన యాతని మొగమును గాంచి మసిపూతమహర్షి యరుదెంచినాడని తమలో తాము నవ్వుకొనుచుండిరి. తనను జూచి ప్రజలు వింతపడుట కాబుసి, కారణ మెఱుంగజాలక దివ్యదృష్టిని జూచి నీవు మొగమునకు మసిరాయుట నెఱింగి కోపోద్దీపిత మానసుండై దుష్టురాలా! ఎవ్వరికే నేయపకార మొనరింపక తపోవృత్తి నుండు మావంటి మునుల మొగమునకు మసిరాయుదువా? కానిమ్ము. నీవు పెద్దదానవైన పిమ్మట అఖండకీర్తిని తేజరిల్లు సమయమునను కీర్తికి గూడ మసిగలిగి ఎల్ల జనులచే నతినీచముగ చూడబడుదువు గాక. తరతరములవారు నిన్ను దూషింతురుగాక. అంతవరకు నీ కీపాగరడగదు యని శపించినాడు" అని నుడివిన యామె విచారింపుచు జనియెను.

# పాకకళ

## — పొదీనాపచ్చడి చేయువిధము —

ఒక కుటుంబమునకు తగినంత పొదీనా ఆకును తెచ్చి కాడలు పురుగులు గడ్డి మొదలగునవి ఏరి బాగుగా కడిగి ఒకగిన్నెలో వుంచుకొనవలెను. మూకుడు పొయ్యిమీద పెట్టి 4 గంటెల నూనెవేసి బాగుగా కాచవలెను. కాచినపిమ్మట 1 తులము మెంతులు, 1 తులము మినపపప్పు, 2 తులముల మిరపకాయలు, ½ తులము ఇంగువ, 1 తులము వుప్పు, 2 తెల్లని వుల్లిపాయలు, 1 తులము చింతపండు ఇవన్ని మరగిన నూనెలోవేసి వేచవలెను. కొద్దిగా వేగినపిమ్మట ఈ ఆకునుకూడ వాటిలోకలపి వేయించి ఎర్రగా వేగిన పిమ్మట దించి రోటిలోవేసి కొంచెమునీళ్లు చల్లుతూ రుబ్బవలెను. మెత్తగా రుబ్బినతరువాత ఒకగిన్నెలో వుంచి భోజనసమయమందు ఒక చిన్నగరిటెడు వేసి భోజనంచేసిన చాలా రుచిగానుండును.

—బచ్చు బేబిసీతమ్మ.

## — గుమ్మడిపువ్వుల పకోడీలు —

బియ్యము నానబోసి ప్రత్యేకముగా ముందు రుబ్బియుంచుకొనవలెను, తరువాత నీరుల్లిపాయలు, పచ్చిమిర్చి, కొత్తిమీర, తగుమాత్రము ఉప్పువేసి యొక మోస్తరు కలయదంపి అముద్దను బియ్యపుపిండిలో కలుపవలెను. వాడనటువంటి గుమ్మడిపువ్వులను అవసరమైనన్ని కోసుకొనివచ్చి వాటిమీద పురుగులు మొదలగునవి లేకుండునట్లు చూచి, అవి కడిగి, వాటికాడలను పూర్తిగా తునిమివేయవలెను. పువ్వులకు చుట్టును ఆకుపచ్చని పొడుగుపాటి సన్నని రేకులు (రక్షకపత్రములు) అంటిపెట్టుకొనియుండును. అవియు, పువ్వులలోగల బొడ్డును తీసివేసి మిగతా భాగమును పైనుదహరించిన పిండిలో ముంచి మరగించిన మంచి నూవులనూనెలో దోరగా వేగునరకును యుంచి తీసివేయవలెను. ఈ మోస్తరుగా తయారైన పకోడీలు చాలా రుచిగానుండుననుటకు సందియము లేదు.

—కె. చూడామణి.

## — నిమ్మపండ్ల హల్వా —

25 నిమ్మపండ్ల రసమును శుభ్రముగా వడియగట్టి ఒక కళాయిపాత్రలో బోసియుంచి, అర్థ శేరు తీయని ఆవుపెరుగులో 20 తులముల కలకండపొడియును, 5 తులముల వేచిన సెనగపప్పు పిండియును, 5 తులముల బాదంపప్పు పిండియును, 10 తులముల పిస్తా, అక్రోటువిటిపిండియును, 3 తులముల దాల్చన చెక్కపొడియును వేసి కలుపవలయును; తరువాత అర్థ శేరు నేయి పొయిమీదబెట్టి చక్కగా మరుగుచున్నప్పుడు ముందుగా మసాలాలుకలిపిన పెరుగు బోసి కొంచెము నేతిలోవేసిన 5 తులముల గోధుమ రవకూడా వేసి కలియబెట్టుచు, నిమ్మపండ్ల రసమును కొంచెము కొంచెముగాబోసి త్రిప్పుచుండవలయును. ఇట్లు చేయుచున్నప్పుడు దానినుండి చక్కని సువాసనవచ్చుటను గనిపెట్టి అర్థపావు ప్రశస్తమగు తేనె ధారగా విడువవలయును. అవసరమని తోచినయెడల కొంచెము నేయి చేర్చవచ్చును. గడ్డకట్టిన వెనుక చీలికలుగాచేసి భుజింపవచ్చును.

—శీలా అప్పలకొండ.

## తాంబూలమునకు మంచి సున్నము

వడియకట్టిన రాతిసున్నము 1 తులం, పచ్చకర్పూరం ¼ తులం, కొద్దిగా రోజా లేక పసుపు రంగులో మీ కిష్టమైన మిఠాయిరంగు సుమారు 1 గురిగింజయెత్తు చాలును. కలిపి మెత్తగానూరి వాసన పోకుండునట్లు బెడగ్ప మూతిగల సీసాలో జాగ్రత్త చేయవలెను. ఇది తాంబూలములో వాడుటకు మిక్కిలి అనుకూలముగానుండును.

—యు. సత్యబాల సుశీలాదేవి.

# వివాహవిశేషములు

సత్తెనపల్లి తా॥ మాదల గ్రామ వాస్తవ్యులు వంగిపురపు యల్లమందయ్యగారి కుమారుడు 18 యేండ్ల వయస్సుగల కోటీశ్వరరావుగారికిని, పెదకూరపాడు వాస్తవ్యులు కోనూరు సుబ్బయ్యగారి కుమార్తె 14 యేండ్ల వయస్సుగల బాలవితంతువు శ్రీమతి యీశ్వరమ్మగారికిని 11-11-33 తేదిని వివాహము జరిగెను. విధవావివాహోద్యమము పల్లెల గ్రామములలోని వైశ్య బ్రాహ్మణకులము వారిలో కూడ వ్యాపించుచున్నదనుట కిది ప్రబల నిదర్శనము.

గోదావరిజిల్లాలో శారదావివాహ చట్టము సక్రమముగా పని చేయుటకు సంఘసంస్కరణాభివృద్ధి సమితి నొకదానిని ఏర్పాటుచేసిరి. దీనికి అవసరాల రామారావుగారు అధ్యక్షులుగాను, పెద్దాడ సుబ్బమ్మగారు ఉపాధ్యక్షులుగాను కవికొండల వెంకటరావు డామెర్ల కమలారత్నమ్మగారు సంయుక్త కార్యదర్శులుగను ఎన్నుకొనబడిరి. వీరు ఇతర విధములగు సాంఘిక సేవలను గూడ ఒనరింతురు.

మైసూరు సంస్థానములో తుముకూరు అను నగరమునందు జరిగిన స్త్రీలసభలో "బాల్యవివాహములు జరుగకుండా ప్రభుత్వము నిరోధచర్యలు తీసుకొనవలె"నని యొక తీర్మానము తేబడెను కాని, అధిక సంఖ్యాకులు దానిని అంగీకరించలేదు. కాని శ్రీమతి లేఖావతి (పంజాబు శాసనసభాసభ్యురాలు) గారి అధ్యక్షతక్రింద సమావేశమైన అత్యధిక సంకుచిత స్వభావులైన మారువాడీ వనితల మహాసభవారు దీనిని కొంతవర కంగీకరించిరి. బొత్తిగా అంగీకారయోగ్యము కాని వివాహములను నిరోధించుటకు జిల్లా కలెక్టరుకు అధికారముండవలెనని తీర్మానించిరి.

జర్మనీ దేశములో సామాన్య కుటుంబములలోని కొందరు స్త్రీలు తమ పేరులకు గొప్పకుటుంబముల వారి పేరులు చేర్చుకొనుటకుగాను పెద్దకుటుంబములలోని పురుషులకు కొంత ధనమిచ్చి వివాహము చేసికొనుచున్నారు. మరియు కొందరు పెద్దకుటుంబములలోని పురుషులు తమ కుటుంబముల పేరును సామాన్యులకు చేర్చుటకుగాను ధనమిచ్చి పేదల పిల్లలను కొనుక్కొనుచున్నారు. ధనమిచ్చి కుటుంబపు ఘనతలను కొనుక్కొనుటయు, వ్యాపించుటయు ఇట్టి పద్ధతిని రద్దుచేయుచు జర్మను ప్రభుత్వము వారొక క్రొత్తశాసనమును చేసిరి.

ప్రపంచములో జనసంఖ్య వృద్ధియగుచున్నది, ఆహార పదార్థముల సంఖ్య తగ్గుచున్నది గనుక సంతాననిరోధ పద్ధతులు అవలంబించియు, వివాహములు మానియు జనసంఖ్య తక్కువ చేసుకొని, ఆ తక్కువమంది ప్రజలును ఆయురారోగ్య ఐశ్వర్యములతో తులదూగవలెనని అర్థశాస్త్రవేత్త లోకమైపున మెంచపెట్టుచున్నారు. వైద్యశాస్త్రజ్ఞులు ఉపాయములు కనిపెట్టుచున్నారు. కాని ఇటలీ జర్మనీ దేశములలో ప్రస్తుత జనసంఖ్య చాలదని చెప్పి ముసోలిని, హిట్లరుగార్లు వివాహముల నభివృద్ధిపరచి, సంతానమును ప్రోత్సహించి, అవివాహితులకు పన్నులను విధించుచున్నారు. అక్టోబరు 30-వ తేదిని రెండువేల కళ్యాణముల నేకముహూర్తమున రోము నగరమున జరిపించి దంపతుల కందరికి ముసలోనిగారు కళ్యాణకట్నములను బహుమానములను చదివించినారు. దంపతు లందరు నగరవీధులలో మహోత్సవముతో నూరేగింపఁబడిరి. ఇదిగాక నామకరణోత్సవమింకొకటి యేర్పాటు చేయఁబడుచున్నది. క్రొత్తగా పుట్టిన పిల్లలందరికి నామకరణమును, బహుమాన ప్రదానమును, తలిదండ్రులకు కట్నములును జరిపింపఁబడును. జర్మనీకి ముఖ్యనగరమగు బెర్లినులో గూడ నాజీపాలకు లిట్టి మహోత్సవములు జరిపించుచున్నారు.

# హరిజనాభ్యుదయము

మహాత్ముడు హరిజనోద్ధరణమును సాగించు నిమిత్తము తన సంచారమును ప్రారంభించెను. 7 వ తేదిని వార్ధానగరమున లక్ష్మీనారాయణ దేవాలయమును హరిజనుల నిమిత్తము తెరచెను. హరిజనోద్ధరణోద్యమ మత్యుత్కృష్టమైనదనియు అందుకొరకు కావలసినచో తన ప్రాణములనైన నర్పింతుననియు ఆతను చెప్పెను. రు 220 లు ధనము వసూలయ్యెను. 8వ తేదికి నాగపురమువచ్చెను. వారిని దర్శించుటకు 5000 ప్రజలు పురిపరిసరమువచ్చి యెదురుసన్నాహ మొసగిరి. విస్తార ధనము వసూలయ్యెను. పేదవారిచ్చిన నగలు విక్రయించుటవలన 100 రూపాయలు లభించెను. హరిజనులు త్రాగుడును జూదమును వర్జింపవలెనని మహాత్ముడు హెచ్చరించెను. ఇట్వారీలో ఖద్దరు దుకాణమును నూతులను తెరచెను. వంతోలీ నివాసులు రు 1000లు నొసగిరి. ప్రజలు సమర్పించిన ఆభరణములకు రు 400లు లభించెను.

11 వ తేదిని దియోలి గ్రామము చేరెను. అక్కడ ఒక వైష్ణవమహామ్మదీయుని జ్ఞాపకార్థమొక దేవాలయము కలదట. అతని వృత్తి దూదులు వడకుటయట. ఆ దేవాలయమును హరిజనులకు తెరచుటకు అనేకులు సవర్ణు లంగీకరించిరి కాని కొంతమంది ట్రస్టీలు ఒప్పుకొనకపోవుటచేత మహాత్ముడు తెరవలేదు.

11, 12 తేదిలను మహాత్ముడు విశ్రాంతి చెందెను. 13వ తేదిని హింగిన్‌ఘాట్లులో హరిజనుల నివాసములను సందర్శించిరి. కీర్తిశేషులగు జయరామ్ గారి సతీమణి కాసీబాయిగారు హరిజనుల ఉపయోగార్థము 1000 చదరపుటడుగుల విస్తీర్ణముగల భూమి నొసగెను. బహిరంగసభకు 15000 జనులు వచ్చిరి. పెక్కు విరాళములు వసూలయ్యెను.

14 వ తేదిని మౌల్ అను గ్రామమునకు వెళ్లిరి. అక్కడ వసూలయిన ద్రవ్యము హరిజన సమితి కొసగబడెను. అచ్చటనుండి సవాలి వెళ్లి అచ్చట జరుగుచున్న ఖద్దరు పరిశ్రమను ఆలకించిరి. అచ్చట 66 గురు తప్ప తక్కిన పనివాండ్రందరును హరిజనులే. వారు దూదిఏకుట మొదలు వస్త్రముల నేతవరకు అన్ని పనులు చేయుదురు. ఇక్కడ జరుగుచున్న పనివలన 700 చదరపుమైళ్ల వైశాల్యముగల 140 గ్రామముల లోని 2800 ప్రజలకు వృత్తి లభించుచున్నది. పుర మందిరము సభకు 7000 జనము వచ్చిరి. రు. 361 లు వసూలయ్యెను. అచ్చటనుండి వరోరా అను గ్రామమునకు వెళ్లెను. ఆరోగ్యము బాగుగానున్నది. తూనిక 108 పౌనులు. ఇచ్చటి హరిజనులు చచ్చిన జంతువుల మాంసమును తినుటను విసర్జించినారు. సవాలినుండి చాందుపురము వెళ్లిరి. ఈ పుర పురపాలక సంఘమువారు ఖద్దరు ఉత్పత్తికై యేట రు.500లు యిమ్మనియు, ఖద్దరువృత్తిపై పన్నులను తొలగించినారు. ఇచ్చటనున్న మహాకాళీ దేవాలయమును వేలకొలది గాండులను జాతివారు వచ్చి పూజలు చేయుచుందురు.

15 వ తేదిని చాందుపురము లేక చండనగరము నుండి వరోరాకు వెళ్లిరి. పురపాలక, తాలూకా బోర్డు సంఘములవారు హరిజననిధికి విరాళముల నొసగిరి. అక్కడనుండి ఆనీగారి జన్మస్థలమగు వన్ నగరమునకు వెళ్లిరి. అచ్చటి ప్రజలు రు. 300లు విరాళ మొసగిరి. అక్కడనుండి ఆరోవ్మల్ నగరమునకు వెళ్లి హరిజన వసతిగృహము మొదలగు సంస్థలను దర్శించిరి. పురపాలకసంఘమువారు వెండిపెట్టెలో నొక సమ్మానపత్రము నిచ్చిరి. బహిరంగసభకు 15000 జనము వచ్చిరి. దూరశ్రవణయంత్రము లుపెట్టబడెను. రు. 1001లు వసూలయ్యెను. వెండి పెట్టెయు నగలును వేలము వేయబడెను. 16వ తేదిని అమరోటి కెళ్లిరి. అక్కడ రు. 1200 లు జమయయ్యెను.

నవంబరు 7 మొదలు 11 వ తేదివరకు జరిగిన 5 దినములలోనే హరిజననిధి రు. 14812 చేకూరినట్లు తెలియుచున్నది. ప్రతిస్థలమునను నెంత ధనము వసూలైన అందులో $\frac{3}{4}$ వంతు అచ్చటనే హరిజనాభివృద్ధికై వినియోగింపబడును. మిగిలినది కేంద్రసంస్థకు యీయబడును.

# పుష్పచయము

వీనికి ప్రతిక్రియ యేమి:—

(దు : ఖి తు డు)

[ఈ యంశములు మనమనుదినమును చూచు చున్నవి. ఇందువలన ఎందరో నిరపరాధులు దుఃఖించు చున్నారు. చదువరులు వీనికి తగిన ప్రతిక్రియల నే విధముగ ఆలోచింతురో.]

(1) ......పదుమూడేండ్లమాత్రము గడచినవి. కాపురమునకు వెడలి ఎనిమిది నెలలు నిండలేదు. ఈస్వల్పకాలమున ఆమె కష్టమయజీవితము ఎవరి కైనను భ్రాంతులను చేయకమానదు. మగడు ఉన్నత హూణవిద్య నభ్యసించుచున్న నాగరికుడు. మామ గారు దేశోద్ధరణకు కంకణముగట్టి పనిచేయుచున్న ప్రతిఫలావాంఛితుడు. తండ్రి అధికార కావరమున ఒడలు తెలియక సహస్ర ప్రపంచకమును గ్రుమ్మరించి పెండ్లిచేసిన అవివేకి. ఇప్పటి ఆమెస్థితి యిది. మగడు ఆమెను పశువును కొట్టినట్లు కొట్టును. మామగారు గాని, ఇంటనున్న యితరులుగాని అతనిని వారింపరు. ఈ స్థితిలో ఆమెకు నెలతప్పినది. శారీరకముగ గాని, మానసికముగగాని ఆమెకు శాంతిలేదు. పుట్టినింటికి పంపుటకు నిరాకరించిరి. విషయములను నేను నిరాడంబరముగ ఉన్నవికూడ కొంతవరకు తగ్గించి చెప్పితిని.

(2)......తెలివిగల పడుచు. విద్యావతి. వినయ సంపన్న. ఆమె భర్తకూడ విద్యావంతుడు. పట్టభద్రుడు. ఇరువుర తల్లిదండ్రులకును వివాహ సమయమున కలిగిన—కట్నము కానుకల సందర్భమున నే—పొరపు లంతకంత కతిశయించుటచే కుమారునకు మరలవివాహమైనది. రెండవ వివాహమునకు పూర్వము యువకుడు తన మొదటిభార్యను తీసికొనిరావలెనని నెండు ప్రయత్నములు చేసెనుగాని ఫలింపలేదు. సిధ్ధశ్రీకరులై హిందూమతమునం దున్నంతకాలము ఆ విదుషికి పునర్వివాహమునకు అర్హతలేదు. అట్టి యెడ ఆమెజీవితము అడవిగాసిన వెన్నెలవలె నిష్ప్రయోజనముగా నున్నది.

(3)...భర్తృవిహీన. ఆమె కొకకుమార్తె కలదు. అత్తింటివారు సంపన్నులు. మామగారు పిసినిగొట్టు. మరదులు భ్రాతృవాత్సల్యములేనివారు. ఆవితంతువు నకు మగనియింట నిలుచుటకు తగిన సావకాశములేక చెల్లెలియింటజేరి అస్వతంత్ర జీవనమును గడుపు చున్నది. పుత్రీపతికిబదులుగా నామె పుత్రవతియై యున్నచో నీదుర్దశ ప్రాప్తించియుండదు.

(4) .........ఆచార్యులుగారు నలుగురు ఆడు పిల్లలుగలవారు. మేకపిల్లలను అమ్మినట్లు ఆపిల్లల నందరను తలొక అయిదారువందలకును అమ్మి వివాహము చేసినారు. మొదటిపిల్లభర్త మెదడులేని శుద్ధమొద్దు. తినుటకుగూడ లేనివాడు. రెండవయామె మగడు ఆమెతండ్రికి సమవయస్కుడు. కూడని పోకడలు గలవాడు. భార్యను అనుమానించి హింసించును. మూడవవానికి యింత తినుటకు కలదు. కాని అంటురోగి. నాలుగవపడుచు మగడు నాగరికుడు. అనాచారి. పడుచు ఛాందసురాలు. ఇరువురకును నిరంతరమును కీచులాటలే. కన్యా దానము జరిగిన వివాహములకు గల దైవిక, నైతిక బలములు ఈ వివాహములకు గలవా? ఆ వధువుల నెంతవరకు బంధించును? జననీ జనకుల దురాశలకు, అవివేకములకును పిల్లలు జన్మాంతము దుఃఖించ వలసినదేనా ?

ఎస్. సత్యనారాయణరావు.

అంతర్జాతీయ మహిళాసభ:—

అమెరికా ఖండమున షికాగోనగరమున జూలై నెల కడపటివారమున ఈ సభ జరిగినది. వివిధ నాగరిక దేశములనుండి స్త్రీ ప్రతినిధు లచ్చటికి విచ్చేసి తమతమ దేశములలో కలిగిన ప్రబోధములు, స్త్రీ స్వాతంత్ర్యోద్యమ విజయములు తత్ఫలితములు మొదలగు వానినిగురించి ఉపన్యసించిరి. కెమాలుపాషాగారి నాయకత్వమున టర్కీ యువతులు ఘోషాతెరలు చించుకొని విద్యలు నేర్చి ఉద్యోగములు చేయుచు పురుషులతో సమానముగ విరాజిల్లుచున్న సంగతిని ఆదేశమునుండి ప్రతినిధిగా విచ్చేసిన సెల్మాయక్రం అనుసుదతి ఉపన్యసించెను. సభ్యురాండ్రందరును మిగుల నానందించిరి. మిగిలిన యంశములనుగూర్చి ధర్మసాధని పత్రిక యిట్లు వ్రాయుచున్నది:—

"కాని పాశ్చాత్య దేశముల ననుసరించి తమదేశములో ప్రవేశ పెట్టబడిన ఏకపత్నీ స్వీకారపద్ధతి వలన తటస్థించిన చిక్కులను తీర్చుటలో పశ్చిమ స్త్రీలు తమకు తోడ్పడవలయునని సెల్మా నుడివి నపుడు సభ్యురాండ్రు కళవళ పడిరి. అక్రమ సంతానములును, వ్యభిచారమును, స్వేచ్ఛాచారప్రియులగు యువతులును, హద్దుపద్దులేని వృద్ధబ్రహ్మచారిణిలును ఏకపత్నీ పద్ధతియొక్క ఫలితములనియు, బహుభార్యా స్వీకారమమలులో నున్నకాలములో నిట్టిసమస్యలు లేవనియు, వీనినెట్లు పరిష్కరింప వలయునో తెలుప వలయుననియు సెల్మాయెక్రం సభ్యురాండ్రను కోరియుండెను.

ప్రకృత ఆర్థిక దుస్థితికిని స్త్రీలకును గలసంబంధమును గురించి సభ్యురాండ్రు చాలసేపు చర్చించిరి. గృహమే స్త్రీయొక్క కార్యక్షేత్రమను ప్రాచీన సూత్రమును పాటించినచో ప్రపంచమును పీడించుచున్న ఆర్థిక దురవస్థ కొంతవరకు తొలగగలదని స్త్రీలు కొందఱభిప్రాయపడిరి. ఒక్క పురుషున కిచ్చు కూలితో ముగ్గురు స్త్రీలను పనికి కుదుర్చుకొనవచ్చుననియు, నిందువలన పురుషులకు పనిలేకుండ బోవుచున్నదనియు వారు తెలిపిరి. గృహకార్యముల దిద్దుకొనుచు ఇంటియందే స్త్రీలు నిలిచిపోవుచో పురుషులు పనిలేక బాధపడుట తటస్థింప జాలదు. కాని యుద్ధానంతరము తమకు లభించిన ఆర్థిక స్వాతంత్ర్యమును గోల్పోవుటకు స్త్రీలకిష్టము లేదయ్యెను. స్త్రీలకును పురుషులకును నిచ్చు బత్తెములలో నెక్కువ భేదము లేకుండునట్లు స్త్రీలకూలిని హెచ్చుచేయ వలయునని స్త్రీలలో పలువురభిప్రాయ పడిరి."

◆ ◆ ◆

దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు వ్రాసిన "అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణునితో సహాయనిరాకరణ మొనరింపు" మను గ్రంథమును విమర్శించుచు పండితగానాల రామమూర్తి, యమ్. యల్. సి.యస్.యమ్.యు గారిట్లు ఆంధ్రపత్రికలో వ్రాయుచున్నారు.

బ్రాహ్మణ సంఘము నెవరెంత బిట్టుగా దూషించి గ్రంథములు నుపన్యాసములు వ్రాసి ప్రకటించినను ప్రపంచ గురుపీఠ పట్టభద్రతకు భారతవర్షమును నేటికిని వర్హారాలిగ నొనర్చునదొక్క బ్రాహ్మణ విజ్ఞానమే యని యార్షగ్రంథములతో బరిచితులెల్లవారు నంగీకరింపవలసిన విషయము. మతసాంఘిక రక్షణకాచారము పేరిట బ్రాహ్మణధర్మము విధించిన శౌచవిధులు రాజశాసనములోనై సడల్పనర్హములు గాక జనుల నిత్య దైనందిన జీవన వ్యవహారముల ఘనీభవించి బౌద్ధుల ధర్మబోధలకు సమ్మోహము నొందకయు, ఇస్లాము మతప్రచారకుల ఖడ్గముల ఝళిపింపులకు భయపడకయు, క్రైస్తవ పాదిరీల లాలనలకు వశపడకయు బ్రహ్మసమాజ ఆర్యసమాజముల ప్రబోధములకు పరవశత్వము నొందకయు యేక

విధమున చెక్కుచెదరక హిందూసంఘమును గాపాడుచున్నవి. ఇంకను విశేషమేమనగా బ్రిటీషు రాజ్యతంత్రమువలె బ్రాహ్మణ ధర్మముగూడ ప్రతినూతనవాదమును దనలో లీనముచేసి కొనజాలిన యౌదార్యవంతము"

• • •

మొన్న మహా వైభవంగా జరిగిన కవితా సమితి తృతీయవార్షికోత్సవానికి అధ్యక్షత వహించిన శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు కూలంకషమైన అద్భుత విజ్ఞానం వెదచల్లారు. చెప్పేది భాషను గూర్చి అయినా, అనేక అంశాలు సర్వతోముఖంగా ముచ్చటించారు. అందులో వనితాలోకానికి సంబంధించిన రెండు ముక్కలు ప్రస్తరించడం అప్రస్తుతం కాదు: 1. ఆడుదానికి 'అది' అనే ప్రయోగం ఎప్పుడు పుట్టిందో, నాటినుంచీ పట్టుకుందన్నారు—మన దేశాని కరిష్టం! 2. ఏ విషయంలోనూ మగవానికున్న స్వేచ్ఛ మగువ కుండ కూడదన్నారు—ఒక్క ద్రౌపదికి తప్ప!

ముద్దా విశ్వనాథం.

## బాలికలు విద్య:—

బాలిక లజ్జావస్థనుంచి బయటపడునప్పటికి దాదాపు ఆయిదారు సంవత్సరములు వచ్చును. తల్లికి అడ్డాలలోనుంచి తప్పి, చంకనువచ్చు పసిపిల్ల అప్పటికి తయారయివుండును. తరచు మన హిందూ స్త్రీలు వూపిరాడకుండ, పండ్రెండుగంటలు గృహకృత్యములలో మునిగి తేలుదురు కాబట్టి చిన్నపిల్లలను పెద్దపిల్లల స్వాధీనపరచెదరు. ఎత్తుకొనుట ఆడించుట కొన్నికొన్ని ఇండ్లలో, పాలుపోయుట, బువ్వపెట్టుట, నీళ్లుపోయుట కూడ వారివంతే అయివున్నది. అహా! తమ శరీరమునే శుద్ధిపరుచుకొనుట, రక్షణచేసుకొనుట, చేతకాని బాలికలు శిశువుల నేమిచేయగలరు? పాపము ఇంట్లో నున్నరొడల తల్లులనుచూచి పిల్లలు ఏడ్చెదరని కాబోలు, వారు పసికూనలను పెట్టుకొని పొరిగిండ్ల అరుగులమీద నానా అవస్థలకు లోనగుచుందురు. చాలమంది తల్లులకు ఈవిషయము తెలుసును. కాని ఏమిచేయగలరు? నిజమునకు గృహకృత్యములను నిర్వర్తించుటకే వారికి వేళ చాలటములేదు. ఇంకా పిల్లలను చూచుటకు వేళ ఏది? గృహకృత్యములను, పిల్లలను, చూచుకొనగా, ఇంకా కుట్టు మొదలగు లలితకళలకు గూడ వేళ గలదని వారు తెలుసుకొనుటకు తగిన విద్యఏది?

ఇది ఇట్లుండగా బాలికను స్కూలులో చేర్చెదరు. దీనియందు శ్రద్ధ ఏమివహించిరో చూతుము. తల్లి వాకిటవున్న సెలవ, చుట్టాలువచ్చిన సెలవ, పొరిగింట్లో తద్దినమునచ్చిన సెలవ, పసుపుకుంకుమ కెళ్ళవలసివున్న సెలవ, ఇంక ననేకవిధములయిన సెలవలు తీసుకొనవలసియుండును. అసలు బాలికల స్కూళ్లే అధోగతిగా నున్నప్పుడు, (ఉపాధ్యాయులవారు బాలికల పాటలు విని ఆనదించుచూ నిద్రపోతూ వుందురు) తల్లులుగూడ శ్రద్ధ బుచ్చుకొనక ఈ విధముగా జరిపిన బాలికల కేమి విద్య రాగలుగును?

దుళ్ల వెంకటరత్నమ్మ.

## శ్రీమతి సుందరమ్మగారి అనారోగ్యము:—

సీతానగరం గౌతమీ సత్యాగ్రహాశ్రమ వాసురాలగు శ్రీమతి మానాప్రగడ రామసుందరమ్మగారు గత సెప్టెంబరు మాసమందు తమ శిక్షాకాలము పూర్తి కాకుండగనే ప్రభుత్వమువారిచే విడుదల చేయబడినట్లు పాఠక మహాశయులకు విదితమే? ఈమె ప్రస్తుతము పశ్చిమ గోదావరిజిల్లాయందు తన పుట్టినింట యున్నారు. జైలులో నున్నప్పటినుండి జబ్బుగా యుంటూయున్నారు. విడుదల పొందిన నాటినుండి నేటివరకు చాల అనారోగ్యముగా నున్నారు. కన్ననూరు చాల ఆరోగ్యపు దేశమైనప్పటికిని వైద్యసౌకర్య మేమాత్రము లేకపోవుటచే, కన్ననూరు స్త్రీ చెరసాలనుండి విడుదలపొందిన ప్రతి రాజకీయ ఖైదీయు నేదో విధముగా అనారోగ్యముగా నుంటూయున్నారు. ఈమె నారింజపండ్ల రసముతోనే జీవితము గడుపుచున్నారు. త్వరలో సుందరమ్మగారికి ఆరోగ్యము చేకూరుగాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

పి. జానకీదేవి.

# గ్రంథ పరిచయము

## చెన్న కేశవ శతకము

క్రౌను సైజు 17 పుటలు. 102 ఉత్పలమాల చంపక మాలలు. భక్తి, నీతి, వైరాగ్యములను బోధించును. గ్రంథకర్త శ్రీయుత జి. కృష్ణమూర్తిగారు.

## శ్రీ భక్తరత్నామణి శతకము

క్రౌను సైజు 22 పుటలు. గ్రంథకర్త శ్రీయుత సోంపల్లె కృష్ణమూర్తిగారు. శ్రీ కోదండరామ గ్రంథాలయమువారు ప్రకటించిన ప్రథమ పుష్పము. అనంతపురంజిల్లా గజలకొండలోనున్న శ్రీ సచ్చిదానంద గ్రంథాలయమువారివద్ద ప్రతులు లభించును. ప్రతియొక్కటికి వెల రు 0-2-0. భక్తి వైరాగ్యములు బోధించును.

## నీతిముక్తావళి:—

క్రౌను సైజు 24 పుటలు. 108 నీతిబోధకములగు పద్యములు గలవు. వెల రు 0-2-0. గ్రంథకర్త శ్రీయుత మంత్రిరావు వెంకటరత్నముగారు. కాకరపర్రు సరస్వతీ గ్రంథమాలవారి 32వ పుష్పము. పాఠ్యపుస్తకనిర్ణయ సభవారిచే బాలుర యుపయోగమునకు నిర్ణయింపఁబడినది.

## సంగీత సోపానము:—

క్రౌను సైజు 19 పుటలు. వెల రు 0-2-0. గ్రంథకర్త శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, శారదానికేతనము, గుంటూరు. తిక్కనకవి కుమార్తె కడాని యను బాలికయొక్క చిన్ననాటి చర్యలను తెలుపు చిన్ననాటిక. సంగీతము, లయ మొదలగువానియొక్క రహస్యము నాపై గురువుల నేర్పకముందే గ్రహించి ప్రకృతి పరవశయై ఎటుల నానందించుచుండెనో తెలియఁజేయును. బాలికా పాఠశాలలలో పైమెట్టరగతుల బాలికలు పఠించుటకును ప్రదర్శించుటకును మిగుల నుపయోగకరము.

## ముగ్ధప్రణయము:—

క్రౌను సైజు 187 పుటలు. వెల రు 0-12-0 గ్రంథకర్త శ్రీయుత కర్లపాలెం నరసింహారావుగారు. ఆంగ్లకవి షేక్స్పియరు నాటకములలో నెల్ల ప్రశస్తమైనదని పేరువడ్డ "ఒథెల్లో" యను విషాదాంత నాటకమున కనువాదము. విశేషభాగము గద్యము. శ్రీయుత రాయసం వెంకటశివుడుగారు తొలిపలుకు వ్రాసినారు. ఆంగ్లభాషా పరిచయములేనివారు దీనిని పఠించిన షేక్స్పియరుయొక్క నాటకరచనాశక్తి కొంత విశదము చేసుకొనగలరు. గ్రంథములు బెజవాడ పూర్ణానందం పేటలోనున్న శ్రీముఖాశ్రయము వారివద్ద వెలకు లభించును.

## విశ్వామిత్రమహర్షి:—

క్రౌను సైజు 121 పుటలు. వెల రు 0-8-0 గ్రంథకర్త్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు, బాపట్ల. వివిధ పురాణములలోగల విశ్వామిత్రుని చరిత్ర మెల్లయు నొంటిగాచేర్చి 20 ప్రకరణములలో వ్రాసినారు. గ్రంథకర్త్రికిష్టదైవమగు జానకీరాముల కంకితమొసగబడినది. నిర్దుష్ట గంభీర గ్రాంథిక శైలి. పుట్టుకమాత్రమున క్షత్రియుఁడైనను, జన్మవాసనాపరంపరచే బ్రహ్మత్వమువైపున కాకర్షింపఁబడిన సంకల్పములుగలవాఁడై, బ్రహ్మత్వము సాధించుటకు క్షత్రియయోగ్యమైన తపో విక్రమమునూపి, క్షత్రియజనోచితములైన ఆర్తత్రాణ పరాయణత్వము, పగసాధింపు, దీనజనోద్ధరణము, మాట పట్టుదల మొదలగు సుగుణములకొరకు అనేక సారులు తన తపో మహిమ మెల్లయు ధారపోసి, వీరాధివీరుఁడై, బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేయఁగలిగి, యోగిసత్తముఁడు కాఁగలిగిన విశ్వామిత్రునిచరిత్ర మెవరికి స్మరణీయము కాకుండును! అందును వీర్యవిక్రమములుగల వరలక్ష్మమ్మగారి లేఖిని దానిని చిత్రించినచో దాని యందము నెట్లు వర్ణింపగలము! ఆంధ్రులెల్లరును పఠించి యానందింపవలెనని మాకోరిక. యీని

పర్సిటీల పాఠ్యగ్రంథ నిర్ణయ సంఘమువారు ఉన్నత తరగతుల విద్యార్థినీ విద్యార్థులకు దీనిని నిర్ణయించిన చో వారికి శబ్దసౌష్ఠవమును, భావసంపదను, ఉన్నతాశయములను, రచనాశక్తిని పెంపొందించిన వారగుదురు.

కర్షకుని కాలగతి:—

క్రౌను సైజు 41 పుటలు. వెల రు 0-2-0. టాలుస్టాయినాటకమునకు లింగయ్యచౌదరిగారి అనువాదము. కృష్ణజిల్లా ఎలమర్రులోని ఆదర్శగ్రంథమాలవారి నాల్గవ గ్రంథము. సహజముగ నీతివంతులగు కర్షకులు మధుపానముచే ఎట్లు నీతిరహితులై నిర్ధనులై చెడిపోదురో తెలియఁజేయును. మద్యపాన నిరోధ ప్రచారకులిట్టి నాటకములాడించినచో గ్రామస్థులు బాగుపడుదురు. శైలి వ్యావహారిక భాష.

జీవనసంధ్య:—

క్రౌను సైజు 117 పుటలు. కాకరపర్రు సరస్వతీ గ్రంథమాలవారిచే ప్రకటితమైన 33వ పుష్పము. వెల రు 0-12-0. సర్కారుద్యోగస్థులకు పెన్షను పుచ్చుకున్న తరువాత కాలమును నిర్వ్యాపారముగ జరుపుట యెంత కష్టమో మొదటి భాగము తెలియజేయును. రెండవ భాగములో నతఁడు దేశ సేవారతుడగుటయు కారాగారము చేరుటయు, కారాగార విమోచనానంతరము దేశసేవాసంఘమునకు ఆస్తియంతయు ధారపోసి, సన్యసించి ఈశ్వరార్పణముగ జీవితమును భద్రాచలములో గడపుచుండుటయు ఈనవలయందలి విషయము. పిన్న పెద్దలెల్లరు పఠింపతగ్గది. సులభమైన శైలి. ఒకరీతి చక్కని సాంఘిక నవల. గ్రంథకర్త వినోదుడు.

విచిత్ర రాఘవము:—

డెమ్మీ సైజు 92 పుటలు. వెల రు 1-0-0. గ్రంథకర్తలు నరసరావు పేట వాస్తవ్యులు. శతావధానులు శ్రీయుతులు వేంకట, పార్థసారథి కవులు. గ్రంథమామూలాగ్రము పఠించుట కత్యానందముగ నుండును. సీతావివాహ ప్రయత్నముల నుండి శ్రీరాముని యరణ్యవాసానంతరము అయోధ్య చేరువరకు కల కథయంతయు ఆరంకములలో అనేక అభూత కల్పనలతో నిండి చక్కగ వ్రాయఁబడినది. రామభద్ర దీక్షితుని జానకీ పరిణయము దీనికి ప్రాతిపదికము. షేక్స్పియరు వ్రాసిన Comidy of errors కూడ కల్పనలలో దీనికి తీసికట్టని చెప్పవలెను. ఇది కవీంద్రుల ప్రథమప్రయత్న మేయయ్యుఁ నెండి స్థైర్యముకాక నిండుప్రజ్ఞను ప్రకటించుచున్నది. ఇట్టివి పెక్కు గ్రంథములు వ్రాసి ఆంధ్ర భాషాసేవ నొనరింపవలెనని వారిని హెచ్చరించుచున్నాము.

ఐరావతి:—

రంగూను నగరమునుండి ప్రతిశనివారమును చిరకాలమునుండి ప్రకటింపఁబడు ఆంధ్రపత్రిక. దీని యొక్క దీపావళిసంచిక రంగురంగుల సిరాలతో ప్రకటింపఁబడిన చిత్రవిచిత్రములగు వ్యాసములును బొమ్మలును గలిగి ముద్దులు మూటగట్టుచున్నది. రంగూన్ ఆంధ్రు లీసంవత్సరము విదేశీ బాణాసంచా కొరకు ధనము వమ్ముచేయక తగుపాటి స్వదేశీ బాణాసంచా కాల్చి, ప్రమిదె దీపములతోను అరటికంబములతోను మాత్రము పట్టణము నలంకరించి, ఖద్దరును విస్తారముగాఁగొని ధరించి మాతృదేశీయులకు కూడ మార్గదర్శకులైన సంగతి యిందలి నారదవ్యాసము, కథలు, కబుర్లు మొదలగు వానివలన విశదము కాగలదు. రంగూన్ ఆంధ్రుల యోగక్షేమములు, ఆశయములు, ఉద్యమములు మనకును, మనసంగతులు వారికిని తెలుపుచుండు యిట్టి పత్రిక ఆంధ్ర పుత్రులకెంత ఆవశ్యపఠనీయమో విశేషించి చెప్పనక్కరలేదు. మాతృదేశమునందుండు ఆంధ్రపాఠకులును లేఖకులును దీనియెడ సంపూర్ణమగు అభిమానమును నెరపుదురు గాక! చందా సంవత్సరమునకు తపాలా ఖర్చులతో కూడ రు 3-0-0 లు మాత్రమే. 233 బారువీధి, రంగూన్ నుండి వి. వి. రెడ్డిగారిచే ప్రకటింపఁబడుచున్నది.

### శశి:—

డబులు రాయలుసైజున 14 పుటల మాసపత్రిక. కవితామండలి వారిచే విజయనగరం గోవులపాల వీధినుండి ప్రకటింపబడుచున్నది. సంవత్సరం చందా వి. పి. చార్జీలుగాక సంవత్సరమునకు రు 0-10-0 అణాలు. విడిపత్రిక రు 0-1-0. 4-10-33 తేది సంచిక మా కార్యాలయమునకు వచ్చినది. సంపాదకులు త్రిపురాన వెంకటకృష్ణారావు మోటూరు వెంకటరావుగార్లు. జి. జాషువా, వఝల కాళిదాసు, ఓలేటి. సీతారామమూర్తి, పిలకా గణపతి, పురిపండా అప్పలస్వామి, మోటూరు వెంకట్రావుగార్ల భావకవిత్వముల యొక్కయు, కొల్లూరు ధర్మారావు, అకుండి సత్యనారాయణ, గొల్లకోట బుచ్చి రామశర్మ, తటవర్తి సుబ్బారావు, మల్లాది అవధాని గార్ల గద్యకవిత్వములవోలు ముద్దు కథలయొక్కయు లేతవెన్నెలలనీనుచు ఆంధ్రసారస్వతాంబరము నందగించవచ్చిన యీ శశి శుక్లపక్షచంద్రుని మాడ్కి దినదినాభివృద్ధినొంది పూర్ణపర్వమునందు గాక యని కోరుచున్నాము.

### రఘునాథ్:—

డెమ్మీసైజు 126 పుటలు, వెల రు 1-0-0. గ్రంథకర్త శ్రీయుత ఊటుకూరు సత్యనారాయణరావు గారు. క్రిష్ణజిల్లా గంపలగూడెము దరి అర్లపాడు గ్రామమునందలి సారస్వత చంద్రికాగ్రంథమాలవారి ద్వితీయ కుసుమము. విషయము వీరాగ్రేసర శ్రీ శివాజీ చక్రవర్తి చరిత్రలో నొకభాగము. అయిదంకముల నాటకము. కథానాయకుడు శివాజీ యొక్క సైన్యాధిపతియగు రఘునాథుడు. గ్రంథము దేశభక్తిని, హిందూ మతాభిమానమును, వీరరసమునందు రాజ్యతంత్రములయందు పక్షపాతమును పురికొల్పును. సరళారఘునాథుల మోహోదంతము దీనికొక శృంగారకళను గూర్చును. శివాజీ చక్రవర్తి చరిత్రలో అతని సేనానాయకుని కథానాయకునిగా చేసి శివాజీ యొక్క ప్రతాపతేజస్సులకు భంగము రానీయకుండ కథానాయకుని శౌర్యసౌందర్యముల పోషించగలుగుట కవిగారి రచనానైపుణ్యమును చాటుచున్నది. విశేషభాగము వచనమును, అనువగుపట్టులమంచి పద్యములును గలిగి మిక్కిలి ప్రదర్శనయోగ్యముగ నున్నది.

### శ్రీసత్యహరిశ్చంద్రచరిత్రము:—

డెమ్మీసైజు 65 పుటలు. వెల రు 0-12-0 లు. గ్రంథకర్త విద్యానిధి కారుమల్లి శివరామదాసుగారు, రామకోటి భవనము, కొలమంగలంపోస్టు, సేలంజిల్లా. అకలంక సత్యవ్రతుండగు శ్రీసత్యహరిశ్చంద్రుని చరిత్రము హరికథారూపమున రచింపబడినది. భక్తిరస ప్రధానము. చక్కని పద్యములు, పాటలు, తొగైరాలు కథ కపూర్వకముగు అందమును గూర్చుచున్నవి. భాగవతారు లెల్లరును పఠించి పుణ్యసమయములందు చెప్పి ప్రజల నానందపరచుట కెంతయు తగియున్నది.

### విశ్వకళ:—

ఫూలుస్కేపు 36 పుటలుగల మాసపత్రిక. శ్రీయుత కుందుర్తి నరసింహారావుగారి సంపాదకత్వముక్రింద గుంటూరునుండి ప్రతి నెల 15 వ తేదిని ప్రకటింపబడును. ఇందలి కథలయందు, పద్యములయందు, గీతములయందు విమర్శనలయందుకూడ ఒక నూతనత్వమును, జవయు కనిపించుచున్నవి. ముఖ్యముగ ప్రత్యేక......, భయభక్తులు, మార్పులు; పెద్దయెత్తు అను వ్యాసములు మనోరంజకముగ నున్నవి. చందా సం॥కి రు. 1-0-0. ప్రతి వెల రు. 0-2-0.

### ప్రాథమిక పాఠశాల:—

విద్యావిషయక మాసపత్రిక. ఉభయభాషాప్రవీణ అయినంపూడి గురునాథరావుగారిచే క్రిష్ణజిల్లా ఘంటశాలనుండి ప్రకటింపబడుచున్నది. ప్రాథమిక విద్యాసంఘములు స్థాపించవలసిన ఆగత్యమును

గూర్చియు, కేంద్రీకరణవిధానముయొక్క సాధ్యాసాధ్యములు లాభనష్టములనుగూర్చియు రెండు చక్కని వ్యాసములు అక్టోబరు సంచికయందున్నవి. మరియు కృష్ణవేణియొక్క పుట్టు పూర్వోత్తరములు, ఆరోగ్యభాగ్యము అను రెండు పెద్దవ్యాసములున్నవి. స్వకీయానుభవము లను వ్యాసము ఎట్టి బోధనాపద్ధతి అనుకూలమైనదో సోదాహరణముగ నిర్ణయించుచున్నది. సుతము, నీతి అను కథ ఆ రెండు విషయములను బోధించుచున్నది. ఇట్లు బాలురకు, ఉపాధ్యాయులకు, స్థాపకులకుగూడ మిక్కిలి యుపయోగకరమైన యిట్టి పత్రిక సకల ఆంధ్ర ప్రాథమిక పాఠశాలలవారివల్లను ఆదరింపబడవలెనని కోరుచున్నాము. చందా సంవత్సరమునకు రు. 1-8-0 మాత్రమే.

### సరస్వతి:—

ఫూలుస్కేపుసైజు 12 పుటలుగల వారపత్రిక. సంచికరూపమున వెలువడును. శ్రీయుత వెంపటి సత్యనారాయణ, బి.ఎ.,బి.ఇడి., గారు సంపాదకులు. విశాఖపట్టణము కవితాసమితి సభ్యులెల్లరును కూడ దీనిలో తమ దివ్యభావములు ప్రకటించుచుందురు. సారస్వత, చారిత్రక, సాంఘిక విషయములను గూర్చిన యిందలి వ్యాసములు చదువతగ్గవి. సంవత్సరము చందా రు. 2-8-0 లు మాత్రము.

### చిత్రగుప్త:—

ఈ పేరుగల మాసపత్రికయొక్క ప్రథమ సంచిక మా కార్యాలయము నలంకరించినది. నవంబరు మాసమునుండియు చిత్రగుప్త కార్యాలయము (సావుకారు పేట, మదరాసు)నుండి వెలువడుచున్నది. ఇది సర్వవిధములను పూర్వపు "ఆనందబోధిని" పత్రికను బురుడించుచు మించుచున్న దనవచ్చును. 'గుసగుసలు' గుల్లెక్క లాగుచున్నవి. 'కళ్లకాలు', 'మగవాళ్లకి కోజాడ్యమా' అను కథలు నీతిరహితులకు పేముదెబ్బలవంటివి. 'గానంచా రాదకేము వాదులు' వచ్చే పెడరలు శాసనసభలలో సభ్యులు ప్రవర్తించవలసిన మార్గము నుపదేశించుచున్నది. 'యుక్తమగు హాస్యరసము' పత్రికలలో ప్రకటించు పరియాచకముల ధోరణికి సవ్యమైన హద్దులను నిర్ణయించుచున్నది. ఇతర వ్యాసము లనేక అర్థిక రాచకీయ రహస్యములను తేట తెలుగుచేసి తెలియబరచుచున్నవి. వింతవింతలగు బొమ్మలు వినోదములతో విరాజిల్లుచు సంచికయెల్లయు విజ్ఞానమును వెదజల్లుచున్నది. ఆంధ్రలోకమున నిట్టి పత్రిక లేనికొఱత నిది పూర్తిచేయుచున్నది. చందా పేదసాదల కందుబడిలోనుండునట్లు సంవత్సరమున కొక రూపాయి మాత్రమే. ఆంధ్రు లనేకులు చందాదారులుగా చేరి ఆనందవిజ్ఞానములను జూరగొందురుగాక.

### మహిళాశిక్షణావిద్యాలయ వార్షిక సంచిక:-

అనంతపురం గవర్నమెంటు సెకండరీ అండు ట్రెయినింగుస్కూలు ఫర్ వుమెనువారు ప్రకటించిన ప్రథమ వార్షికసంచిక యెంతయు మనోహరముగనున్నది. దళసరి కాగితములు. చక్కని యచ్చు. ఫూలుస్కేపుసైజున 16 పుటలు ఆంగ్లవ్యాసములు, 48 పుటలు ఆంధ్రవ్యాసములు. ఇంచుమించుగా వ్యాసములన్నియు ఉన్నతతరగతి విద్యార్థినులచే వ్రాయబడినవి. చిన్నవై ముద్దులొలుకుచున్నవి. కుటుంబపు ఆదాయవ్యయములు, సినిమాయొక్క విద్యావిషయిక ప్రయోజనములు, బాలికాభటులు అను ఆంగ్లవిషయములు ప్రత్యేక ప్రశంసకు పాత్రములు. విద్యావతియగు సాంసారిక స్త్రీ దేశోన్నతి కెట్లు తోడ్పడగలదు, కులభేదము లవసరములా, అనువ్యాసములు పోటీలో గెలుపొంది బహుమానము లందినవి. పట్టు కేశవపిళ్ల గారి ప్రజాహితజీవనమునుగూర్చి ఒక చక్కని వ్యాసమున్నది. ముసలమ్మ కట్ట, చిక్కప్పరొండయరుకట్టడములు కేశవపిళ్లగారియొక్కయు పాఠశాలోపాధ్యాయినీవిద్యార్థినుల చిత్రములు దీనికి శోభనుగూర్చుచున్నవి. ప్రతి సెకండరీ పాఠశాలయు ఇట్టి సంచికలను ప్రకటించినచో విద్యార్థుల ఉపజ్ఞ రచనా నైపుణ్యము వర్ధిల్లుటకు కాటంకములేదు.

# సంపాదకీయములు

**ఆంధ్రరాష్ట్రము—శాసనసభ తీర్మానము:—**

1927, 28 వత్సరములనుండి మళ్ళీయిప్పటికి ఫికరు. అప్పుడొకసారి ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రముండవలెనని మదరాసు శాసనసభలో తీర్మానింపఁబడెనఁట. నేడు మళ్ళీ దీనితో బాటు కర్ణాటక రాష్ట్రమునుకూడ ప్రత్యేకించి నిర్మించవలసిన ఆవశ్యకతనుగూర్చి ఇండియాప్రభుత్వము వారికిని మంత్రిగారికిని తెలియఁజేసి ఒత్తిడి కలిగించ వలసినదిగా మదరాసు ప్రభుత్వమువారికి సిఫార్సుచేయుచు నవంబరు 13వ తేదిని శాసన సభాసభ్యులొక తీర్మానమును ప్యాసుచేసిరి. మదరాసు ప్రభుత్వమువారికి ఎంత యొత్తిడి కలుగఁజేసిన వారుపై వారికి ఎంత యొత్తిడి కలుగఁజేయుదురో ఊహించుట సాధ్యముకాదు. ప్రస్తుతము ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమును పూనుకొనుచో రాజ్యాంగసంస్కరణ ఆలస్యమగునను కారణమున తమ ప్రతికూలాభిప్రాయమును తెలుపుచు ఇదివరకే మదరాసు ప్రభుత్వమువారు భారత ప్రభుత్వమువారికి వ్రాసిన నివేదికయందొక గట్టిసిఫార్సుచేసి వేసినారు.

సింధు, ఒరిస్సా, సరిహద్దురాష్ట్రముల నిర్మాణమువలన రాజ్యాంగ సంస్కరణమునకు జరుగని ఆలస్యము ఆంధ్రరాష్ట్ర నిర్మాణము వల్లనే యేలకలుగునో ఊహింప తరముకాదు. ఇక జిల్లాలఆదాయము రాష్ట్ర వ్యయమునకు చాలదనువాదము నిరాధారము. ఆంధ్రజిల్లాలు పై రాష్ట్రముల జిల్లాలకంటె పేదవికావు. వానివలె కేంద్రప్రభుత్వమునుండి యొట్టివిరాళములను గొనకుండనే యీరాష్ట్ర వ్యవహారములు నడువగలవనుట కాటంకములేదు. ఇప్పుడు ప్రత్యేక రాష్ట్రము నేర్పాటుచేసినచో సరిహద్దులు ముఖ్యపట్టణము మొదలగు విషయములను గూర్చి సాంఘిక కలహములు పొడమునట. ఈసమస్యనెప్పుడు కదలించినను తాత్కాలికముగకొన్ని మనోమలికితములు కలుగునను మాట నిక్కమైనను, అనతికాలములో అవి మాయమగుననుట మాత్రము నిక్కము కాదా? రాష్ట్రవిభజన లేనప్పుడుమాత్రము ప్రాజెక్టులు ఉద్యోగములు మొదలగు విషయములలో కొంచెము పొరపొచ్చెములు లేకున్నవా? అట్టివాని కెంతవేగ మవకాశము తీసివేసిన నంతమంచిదికాదా? అయితే ఇట్టి మహాసమస్యలను వేగము తెమల్చక సాధ్యమైనంత ఆలస్యముచేయుట ప్రభుత్వముల లక్షణము కనుక ఆసూత్రము ప్రకారమే యీ ఆలస్యమును జరుగుచున్నదని మన మూహించవలెను.

ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకించుటవలన కలుగునష్టమునుగూర్చి రివెన్యూమెంబరగు సర్ ఆర్చిబాల్డు క్యాంపుబెలుగారు ఇప్పుడును, ప్రధానమంత్రి బొబ్బిలిరాజావారు మున్నొకప్పుడును వివరించియున్నారు. ఇప్పుడుఆంధ్ర తమిళ కన్నడ కేరళములు కలిసి కబంధునివలె పెద్దరాష్ట్రమై యున్నప్పుడు కేంద్రప్రభుత్వమునం దీమహారాష్ట్రమునకు తక్కినరాష్ట్రములన్నిటికంటె నెక్కువ పలుకుబడి యుండుచున్నది; ఇవి స్వతస్సిద్ధమైన వేఱువేఱు ముక్కలైనచో ఏయొక్కరాష్ట్రమునకుగాని యీపెద్దరాష్ట్రమున కున్నంత పలుకుబడి యుండదట. కలగూరగంపవలెనున్న యీ సీమలకు ఒకపెద్దరాష్ట్రముగా నున్నందువలన కలిగెడి పలుకుబడివలన కేంద్రప్రభుత్వమునుండి యేమాత్రము జాస్తి లాభము కలుగుచున్నను అది తిరిగి పంపకములో ప్రతిరాష్ట్రమునకును దానితలకు మించినదై యుండదనుట నిక్కము. ప్రత్యేకరాష్ట్ర నిర్మాణము వలదనుట కిది క్రమమైన కారణము కాదని మనము గుర్తించవలెను.

చెన్నరాష్ట్రములో చేరియుండుటవలన ఆంధ్రులకు గ్రాంటులలోనేమి, ఉద్యోగములలోనేమి, సంస్థలలోనేమి యెట్టియన్యాయమును కలుగలేదని అనేకము అంకెలనెత్తి చూపి క్యాంపుబెలుగారు నమ్మకము చెప్పుచున్నారు. వారివాదము చాలవరకుసత్యమే కావచ్చును. కొంతనష్టమున్నను, అందువలని లాభము ఇరుగుపొరుగు సోదరులకు చేరును కాని పై వారికి పోలేదనికూడ సంతృప్తిపడవచ్చును. ఆంధ్రులు తమకు గోరుచున్న భాషాప్రయుక్తరాష్ట్రము అందువలన కలుగు ఉత్సాహవికాసములకుగాని స్వల్పమాత్రములగు నిట్టి చిన్ని చిన్ని లాభములకు కాదను సంగతిని క్యాంపుబెలుగారు మరచుచున్నారు. ప్రస్తుత రాష్ట్రవిభజనము ఎట్టి సత్సూత్రముల యాధారమునను నిలువక అవకతవకగానున్నది కనుక భాషాప్రయుక్తముగ అది యుండవలెననియే వారి ప్రధానవాదము. ఈ వాదము సవ్యమైనదని మదరాసు ప్రభుత్వమువా రంగీకరించుచో, వేఱువిధములగు సాకులతో కాలయాపనము చేయక, శాసనసభవారి తీర్మానమును గౌరవించి పై యధికారుల కొత్తిడికలిగించి, ఆంధ్రరాష్ట్రము సాధ్యమైనంత వేగముగ ఏర్పడుటకు తగిన ప్రయత్నములను చేయవలసిన బాధ్యత వారిపై నున్నదనుట కాటంకము లేదు.

ఆంధ్రమహిళాసభ తీర్మానములు:—

సప్తమాంధ్రమహిళాసభ ఏలూరులో శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారి యధ్యక్షతను సమావేశమై సమయానుగుణములగు అనేక సాంఘిక, రాజకీయ తీర్మానములను గావించుట యెంతయు ప్రశంసార్హమైన విషయము. అఖిలభారత మహిళాసంస్థలు జాయింటు సెలెక్టుకమిటీవారికి సమర్పించిన నివేదిక బలపరుపఁబడినది. అతిబాల్యవివాహములు జరుగకుండ నాపవలయుననియు, శారదాకమిటీ సభ్యులు రు 100లు

ధరావత్తుకట్ట నవసరములేనట్లు చట్టము సవరణ చేయవలయుననియు, వివాహములు రిజిష్టరుచేయించవలెననియు ప్రభుత్వమును కోరనైనది. వితంతుబాలికలకు తప్పక విద్య నేర్పవలెననియు, కన్యలకిండ్లయందే పునర్వివాహములు జరుపవలెననియు ప్రజలను హెచ్చరించనైనది. వితంతు భరణములబిల్లు బలపరుపఁబడినది. తల్లిదండ్రుల,భర్తల,ఆస్తికి స్త్రీలకు వారసత్వపు హక్కుండవలెనని నిశ్చయింపఁబడినది. ఘోషాపద్ధతిని తొలగించవలెననియు, పసుపువృత్తిని నిషేధించవలెననియు, అనాథ శిశు శరణాలయములు స్థాపించవలెననియు, బాల బాలికలకు కలిపియే పాఠశాలలో విద్య నేర్పవలెననియు, స్త్రీలకున్నతవిద్య, వైద్యవిద్యగరపవలసినదనియుకూడ తీర్మానములు ప్యాసుకాబడినవి. హరిజనులకు బావులు, రేవులు, బడులు తెరచి సవర్ణుల గృహములలోనికి నౌకర్లుగాను మిత్రులుగాను ప్రవేశమిప్పించవలెనని తీర్మానింపఁబడినది. ఆంధ్రయువతులకొరకు ప్రత్యేకముగా కళాశాలనొకదానిని ఆంధ్రదేశములో స్థాపించవలెననియు తీర్మానింపఁబడినది. సంతాననిరోధపద్ధతులవలంబించవలెనను ప్రతిపాదనమోడిపోయెను. వివాహవిచ్ఛేదనశాసనమును ప్యాసు చేయవలెనను ప్రతిపాదన ముపసంహరించుకొనబడెను.

మొత్తముపైని సభలో ప్యాసయిన తీర్మానములన్నియు ప్రతినిధుల దేశాభిమానమును, కాలజ్ఞానమును, విద్యానురక్తిని, సేవాసక్తిని, విశాలదృష్టిని తెలియఁజేయుచున్నవి. కాని మదరాసు శాసనసభలో ఆంధ్రరాష్ట్రి మేర్పాటుచేయవలెనను తీర్మానము ప్యాసుకాబడిన యిట్టి సమయమున జరిగిన ఇట్టి ముఖ్యమైన సభలో అట్టి తీర్మానము ప్రతిపాదింపఁ బడకుండుట యెంతయు విచారకరము. శ్రీమతులుకొల్లా కనకవల్లి తాయారమ్మ,పాదర్తి సుందరమ్మ, చుండూరు రత్తమ్మ, యస్. సుభద్రమ్మ (బియే, ఆనర్సు)గార్లు 15_11_1933 దేవదత్తము పత్రికయందు యీవిషయమును గూర్చి యిట్లు వ్రాయుచున్నారు.

"ఈనెల 4, 5 తేదీలయందు ఏలూరులో జరిగిన సప్తమ ఆంధ్రరాష్ట్రి మహిళాసభకు అధ్యక్షతవహించిన శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రి తీర్మానమును విషయనిర్ణయ సభలో శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మగారు తీసికొనివచ్చినప్పుడు నిరంకుశముగా ఆ తీర్మానమును త్రోసిపుచ్చినది. ఇది కూడదని ప్రతినిధురాండ్రు తీవ్రంగా వాదించినను పెడచెవినిబెట్టిరి. ఈతీర్మానము ఆంధ్రదేశమునందంతటను ప్రతి స్థానికసంఘము, లోకలుబోర్డు ఏకగ్రీవముగా తీర్మానించు నిర్వివాదాంశము. అట్టి సందర్భములో విద్యావివేకములగలిగి శాసనసభలో ప్రాతినిధ్యము వహించి దేశముయొక్క రాజకీయపరిణామము పూర్తిగా నెరిగిన డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారు ఇట్టి సంకుచితభావముతో ప్రవర్తించుట శోచనీయము. ఈమె స్వయము ఆంధ్రస్త్రీ అగుటవల్లను, తమిళుల సంపర్కము పూర్తిగా కలిగియుండుటచేతను, ఆంధ్రుల హృదయమును సక్రమముగా గుర్తించక ఇట్లు ప్రవర్తించినదని తలంపవలసియున్నది."

ప్రస్తుత రాజకీయపరిస్థితులనుబట్టి కాని మఱియేయితర కారణములనుబట్టి గాని యిట్టి తీర్మానమును చర్చకు తీసికొని

వచ్చుట సవ్యముకాదని అధ్యక్షురాలు తలంచినచో తలంచవచ్చును. వేఱువిధముగా తలంచుమని ఆమె నెవ్వరును నిర్బంధింపఁజాలరు. కాని ఆంధ్రరాష్ట్రీయ మహిళా సభవంటి సభలో యీవిషయము చర్చకు తేబడదని కాని, తేబడినప్పుడు తాను త్రోసిపుచ్చుట భావ్యమని కాని ఆమె యూహించి యుండదని మన మనుకొనవలెను. ఆ తీర్మానము తేబడుననియు, తెచ్చినచో త్రోసిపుచ్చుట భావ్యము కాదనియు ఆమె యూహించినచో అధ్యక్షపదవి నంతఅనాలోచితముగ నంగీకరించియుండదు. తమ మహాదాశయములతో సంపూర్ణ సానుభూతి కలవారని నిశ్చయముగా తెలుసుకొననిదే యితర విధములగు యోగ్యతలనుమాత్రమే చూచి అధ్యక్షుల నెన్నుకొనుట సాధారణముగ అనేక ఆహ్వానసంఘములు చేయు పొరపాటై యున్నది. ఇకముందు మహిళా సభవారు తమ అధ్యక్షుల నెంచుకొను సందర్భమున యెక్కువ విమర్శతో ప్రవర్తింపవలసియుండును. మఱియు అధ్యక్షపదవికి అంగీకరించఁదలచుకొనువారుకూడ తమ్మా పదవికి పిలచినదేతడవుగ వినతిపత్రములకు వియ్యమ్మణలకు ముగ్ధులుకాక తా మేసభల కధ్యక్షతవహింపబోవుచున్నారో, అచ్చటికి వచ్చువారెవరో, వారు తేగల తీర్మానము లెట్టివియో, వాటియెడల తమకుగల సానుభూతి లేక భేదాభిప్రాయ మెట్టిదో కొంచెము ముందువెనుక లాలోచించుకొనుచో తమవల్ల సభవారికెట్టి యాశాభంగమును కలుగదు. ఇంతకును శ్రీమతి రెడ్డిగారు తమ కా ప్రతిపాదనమునందు ఇష్టమే లేకున్నచో లేదని చెప్పుచునే, అధికసంఖ్యాకు లొప్పుకొన్నచో దానిని చర్చకురానిచ్చి అధికసంఖ్యాకుల యిష్టముపైని దానిని నెగ్గుటకో ఓడుటకో విడచిపెట్టి, తాను తటస్థముగ నున్నచో తన గౌరవమునకెట్టి లేశమును కలుగదు. ప్రజాస్వామ్యవాదమును ప్రాతినిధ్యసిద్ధాంతములను అంగీకరించువారు, ప్రజల తీవ్రాభిప్రాయముల నిట్లు 'పెడచెవిని' పెట్టకుండగనే, తమబాధ్యతలను తాము నిర్వహించుటకు సంపూర్ణావకాశము కలిగి యున్నప్పుడుకూడ, 'నిరంకుశముగా తీర్మానమును త్రోసిపుచ్చ' వలసినంత ఆవశ్యకత యేమితటస్థించెనో మా కూహింప రాకున్నది.

కీ॥ శే॥ ధర్మపురి రుక్మిణమ్మగారు:—

ఈమె ఎగ్మూరునందున్న డాక్టరు డి. వెంకప్పగారి సహధర్మపత్ని. వీరు అఖిలభారత యల్. యమ్. పి. సంఘమునకు అధ్యక్షులుగా నుండి యల్. యమ్. పి.లకు తక్కిన తరగతి డాక్టరులతో తుల్యమైన గౌరవోద్యోగములు లభింపజేయుటకై సలుపుచున్న కృషి ఏతత్సంఘమునకు చెందినవారందఱికిని తెలియును. శ్రీమతి రుక్మిణమ్మగారు ఆంగ్లభాషను మెట్రిక్యులేషనువరకు చదివినవారగుటచేతను, సుప్రసిద్ధప్రవీణులగు వెంకప్పగారికి ధర్మపత్ని యగుటచేతను, ఏవైద్యకళాశాలలో నెట్టిపరీక్షయు ప్యాసుకాకున్నను, అనుభవమువలన అనేకవైద్యవిషయములు మందులు ప్రయోగములు నెఱింగినదై తనపిల్లలకు బంధువులకేగాక యితర రోగులకుగూడ సేవచేయుచు భర్తృ

గారికి కుడిభుజమై యుండెడివారు. ఈమె నెల్లూరుకాపురస్థులు. డి. సి. కృష్ణయ్యగారి కుమార్తె యగుటచేత తెలుగు మాతృభాష. అరవప్రాంతమున నునికిచే అరవము ధారాళముగ చదువ వ్రాయ నేర్చినది. ఆంగ్లమును లెస్సగా నభ్యసించినది. గానవిద్యయందు మంచిప్రవేశము గలది. ప్రజాసేవా తత్పరచిత్త. ఎగ్మూరులోగల మహిళాసమాజపుటభివృద్ధికేమి, సంగీతసభల యేర్పాటులకేమి ఆమె మిక్కిలి శ్రమపడినది. కాని నిరాడంబర జీవియగుటచేత నెట్టిగౌరవ స్థానములకైగాని శుష్కప్రఖ్యాతికైగాని ప్రాకులాడిన పాపమునంబోలేదు.

ఆంధ్ర ప్రాంతములలో సంఘసంస్కారమను శబ్దమింకను వినబడకుండునప్పుడే వెంకప్పగారు సంస్కార వివాహమును చేసుకొనిరి. వెంకప్పగారు బడగనాటి బ్రాహ్మణులు. ఈమె వెలినాటికి చెందినది. ఈ వివాహమునుగూర్చి ఆదినములలో సంఘమువారెన్నో ఆక్షేపణలు చేసిరిగాని శ్రీశృంగేరీ పీఠాధిపతులే యిట్టివివాహములు శిష్టసిద్ధములనిచెప్పి ఆ ఆక్షేపణలనెల్ల చల్లార్చిరి. ఈమె దయార్ద్రచిత్త. పేదసాదలకేమి, బంధువర్గములకేమి, అవసరమైనప్పుడెల్ల, వారడుగనిదే తగిన సహాయము చేయుచు, భాగ్యభోగములకై ప్రాకులాడక సాధారణ జీవనమును గడుపుచుండెడిది. ఈమెకు హిందూమతాచారములయందు శ్రద్ధాభక్తు లత్యధికము. ఉదయముననే మేల్కాంచి స్నానము చేసి, శుచియై, జపములు, పూజలు, ఈశ్వర ప్రార్థనలు చేయుటయేతప్ప, కాఫీగతప్రాణియై మనలేదు. తీరిక సమయములనెల్ల గ్రంథపఠనమునందే, వినియోగించుచుండెడిది. ఈమె పఠించెడి గ్రంథములొక చిన్నగ్రామ గ్రంథాలయమంత యుండుననిన యీమె విద్యాసక్తి నేమనవచ్చును! ఉన్నతవిద్యల నభ్యసించుచున్న యిద్దరు పుత్రులను, ఆరేడు సంవత్సరములలోపలి వయస్సుగల నలుగురు పుత్రికలను, ఉత్తమ శీలుండును, ఉదారచిత్తుండునునగు భర్తను నిరాశ్రయులనుజేసి ముప్పదియేడవయేటనే స్వర్గధామముం జొఱ గొన నాకస్మికముగ బయలుదేరిన యీమె మరణ మెవ్వరికి దుఃఖము కలిగింపదు! ఈమె ఆంధ్రభాషయందు రచించిన సాంఘిక నవలయొండు అచిరకాలమున ముద్రింపఁబడగలదు. ఆంధ్రయువతు లీమెగ్రంథములను పఠించియు, జీవిత చరిత్రము నెఱింగియు ఆమెవలె ఆదర్శగృహిణు లగుదురు గాక!

కెనడావనితల దుర్భరదారిద్ర్యము:—

నిరుద్యోగ దారిద్ర్య సమస్య భరతఖండమువంటి పేద దేశమును కెనడావంటి శ్రీమంత దేశమునుగూడ నిష్పక్షపాతముగ నొక్కతీరున పీడించుచుండుట మిక్కిలి దుఃఖకరమగు విషయము. ఇట్టి సమయమున నేదేశమువారైనను తమ దుఃఖములకై ముందుగా నేడ్వవలెనో, యితరుల దుఃఖములకై వగవవలెనో, లేక రెండిటికిని రెండు కండ్లనిండ నీరు నించుకొనుచు ఒకేసారి మొఱ్ఱలుపెట్టుకొనవలెనో చెప్పశక్యము కాకున్నది. కెనడాదేశమున కేమిలోటు? పాడికా?

పంటకా? దూదికా? యంత్రములకా? ధనమునకా? అంగట్లో అన్నియు నున్నవి, అల్లుని నోట్లోశనియున్నది యన్నట్లున్నది.

సకలసంపదలతో తుల దూగుచున్న కెనడాదేశమున వేనవేలు యువతులకు కడుపునకు అన్నమును, మానము కాపాడుకొనుటకు బట్టయు కఱవగుచున్నవనిన దీనికి ఉత్తరవాదులెవరు? సకలమును తమ కోఠారములలోఁ గూడవేసుకొని తామనుకొన్నంత పెద్దఖరీదులు వచ్చువరకు దానిని విడుదలచేయక తగలపెట్టుచుండు ధనాఢ్యులగు సాహుకార్లు, బ్యాంకర్లుకాక వేరెవ్వరు? పేదవారల ప్రాణమానములకంటె భాగ్యవంతులధనమున కేనాడు ప్రాముఖ్యమెక్కువ యీయబడినదో ఆనాడే ఆధునిక ప్రపంచముయొక్క నీతి పతనముకా ప్రారంభించినది. అప్పటినుంచి మేడలు, మిద్దెలు, నగరములు, రైళ్లు, విమానములు, యంత్రములు, పాఠశాలలు, పత్రికలు, రేడియోలు, ఆస్పత్రులు మొదలగు భోగములు పెఱుగజొచ్చినవి కాని, వానిని వేనిని యుపయోగించుకొనలేక మిట్టిమిట్టిచూచుచు ఏడ్వవలసిన దారిద్ర్యమన్ని దేశముల ప్రజలను నావేశింపఁ జొచ్చినది. ఆధునిక నాగరకత మేడిపండువలె పైకెన్ని మెఱుగులతో కనిపించుచున్నను, అసంఖ్యాకములగు దురాశ, దారిద్ర్యము, అవినీతి పురుగులు దాని నిండ మిలమిలలాడుచు భయంకరముగ ప్రాకుచునే యున్నవి.

ఇట్టి దుర్దశ పేదదేశముల పేదవారలను కంటె భాగ్యవంతములగు దేశముల పేదవారలను మఱీ ఘోరముగ పీడించుచున్నది. కెనడా దేశములో గంజికి కఱవైన యువతులకు లెక్కలేదట. భారత దేశమునకువచ్చి శ్రీరంగనీతులు చెప్పుచు సాంఘిక సేవామార్గంబుల నుపదేశించు పాశ్చాత్యులిట్టి ఘోరదృశ్యములకేమి జబాబు చెప్పుదురు? ప్రపంచపు టార్థికవిధానము తారుమారు కానిదే సాంఘిక సేవలను పైపై పూతలవలన నిట్టి దుస్థితి యెంతవరకు తొలఁగఁ గలదు?

జాతీయ నిరుద్యోగి మహాసభ (National Congress of unemployed) యొక్క సభ్యురాలైన మిస్. ఫ్లోరాహాటనుగారు కెనడా ముఖ్యమంత్రి బెన్నెట్టుగారికి వ్రాసిన లేఖలోని విషయములు పఠించిన నెట్టివానికిని గుండెలు బ్రద్దలవకమానవు.

“బట్టలా! అయ్యో! యీపేదపడుచులకు కట్టుకొనుటకు బట్టలుకూడ నెట్లువచ్చును! ఈదీనవనితలు నలుగురేసి ఒక్కొక్క యఱలో నివసింతురు. వారిలో వీధిలోనికిపోవు వనిత యెవరైయో కాస్త మేనికిసరిపడు బట్ట కట్టుకొని తననిమిత్తము గంజి తెచ్చుకొనబోవును. ఇంటిలోనుండువారికి వీధిగుమ్మములోనికి రాదగినంత మానముకాపు బట్టయైన నుండదు. ఆమెరాగానే ఆబట్ట నింకొకరికిచ్చి వేరొక చిన్న పీలికను మొలచుట్టు చుట్టుకొని కూర్చొనును. పిమ్మట నామె గంజి తెచ్చుకొనును. ఇట్లు నలుగురును సర్దుకొనుచుందురు.

"ఈ దారుణ పరిస్థితులను తొలగించుటకై తమ కేదేని తగిన చర్య తీసుకొనకుండినచో, వేనోళ్ళనరు నగరమునందున్న యిట్టి నెలతలందరును నిరాయుదాసీనతను ఖండించునిమిత్తము దిగంబరులై పురవీధులందు సంచారము చేయుదురు."

కెనడా దేశమునకింతకన్న వేరు సిగ్గుకాని అవమానముకాని యుండనేరదు. ఇట్టి సిగ్గు ఒక కెనడా దేశమునకేగాదు, సకలనాగరక దేశములకుకూడనై యున్నది. అయితే నాగరక దేశములెల్లయు నింకా వస్తువులను పెంచుట, వర్తకమును వృద్ధిచేయుట- పేద దేశములను దోచుట, శ్రీమంతములగుట, ఇందుకొరకు కావలసినచో తమలో తాము యుద్ధములు చేసుకొనుట అను సమస్యలలో కొట్టుమిట్టాడుచున్నవి కాని, పరమేశ్వరుడు తమ దేశములకిచ్చిన సంపదలతో సంతృప్తి పొంది దీనుల కష్టములను నివారణచేయుదమను సంకల్పమును వంటను పట్టించుకొన్నట్లు కానుపించవు.

స్టాదముకమిటీ సిఫారసులు:—

తిరువాన్కూరు సంస్థానపు విద్యాశాఖ వారితరఫున స్టాదము కమిటీవారుచేసిన విద్యావిషయకమైన సిఫార్సులుకొన్ని మిగుల ప్రశంసాపాత్రములుగ నున్నను రెండు సిఫార్సులు స్త్రీలోకమునకు అసంతృప్తిని కలిగించకమానవు. సంస్థానములోనున్న మొదటి తరగతి మహిళా కళాశాలను రెండవ తరగతి కళాశాలగ మార్చవలెననియు, వివాహితలకు విద్యాశాఖలోని ఉన్నతోద్యోగము లీయరాదనియు చేసిన సిఫార్సులు ఉత్తమ విద్యావతుల ఖండనకు పాత్రమగుటలో నాశ్చర్యము లేదు. స్త్రీవిద్యలో తిరువాన్కూరుసంస్థానము హిందూదేశములోనిసమస్త ప్రదేశములనేగాక కొన్ని పాశ్చాత్య దేశములనుగూడ తలదన్నుచున్నది. కళాశాలలలో ఉత్తమ తరగతులలో నుత్తీర్ణులయినవారికున్నతోద్యోగములు లభింపజేయలేనంత మాత్రమున ఉత్తమవిద్యాద్వారములను వారికి మూసివేయుట వివేకముకాదు. చదువుకొనువారందరును ఉద్యోగములకే చదువకపోవచ్చును. చదువుకొన్న వారందరికి ఉద్యోగము లిత్తుమని విశ్వ విద్యాలయము వారు పూచీకత్తు నివ్వలేదు; కనుక అభిలాషకలవారి కవకాశమును తక్కువచేయు ఇట్టి సిఫార్సులను ప్రభుత్వము వారంగీకరింపకుందురుగాక యని కోరుచున్నాము.

రాజమహేంద్రవర స్త్రీసమాజము:—

రాజమహేంద్రవర స్త్రీ సమాజము 1918 లో అఖిలభారత నారీమహాసంఘమునకు శాఖగా నెలకొల్పబడినది. స్త్రీలకు సంగీతము, చిత్రలేఖనము, హిందీ, చేతిపనులు మొదలగునవి నేర్పుట సమాజమువారి ఆశయము. ఇది అప్పటినుండియు దినదినాభివృద్ధినంది, అరువుకొంపలను వదలి నేటికి స్వంతభవనము నపేక్షించుచున్నది. తూర్పుగోదావరిజిల్లా బోర్డువారు రు 1116లును ఇతరులు సుమారేడువందల రూపాయలును ఇందుకొరకు విరాళముల నిచ్చిరి. స్త్రీవిద్యాభిమానులెల్లరును దీనికి తగిన సహా

యము చేసి, యీ నిర్మాణ నిధికి కోశాధికారియు, రాజమహేంద్రవర కేంద్రసహకార బ్యాంకు కార్యదర్శియు అగు శ్రీయుత పాలకోడేటి గురుమూర్తిగారి పేర పంపించవలెనని కార్యనిర్వాహకసభ్యు రాంధ్రులు కోరుచున్నారు. సోదర సోదరీమణులెల్లరును తగిన సహాయము చేయుదురుగాక!

నగలముచ్చట:—

బెజవాడలో ఈమధ్యపద్మశెట్టి వీరరాజుగారి కుమార్తె మీనాక్షి అను బాల 16వ తేదినుండి కనుపించలేదట. ఆమెకొరకై వెదకుచుండగా 18వ తేదిని బెజవాడదరి భవానీపురములో కృష్ణానదియొడ్డున నొకమొక్కజొన్న చేలములో నామె శవము దొరికెనట. ఆమె శరీరముపైగల 170 రూపాయీల నగలలో 50 రూపాయీల నగలుమాత్రమే కనుపించినవి. పీక పిసికినట్లు వైద్యపరీక్షవలన తేలుచున్నది. నగలకాశించి దొంగలు హత్య గావించిరనుట శాటంకమున్నదా? ఆంధ్ర యువతులు పిల్లలయందములు ముచ్చటలకంటె వారి ప్రాణములెక్కువ ప్రియమైనవని భావించుకొనుచు వర్తించుచో మన ప్రాంతములలో సర్వసామాన్యముగ సంభవించు ఇట్టి విపత్తులనేకములు తొలగగలవు.

అస్పృశ్యతానివారణ:—

భీమవరం వాస్తవ్యులును సుప్రసిద్ధ చిత్రకారులును అగు అంకాల వెంకటసుబ్బారావుగారు వ్రాసిన అస్పృశ్యతా నివారణమను వర్ణచిత్రమును అప్సర, పల్లెపడుచు, సరస్వతి యను మఱిమూడు సాధారణ చిత్రములును చూపరకెంతయు ఆనందమును గూర్చును. అస్పృశ్యతా నివారణమను చిత్రములో మహాత్ముడు బ్రహ్మతేజముతొలుక హిందూమత సనాతనాచార్యుల తేజస్సుతో నొక మహాదేవాలయ ద్వారముచెంతనిలచి అచ్చట సమావేశమగు సకలవర్ణములవారికి అస్పృశ్యతా నివారణ సిద్ధాంతముయొక్క మహత్వము నుపదేశించుచున్నాడు. హరిజనులు విచారకళతోను, బ్రాహ్మణాదులు పశ్చాత్తాపతప్తమగు నూతనదృష్టితోనుదాని నిదిని యూహించుచున్నారు. యమధర్మరాజు వారందరి మధ్యనుండి అస్పృశ్యతయను రక్కసిని పాశములుకట్టి పైకీడ్చుకొని పోవుటచేత వారెల్లరు నొకరిచెంతనొక రెట్టిసంకుచిత భావములును స్వల్పత్వబాధలును లేక ఏకాశయులువలె నానందముగ నున్నారు. 18" × 12" సైజు వెల రు 0_6_0మాత్రము. మహాత్ముడాంధ్రదేశమువచ్చుసరికి ఇంటింటను వీధివీధిని రాణించవలసిన చిత్రమును, దృశ్యమును. తక్కిన మూడుచిత్రములును కూడ చిత్రకారుని సౌందర్య పరిగ్రహణ శక్తిని భావచిత్రీకరణ నైపుణ్యమును చాటుచున్నవి. డాక్టరు పి. సి. రే. మొదలగు మహాశయుల ప్రశంసను బడసినది.

శుద్ధప్రతి

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| పుటసంఖ్య | 688 | 772 |

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజెంటేటివ్ అఫ్ న్యూస్. |
| మచిలీపట్టణము: | సి. వి. అవధాన్లుగారు, ఇన్సూరెన్సుబీరో. |
| ,, | పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు. |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మిబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడ్డు,(మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియా రూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాటిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| తాడేపల్లిగూడెం: | కాశీరాజు శ్రీరాములుగారు. |
| జెమ్ షెడ్ పూర్: | టి.వి. రమణయ్యగారు, C/o డి ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్. |
| బరంపురం: | నిష్టల కృష్ణమూర్తిగారు, న్యూస్ పేపరు ఏజంటు. |
| గుంటూరు: | వెల్ కం అండు కంపెని. |
| ఏలూరు: | సనకా రాజారావుగారు, పవరుపేట. |
| అనకాపల్లి: | గ్రంథి కన్నయ్యపంతులుగారు, గాంధిమార్కెటు. |
| సామర్లకోట: | ఆరాధ్యుల మూటయ్యగారు మర్చంటు. |
| పిఠాపురం: | మొ. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. ఎం. నూకరాజు, ఆంధ్ర |
| రాజమండ్రి, విశాఖపట్టణం: | ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు. |
| మదరాసు: | పై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు. |
| నెల్లూరు: | భట్టారం లక్ష్మినారాయణ శర్మగారు, గాంధిచౌకు. |
| తణుకు: | వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు. |
| బెజవాడ: | ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట. |
| పాలకొల్లు: | లొల్లా వెంకటరావుగారు. |
| నరసాపురము: | కటికల సూర్యారావుగారు, కుమ్మరివీధి. |
| భీమవరము: | అమిరపు శేషాచలశర్మగారు. |
| గుడివాడ: | ఐ. ఆర్. కే. శాస్త్రిగారు. |
| ఒంగోలు: | తాతా జాలయ్యశెట్టిగారు, వర్తకులు. |
| రంగూను: | వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి. |
| కర్నూలు: | చెట్టి రోశయ్య చెట్టిగారు, వర్తకులు. |
| చిత్తూరు: | వాటంబాటి. వెంకటరామయ్యగారు 163 బజారురోడ్డు. |
| ఖరగ్ పూర్: | ఆదిభట్ల తరణయ్యసిద్ధాంతిగారు, 63 B 1 Unit 10. న్యూ సెటిల్మెంటు. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.